# కీటకాల ఆకాశహర్మ్యాలు



చిట్టి చెదలు నిర్మించుకున్న బారెడు మట్టికోట ఇది. దీని నిర్మాణ చాతుర్యం మాత్రం అసాధారణం. తోటలు, శీతల నియంత్రణ వ్యవస్థలు, నర్సరీలు, నివాస విభాగాలు, సెల్లార్లు, బావులు, వెలుతురు చిమ్నీలు, రాజనివాసాలు వంటి విభాగాలెన్నో ఈ కోటలో ఉంటాయి. తమ శరీరం నుంచి స్రవించే లాలాజలాన్ని మట్టితో కలిపి తయారు చేసుకున్న కాంక్రీటుతో చెదలు సమశీతోష్ణ ప్రాంతాల్లో ఈ ఆకాశ హర్మ్యాల్ని నిర్మించుకుంటాయి. వీటి గోడలు దాదాపు 50 సెంటీమీటర్ల మందం ఉంటాయి. వీటిలోని భూగర్భ తోటల్లో చెదలు తమకు అవసరమైన శిలీంధ్రాలను పెంచుతాయి. కొన్ని వందల నుంచి లక్షల సంఖ్య వరకు చెదలు వీటిలో నివాసముంటాయి.

సంపుటి : 29 | సంచిక : 7
ఆగస్టు : 2006 | 343వ సంచిక

నవ నవలా వేదిక

# చతుర



## ఈ నెల నవల

అయిన వాళ్ల కోసం తన జీవితాన్నే
పణంగా పెట్టి వాళ్ల బతుకుల్లో
వెలుతురు పూలు పూయించిన
యువతి గాథ

# అరవింద

—కోలపల్లి ఈశ్వర్

10వ పేజీలో



బొమ్మలు: పినిశెట్టి



రచయితలకు ప్రత్యేకం

కథలు-కబుర్లు - 21

# పరిశీలనే ఇతివృత్తం, పరిష్కార క్రమమే కథనం



"లోకమంతా అవినీతిమయమే గద అనుకుంటే కథలేం రాస్తాం?" అని ప్రశ్నించినవాడే కథానాయకుడు.

- సిరిల్ కానలీ

కథల్లో మనుషులుంటారు. (ఈసప్ కథల్లో కూడా జంతువులకు, పక్షులకు మానవ స్వభావాలే ఉంటాయి) ఆ మనుషుల్లోని వైవిధ్యం, విలక్షణత, వ్యక్తిత్వం ఎంత బాగా చిత్రించగలమన్నదే రచయిత నైపుణ్యానికి గీటురాయి.

తెలిసిన వాళ్ల గురించే రాస్తాం. కాని తీరా రాయటానికి కూర్చున్నప్పుడు తెలుస్తుంది- నిజానికి వాళ్ల గురించి మనకు తెలిసింది చాలా తక్కువని. కథలోని మనుషులు మన కన్నా భిన్నంగా ఉండగలరని మొదట అంగీకరించాలి. లేకపోతే "నా లోని నేనుల్ని" అన్ని పాత్రల్లోనూ సృష్టిస్తాం. మనకు తెలిసిన వ్యక్తులెవరు? అంటే మనం బాగా పరిశీలించిన వాళ్ళెవరు? ఆత్మీయులు, సన్నిహితులు అనుకున్న వాళ్ళ గురించి కొన్ని కనీస విషయాలు కూడా మనకు తెలియవని రాసేటప్పుడు తెలుస్తుంది.

మనుషుల స్వభావాలు, వృత్తులు, వాతావరణం, కథా స్థలం, వీధి, ఇల్లు, మాట్లాడే పద్ధతి, అలవాట్లు వగైరా ఎంతవరకు తెలుసు? 'రెండు నాల్కల ధోరణి' అని నిందార్థకంలో వాడతాం. చాలామందికి ఇది సహజ లక్షణం.

దీనివల్ల కథ మంచి మలుపులు తిరిగే అవకాశమూ లేకపోలేదు. వెరసి, మనం ఎన్ని ప్రశ్నలు వేసుకోగలిగితే వాటికి సమాధానాలు వెతుక్కునే క్రమంలోనే కథకు గట్టి పునాది ఏర్పడుతుంది. "మనస్తత్వం" అనే మాట తరచు వాడతాం. కాని ఆ అదృశ్య పదార్థం ప్రవర్తనలో, సంభాషణలో, సంబంధాలలోనేగా వ్యక్తమవుతుంది? మూస పాత్రలకు బదులుగా, భిన్న వ్యక్తిత్వాలున్న పాత్రలను సృష్టించగలిగిన వాళ్లే మంచి రచయితలు.

'పిసినారి' అంటే సుబ్బిశెట్టే కానక్కర్లేదు. నాటకంలో ఉన్నదొక్కడే గిరీశం. కాని మనం రోజూ రకరకాల జిత్తులమారి గిరీశాల నెందర్ని చూడటం లేదు!

మనుషులెదుర్కొన్న సమస్యలకు పరిష్కార క్రమంలో కలిగే పరిణామాలే కథ. ఎవరి వల్ల ఎవరికి సమస్య వచ్చింది? అసలా వ్యక్తుల్లో ఉన్న తేడా

లేమిటి? వాళ్ళ అవసరాలేమిటి? అనుకున్న దానికీ, జరుగుతున్న దానికీ మధ్యనున్న వైరుధ్యమేమిటి? లాంటి పరిశీలనే ప్లాటుగా మారుతుంది.

"ఏది వాస్తవం? " అన్న చర్చ నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది. మన స్వభావాని కనుగుణంగానే అది మనకు కనిపిస్తుంది. ఎవరి భ్రమ వాళ్లది. మనల్ని ఆవహించిన 'భ్రమ'ను పునఃసృష్టి చెయ్యటమే కళ.

దృశ్య మాధ్యమంలో సంగీతానికున్న ప్రాధా న్యత రచనలో సంభాషణలకుంది. కథను ముందుకు నడిపించడమే కాదు. దానికి రంగు, రుచి, వాసన కూడా కల్పిస్తాయి.

> "వ్యక్తులు, ప్రదేశాల వర్ణన వల్ల మంచి రచన సృష్టి కాదు. రచయిత దార్శనికత (కాంతి) వాటిని వెలిగిస్తుంది. అందువల్ల ఒక నిత్యనూతన అనుభవంగా రచనను చూడలేని వ్యక్తి రాసినా అది నిరర్థకం"
>
> **- లియో టాల్‌స్టాయ్**

మనలో సహన శక్తి సహజంగా ఉంటుం ది. అన్నిరకాల బాధల్ని అన్యాయాల్ని, సంతో షాల్ని, ఉద్వేగాల్ని కూడా జీర్ణం చేసుకుం టారు. కాని కొందరికిది సాధ్యం కాదు. కనీసం ఏదో ఒక దశలో స్పందించక తప్పదు అనుకుంటారు. దాన్ని కాగితం మీద పెట్టి కథా రూపంలో ప్రెషర్ కుక్కర్‌లా విజిల్ వేసేవాళ్ళు రచయితలు.

మెజీషియన్లు మనుషుల్నీ, వస్తువుల్నీ అదృశ్యం చెయ్యటానికి వాడే ఒక రొటీన్ ట్రాక్ వస్తువూ, నేపథ్యమూ ఒకే రంగులో చూపటం. ఉదాహరణకు నీలి నేపథ్యంలో నీలి రంగు వస్తువు కనిపించదు. నేపథ్యా నికీ, వ్యక్తికీ ఉన్న వైరుధ్యమే కథను నిర్దేశి స్తుంది.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

# యుద్ధము - శాంతి

1861

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

నవలాదీపం




(కిందటి సంచిక తరువాయి)

ఏడేళ్లపాటు రాసిన సుదీర్ఘమైన నవలలో శైలీ, కథన సామర్థ్యం ఆసాంతం హెచ్చు తగ్గులు లేకుండా ఉండటం అసాధ్యం. ఉదాహరణకు పరాజయం తర్వాత మాస్కోనుండి నెపోలియన్ సైన్యాల విరమణ గురించి అనేక పేజీలు వివరిస్తాడు. పాఠకులకు ఆసక్తి కలిగించని కథకు నేరుగా సంబంధం లేని సమాచారం ఇది. పఠనాక్రమంలో ఎవరైనా ఆవలిస్తే తప్పు పట్టలేం. ఇదంతా ప్రధాన పాత్ర పియార్ మీద గొప్ప ప్రభావం చూపి అతని జీవితంలో ముఖ్య పరిణామాలకు దారి తీసిందంటాడు టాల్‌స్టాయ్. నవలలు ఎన్‌సైక్లోపీడియాల్లాగా ఉండాలంటే ఇలాగ రాయక తప్పదు. కాని ఎందరు పాఠకులకు అంత కుతూహలముంటుంది?



యుద్ధము- శాంతి నవలలో అయిదు వందలకు పైగా ఉన్న పాత్రలన్నింటిలోకే, మనసును హత్తుకునేది సైనికుడు ప్లేటో కరటాయెవ్. రాజులు, ప్రధాన మంత్రులు. మిలిటరీ జనరల్స్ గెలుపు-ఓటమి గురించి ఆలోచిస్తారు. కాని ఎటువైపైనా సైనికుడి పని యుద్ధం చెయ్యటమే. అధికారమదంతో కళ్లకు పొరలు కప్పవతడికి. ముఖాముఖి శత్రువును ఎదుర్కొని, గాయపర్చి, గాయపడి ప్రాణత్యాగానికి సిద్ధంగా ఉంటాడు.

'ఇలాంటి వ్యక్తులే దేశానికి వెన్నెముక' అని టాల్‌స్టాయ్ గాఢంగా నమ్మాడు.

ఆ రోజుల్లో నవలా రచయితలందరూ ముగింపు పకడ్బందీగా ఉండాలనుకునేవారు. అన్ని సాహస కార్యాల తర్వాత హీరో హీరోయిన్లు పెళ్లి చేసుకొని సుఖంగా చిరకాలం కాపురం చేస్తారు. గంపెడు పిల్లల్ని కంటారు. విలన్ మరణించాలి. లేదా ఆస్తి పోగొట్టుకుని దారిద్ర్యంలో అనాథాశ్రమానికి చేరాలి. చేసిన పాపాలకు శిక్ష అది. కాని ఇదంతా ఒకటి రెండు పేజీల్లో మొక్కుబడిగా ముగించేవారు. ఇలాంటి చివరి అధ్యాయాన్ని టాల్‌స్టాయ్ అత్యంత ప్రతిభావంతంగా మలిచాడు.

కథ ముగిసిన ఏడేళ్ల తర్వాత- నికోలస్ రాస్టోవ్ ఒక ధనిక స్త్రీని పెళ్లాడి పిల్లాపాపల్తో సుఖంగా ఉన్నాడు. పియెర్ భార్య మరణించింది. ఆ తర్వాత అతడు నటాషాను చేసుకున్నాడు. కాని వివాహ బంధంలో రొమాన్సు లేదు. రొటీన్‌గా, డల్‌గా జీవితం గడుపుతున్నారు. మధ్య వయసు వచ్చింది. సుఖము, సంతృప్తి, నిర్లిప్తత కోరికల్ని చంపేస్తాయి. చలాకీపిల్ల నటాషా గయ్యాళి భార్యగా మారింది.

రాస్టొవ్‌కు జీవితం పట్ల ఏ కుతూహలమూ లేదు. ఏదో జరిగిపోతుంది. చాలు. ఈ సుఖ సంసారాల్లో దాగిన విషాదం పాఠకుల్ని షాక్ చేస్తుంది. టాల్‌స్టాయ్ నిరాశావాది కాదు. కాని జీవితమింతే అని అతడికి తెలుసు.

1805 నుండి 1812లో నెపోలియన్ పరాజయం దాక చిత్రించిన రష్యన్ సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక చరిత్రలో అనేక పార్శ్వాలతో పాఠకుడు తరచు దారి తప్పిపోయే ప్రమాదం లేకపోలేదు. మొదటి అధ్యాయాలలో అసలు కథ ఏమిటో తెలియదు. పైకి పరస్పర సంబంధం లేనట్టు కనిపించే సంఘటనలనేకం జరుగుతాయి. అయితే ఇంత సంక్లిష్టమైన ఇతివృత్తాన్ని అర్థవంతంగా మలచటమే టాల్‌స్టాయ్ మేధస్సు ఆస్టర్లిట్జ్ యుద్ధంలాంటి భయానక సంఘటనలూ, టీ కప్పులో తుఫానులాంటి చిన్న కుటుంబ సమస్యలూ ఒకదాని వెంటే ఒకటి సాగుతాయి. ఒక బాత్‌రూం డాన్సు, ఒక ప్రేమ కూపం, వేటి దృశ్యం, మత చర్చలు, చండ శాసనుడిలాంటి తండ్రిని చూసి జడుసుకున్న చిన్న పిల్లలు, రాజకీయ విశ్లేషణలు, పడుచు పిల్లలకు వ్యాఖ్యానాలు చేసిన మోసగాళ్ళు, క్రిస్మస్ వేడుకలు, పెళ్లిళ్లు, చావులు ఒకటేమిటి- టెలిస్కోపు, మైక్రోస్కోపుల గుండా ఒకేసారి జీవితాన్నంతా దర్శించగలిగిన అనుభవం పాఠకుల్ని ఉప్పెనలా ముంచెత్తుతుంది. ఇదంతా ఏమిటి? దీని అర్థం ఏమిటి? అని ప్రశ్నిస్తే ఇదే "నువ్వూ, నేనూ" అంటాడు టాల్‌స్టాయ్.

నెపోలియన్ దండయాత్రకు ముందు 'యుద్ధము-శాంతి' రెండూ వేరుగా ఉంటాయనుకునే వారు సరిహద్దులో సైనికులు. నగరాల్లో నిత్య జీవిత సంరంభంలో సామాన్య పౌరులు. సెలవు మీద వచ్చిన సైనికులకు రోజువారీ నగర జీవితం ఆకర్షణీయంగా కనిపిస్తుంది.

అంతలో- ఆకాశం విరిగి మీద పడ్డట్టుగా రాత్రికి రాత్రి యుద్ధ మేఘాలు కమ్ముకుంటాయి. తను చరిత్ర గతిని మార్చగలనను కుంటాడు నెపోలియన్. అయిదు లక్షల మంది సైనికులు రష్యాను ముట్టడిస్తారు. యుద్ధంలో వ్యక్తిగతమైన విజయం ఉండదని రష్యన్ కమాండర్-ఇన్-చీఫ్ కుటుజోవ్‌కు బాగా తెలుసు. సైనికుల త్యాగనిరతి, ధైర్యసాహసాల కన్న వ్యూహమే నిర్ణాయకమవుతుంది. అదీ అంగీకరించకపోతే 'విధి'ని నమ్మాల్సిందే. టాల్‌స్టాయ్ విశ్వాసం కూడా ఇదే. 'వ్యక్తుల ఇష్టాఇష్టాల ప్రకారం చరిత్ర మలుపులు తిరగదు. ఇక అదృశ్యశక్తి ప్రపంచాన్ని శాసిస్తున్నది అనేది ఆయన ఫిలాసఫీ. స్మోలెన్స్క్ నగరం లొంగుబాటు,బోరోడినో యుద్ధం, మాస్కో నగరాన్ని ఖాళీ చేయించిన ఘట్టం, ఫ్రెంచి వాళ్ల తాత్కాలిక విజయం- వీటిని చిత్రించటం వెనక టాల్‌స్టాయ్ తాత్విక దృక్పథం ఇదే. ఎంత గొప్పవాళ్ళు గానీ, ఎంత ముఖ్యమైన సైనిక అధికారులు గానీ- మనుషుల నిర్ణయాలకు విలువలేదు. జీవితమనే మహాసముద్రంలో నీటి బిందువులు వ్యక్తులు. అందువల్ల ఒక వ్యక్తి ఏమైపోతాడన్న విషయం పరిగణలోకి రానేరాదు. జగన్నాథ రథచక్రాలాంటి పరిస్థితులను అంగీకరించటం తప్ప మనిషి చెయ్యగలిగిందేమీ లేదు.

ఈ రోజుల్లో ఇలాంటి సూత్రీకరణలు మూర్ఖంగా కనిపిస్తాయి. కాని కథ చదువుతున్నప్పుడు చాలా కన్విన్సింగ్‌గా ఉంటుంది!

ఇక యుద్ధంలో-ఆలోచనలతో కాక, అంతర్

**సుమారు మూడవ వంతుదాకా చదివితే గాని నవల ఉత్కృష్టత కాస్తైనా గోచరించదు. పరస్పర సంబంధం లేనట్టుగా కనిపించే సంఘటనల సమాహారమే జీవితం అని రచయిత అవగాహన. దేనికీ అర్థం లేదు. మిగిలేది అనుభవం మాత్రమే. ఒక జీవనదీ ప్రవాహాన్ని చూసి, ఎందుకిది ఇన్ని మలుపులు తిరుగుతున్నది? ఎందుకింతగా పొంగుతున్నది? అంటే ఏం చెబుతాం? వ్యక్తి జీవితం, సమాజ జీవితంతో సమాజ జీవితం దేశ జీవితంలో కలిసి విశ్వమానవ చరిత్ర రూపొందుతున్నది.**

## టాల్‌స్టాయ్ (1828–1910)

యవ్వనంలో టాల్‌స్టాయ్ నిరీశ్వరవాది. యుద్ధము-శాంతి తర్వాత మార్పు ప్రారంభ మైంది. మత విశ్వాసాలు పెరగలేదు గాని "ఈ సర్వసృష్టికీ మూలకారణమే దేవుడు" అనుకున్నాడు. జీసస్‌ను పూజ చెయ్యడం కాదు. అలాగ బతకాలి. "ఈ లోకంలో చెడు న్నది. కాని దానికి చెయ్యి అడ్డు పెట్టనవ సరం లేదు" అన్నాడు. జరిగేదేదో జరగనీ. ఈ విశ్వాసాల పరిణామంగా జీవిత పద్ధతి కూడా మారింది. వ్యక్తి సమస్యలన్నింటికీ పరిష్కారం శారీరక శ్రమలో ఉందని భావిం చాడు. తన ఎస్టేట్ యాస్నాయా పొల్యా నాలో కట్టెలు కొట్టటం, పొలం దున్నటం వంటి పనులన్నీ చేశాడు. నీవంటి గొప్ప రచ యిత యిలా తనకు సంబంధించని విషయా లలో తలదూర్చి కాలయాపన చెయ్యాలా? " అంటూ నిరసన తెలియచేసింది భార్య.

"ఈ లోకంలోని దోపిడీకి, అసమానతలకు మూలం స్వంత ఆస్తి" అన్నది తదుపరి దశ. టాల్‌స్టాయ్ లాంటి వ్యక్తుల్లో విశ్వాసా నికీ, ఆచరణకూ తేడా చూడరు. కాని భార్య అడ్డుపడింది. ఉన్నదంతా దానం చేస్తే పద ముగ్గురు పిల్లల్తో తనెక్కడికి పోవాలి? వాళ్ల చదువులు, పోషణ ఎవరు చూస్తారు? ఆమె పోరు పడలేక ఆస్తిని, భార్యా పిల్లల పేర రాశాడు.

ఏడాదికేడాది రచయితగా, తాత్వికునిగా టాల్‌స్టాయ్ ప్రభావం రష్యన్ సమాజం మీద మాత్రమే కాక ప్రపంచ మేధావుల్లో, శాంతి కాముకుల్లో, సంస్కర్తల్లో కూడా పెరి గింది. ఆయన బోధనలు, సిద్ధాంతాల కను గుణంగా కాలనీలు, కమ్యూన్‌లు, ఆశ్రమాలు ఏర్పడ్డాయి. ఆ ప్రభావంతోనే దక్షిణాఫ్రికాలో గాంధీ టాల్‌స్టాయ్ ఆశ్రమం స్థాపించి, ఆయనతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాడు. జీసస్ లాగ సాటి మనిషిని నీలాగే ప్రేమిం చమన్న మనిషి భార్యా పిల్లల్ని విస్మరిం చాడు. ఈ దశలో చెర్ట్‌కోవ్ అనే కొత్త శిష్యు డు టాల్‌స్టాయ్ చెంత చేరాడు. ధనవంతు డు, ఉన్నతోద్యోగి. ఆదర్శవాది. ఉద్యోగానికి రాజీనామా చేసి టాల్‌స్టాయ్ నాశ్రయించా డు. కుటుంబ సభ్యులతో సహా ఎవరూ దగ్గ రగా రాకుండా గురువుగార్ని రక్షించటం తన బాధ్యత అనుకున్నాడు. ఒక దశలో టాల్ స్టాయ్ ఆస్తి వ్యవహారాల్ని ఎంతగా అశ్రద్ధ చేశాడంటే అరవైవేల పౌండ్ల సంపద ఉన్నా అయిదు వందల పౌండ్ల ఆదాయం కూడా రాలేదు. దాంతో 1881కి ముందు రాసిన

---

జ్ఞానంతో నిర్ణయాలు తీసుకునేవాళ్లు, ఓపిక పట్ట గలిగేవాళ్లు కమాండర్ ఇన్ చీఫ్ కుటుజోవ్ లాంటి వాళ్లు గెలుస్తారు. యుద్ధమంటే ఏమిటో తెలియకుండా, భోజనం, మంచి యూనిఫారం, బూట్లు దొరుకుతాయనే ఆశతో సైన్యంలో చేరి చీమల దండులా వేలకొలదీ నేలకొరిగిన నిరు పేద రైతులు రష్యన్లకు పట్టుబడి ఆకలికి మాడి మరణించిన ఫ్రెంచి సైనికులు చిరునవ్వుతో మృత్యువు నాహ్వానించగలిగిన వీరులే వీరం దరూ.

టాల్‌స్టాయ్ వంటి నాస్తికుడు (ఈ నవల రాసేనాటికి) కూడా ఒక ఆధ్యాత్మిక వాస్తవిక తను దర్శించగలడు. మనుషులు, జంతువులు, కీటకాలు, ప్రకృతి- అన్నింటిలో అంతర్లీనంగా ఒక జీవశక్తి ఉన్నట్టుగానే వర్ణిస్తాడు.

"జీవితానికి అర్థం ఏమిటి? " అనే ప్రశ్నతో సతమతమవుతాడు ప్రిన్స్ ఆంద్రూ. చివరికి క్షత గాత్రుడై ఒంటరిగా గదిలో పడుకున్నప్పుడు మృత్యువు మొహంలో మొహం పెట్టి అతణ్ణి పలకరిస్తుంది. ఊహించని పరిస్థితుల్లో మనకు సత్యం అనుభవంలోకి వస్తుంది.

"జీవితం నిద్ర. మృత్యువు వేకువ" అనుకుం టాడు. ప్రధాన పాత్రలన్నీ ఏదో ఒక అన్వేషణ లోనే గడిపినా, ఎవరి దారి వారిది.

జీవితం నుండి పలాయనం చిత్తగించటం సత్యశోధన కాదు. ఒక ప్రధాన పాత్ర పిమెర్ మంచి సైనికోద్యోగి. మాస్కో అగ్నికాహుతి అయినప్పుడు ఒక పిల్లాణ్ణి రక్షిస్తాడు. ఫ్రెంచి

పుస్తకాల హక్కుల్ని తన పేర రాయించుకుంది సోన్యా. స్వంతంగా ప్రచురణ ప్రారంభించింది. ఆదాయం బాగా పెరిగింది. తన పుస్తకాలతో డబ్బు సంపాదించటం టాల్‌స్టాయ్‌కు కోపం తెప్పించింది. 1881 తర్వాత రాసిన పుస్తకాలకు కాపీరైట్ ఎవరికీ లేదన్నాడు. ఇది సరిపోదన్నట్టు భార్య పేర రాసిన హక్కుల్ని వాపసు తీసుకున్నాడు. ఇంట్లో చిచ్చురేగటానికి ఇంతకన్నా ఇంకేం కావాలి? 1896 వచ్చింది. టాల్‌స్టాయ్‌కు 68 సంవత్సరాలు నిండాయి. పైపై ముప్పైనాలుగేళ్ళ సోన్యాకు యాభైరెండు. పిల్లలు పెద్దవాళ్లు. రెండవ కూతురు పెళ్లికి సిద్ధంగా ఉంది. సోన్యా ఒక కుర్ర సంగీతకారుడితో ప్రేమలో పడింది. ఈ వ్యవహారం ఎక్కువ రోజులు కొనసాగలేదు. కాని భార్యాభర్తల మధ్య మరింత అఘాతం సృష్టించటానికి మాత్రం తోడ్పడింది. మనోక్లేశంతో టాల్‌స్టాయ్ ఆరోగ్యం పాడైంది. ఆస్తి విషయంలో పిల్లలందరూ తల్లి పక్షం- చిన్న కూతురు అలెగ్జాండ్రా తప్ప. ఆ పిల్ల చెర్ట్‌కోవ్ శిష్యురాలు. కుటుంబంలో సమస్యలు ఇంతగా పెరగటానికి చెర్ట్‌కోవ్ ప్రమేయం కూడా ఉంది.

82వ ఏట, 1910లో జీవితం మీద విరక్తి కలిగి ఫ్యామిలీ డాక్టర్ తోడుగా ఇంటి నుండి బయల్దేరాడు టాల్‌స్టాయ్. అది మహాభినిష్క్రమణం. ఘోరున కురుస్తున్న వర్షంలో రైలు ప్రయాణం చేశాడు. షమార్డి స్టేషన్‌లో విశ్రాంతి కోసం దిగాడు. భార్యకు తన జాడ తెలియకూడదని ప్రయాణం కొనసాగించాడు టాల్‌స్టాయ్. జలుబు, జ్వరం పట్టుకుంది. ఈ వృద్ధ ప్రయాణీకుడెవరో అందరికీ తెలిసిపోయింది అస్టాపోవో స్టేషన్‌లో రైలాపారు.

మరికొద్ది గంటల్లో టాల్‌స్టాయ్ గురించిన వార్త ప్రపంచవ్యాప్తంగా ప్రసారమైంది. వందలాదిమంది జర్నలిస్టులు, ఫొటోగ్రాఫర్లతో ఆ కుగ్రామం నిండిపోయింది. చాలా మంది రైలు కంపార్టుమెంట్లనే తమ కార్యాలయాలుగా మార్చుకుని వార్తలు పంపారు. అవి చివరి క్షణాలు- ప్రభుత్వాధినేతలు, ప్రైమ్‌మినిష్టర్లు టాల్‌స్టాయ్ గురించి వాకబు చేశారు. నవంబర్ ఏడు. ఆదివారం ఉదయం ఆరింటికి మరో ప్రస్థానం మీద బయల్దేరాడు టాల్‌స్టాయ్.

రచయితలందరూ నోబెల్ ప్రైజ్ అందుకోవటమే ఒక శిఖరారోహణ అనుకుంటారు. నోబెల్ ప్రైజ్ అందుకోలేనంత మహోన్నతుడు టాల్‌స్టాయ్.

వాళ్లు అతణ్ణి అరెస్టు చేస్తారు. జైల్లో మరో ఖైదీతో మాట్లాడినప్పుడు గాని అతడికి జీవితానికి పరమార్థమేమిటో అనుభవంలోకి రాదు" జయాపజయాలు కావు. కర్తవ్యంలో దేవుడుంటాడు" అని తెలుస్తుంది.

ఆటుపోట్లతో జీవితనౌక ఎన్ని పల్టీలు కొట్టనీ,కొందరు మునగకుండా తనను తాము రక్షించుకోగలరు. కావలిసింది ధైర్యసాహసాలు కాస్త ఓపిక- అనేది రచయిత తాత్వికత.

నిజానికి ఈ నవలలో ఒక ప్రారంభం, ఒక ముగింపు అంటూ ఉండవు. వైవిధ్యం, పరిణామశీలత జీవలక్షణం. నవలా క్రమంలో వ్యక్తుల మధ్య సంబంధాలు అనూహ్యంగా మలుపులు తిరుగుతాయి. ఆధునిక నవలల్లో లాగ ఇందులో కథనం పరిగెత్తదు. పాఠకులను ఆకర్షించే ప్రయత్నం కూడా ఉండదు. మెలోడ్రామా అస్సలు లేదు. శృంగారం కనిపించదు. ఓపిక వున్నవాళ్లు మాత్రమే ఇంత పెద్ద పుస్తకం చదవగలరు. దీన్ని 'బతుకు పుస్తకం' అన్నారు సాహిత్యకారులు. "కథ ఏమిటి? ప్లాటు ఏమిటి? చివరికేమవుతుంది? " వంటి ప్రశ్నలకు ఇది చదివి ఎవరూ సమాధానం చెప్పలేరు. ఒక పెద్ద-చాలా పెద్ద-కాన్వాస్ మీద గీసిన జీవిత బృహత్ చిత్రం. ఏ ఒక్క పాత్రా, ఏ ఒక్క సంఘటనా ముఖ్యం కాదు. జీవనది ప్రవహిస్తున్న దృశ్యం మాత్రమే మన అనుభవంలోకి వస్తుంది.

—ఎం. వసంత



కోలపల్లి ఈశ్వర్

అతడు... ఆమె... పరస్పరం గాఢంగా ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. కానీ తమ కుటుంబానికి తనే ఆధారం గనుక తల్లి ఆరోగ్యం మెరుగుపడి, తమ్ముడికి ఉద్యోగం దొరికి, చెల్లెళ్ళ పెళ్ళిళ్ళయ్యే వరకూ గడువు కోరిం దామె. పెళ్ళయ్యాక ఆమె బాధ్యతలను తనూ పంచుకుంటానని అతడు మాటిచ్చినా అంగీకరించలేదు. ఉద్యోగరీత్యా అతడు మరో దేశం వెళ్లి మధ్యలోనే తిరిగొచ్చేసరికి ఆమె మరొకరి భార్యగా చలామణి అవు తుంటుంది. ఆమె తనను తనే మరిచి పోవడానికి పరాయి వ్యక్తికి సొంతం కావడానికి గల కారణాల అన్వేషణలో పడతాడతడు. అదే సమయంలో అనేక ఆసక్తికర అంశాలు వెలుగు చూడటంతో పాటు అయిన వారినందర్నీ కంగారు పెట్టిన ఆమె ప్రవర్త నకు అసలు కారణాలూ తెలు స్తాయి. ప్రేమలూ ఫలిస్తాయి. తనవారి క్షేమం కోసం తన బంగారు భవిష్యత్తునూ, నూరేళ్ళ జీవితాన్నీ పణంగా పెట్టిన ఆ త్యాగశీలి అందరి బతుకుల్లో దరహాసాలు పూయించిన వైనాన్ని ఆసక్తికరంగా మలచిన **కోలపల్లి ఈశ్వర్** నవల 'అరవింద' ఈ నెల 'చతుర' సమర్పణ.

ప్రపంచం కొత్త సంవత్సరంలోకి అడుగుపెట్టింది. అంతా అన్నీ కంప్యూటరైజ్డ్. ఒకటేమిటి పెద్ద పెద్ద మెషీన్సే కాదు. కార్లూ, బస్సులూ రైళ్లూ, భవనాలూ, రోడ్లూ, కెమెరాలూ, ఇస్త్రీ పెట్టెలూ, కుర్చీలూ, బల్లలూ, గ్లాసులూ, టీ కప్పులూ... చివరికి మనిషీ ఆ మనిషిలోని మనసూ.

వాట్ నాట్? ఎవ్రీథింగ్... ఎవ్రీథింగ్ విల్ బి కంప్యూటరైజ్డ్.

కానీ... ఈ నేలా, ఆ ఆకాశం, వీచేగాలీ, పారే యేరూ, సూర్యుడు, చందమామా, చుక్కలూ, పేదరికం... వంశీ మారే ప్రశ్నే లేదు.

ఏ కంప్యూటర్ గ్రాఫిక్సూ... వాటి ఉనికిని మరో రకంగా చూపెట్టలేదు.

మారే డిజిటల్ టెక్నాలజీ... వాటి అస్తిత్వాన్ని మాయచేసి ఏమార్చలేదు."

అని ఆ ఉదయమే పెరట్లోని మామిడి చెట్టుకింద దాని మొదలుకు ఆనించి వేసివున్న నవారుమంచం మీద పడుకుని గాలిలో తేలివస్తున్న మామిడి పూత సువాసనల్ని ఆఘ్రాణిస్తూ అనుకుంది అరవింద.

కానీ ఆ సాయంత్రం...

నీరెండపడి మిలమిలలాడుతున్న హుస్సేన్ సాగర్ ఒడ్డున వంశీ కెదురుగా కూర్చుని మెత్తటి పచ్చని పచ్చికమీద చూపుడు వేలితో రాస్తున్న అరవిందతో అన్నాడతను.

"సారీ అరూ! ఇక నీకోసం వెయిట్ చేయటం నావల్ల కాదు. మీ అమ్మగారి ఆరోగ్యం కుదుటపడి, నీ ఇద్దరి చెల్లెళ్లకు పెళ్లిళ్లయి, నీ తమ్ముడు ఉద్యోగస్తుడై, ఆపైన ఓ ఇంటివాడై ఇలా అందరూ సెటిలయ్యేసరికి నా జుట్టు తెల్లబడుతుంది."

"పర్లేదు. గోద్రెజ్ వారి అద్భుత ఉత్పాదన హెయిర్ డై ఉంది"

"టేకిట్ సీరియస్" వంశీ ముఖంలో అరవింద అంతకు ముందెన్నడూ చూడని భావం కదలాడింది.

దాన్ని కోపం అంటారా?

"చూడు ఒకప్పుడొచ్చేవి ఓ టైపు సినిమాలు. పెద్దకుటుంబం. అందరి బాధ్యతలూ నెత్తినేసుకున్న అక్కయ్యా కష్టపడి సంపాదించి చెల్లెళ్లకి పెళ్లిచెయ్యడం, తమ్ముడు అక్క చలవతో ఉద్యోగస్తుడై ఆనక ఇల్లరికం వెళ్లడం, చెల్లెళ్లు అక్కను పట్టించుకోకుండా ఎవరి కాపురాలు వాళ్లు ముచ్చటగా చేసుకోవడం, అక్కయ్యనూ ఆమె త్యాగాన్నీ మర్చిపోవడం, ఈమె ఏడుస్తూ మీకింత చేశానే, నన్నిలా నిర్లక్ష్యం చేస్తారా అంటే ఎవడు చెయ్యమన్నాడు. మేంగాని అడిగామా? అని వాళ్లు ముఖాన ఉమ్మెయ్యడం. అప్పుడు సినిమా బిగినింగ్ నుండే ఆమెను ప్రేమిస్తూ అక్కడక్కడా కొన్ని సీన్స్‌లో దిష్టిబొమ్మలా కన్పిస్తున్న హీరో ఆమెను హృదయానికి హత్తుకుని ఓదార్చటం లాంటి సినిమా కథ కాదు మన జీవితం. ఎప్పుడు జరిగే ముచ్చట అప్పుడు జరగాలి. అంతేగాని నీ మునివేళ్లతో కాలాన్ని పట్టి వెనక్కిలాగలేవు. సో నే చెప్పొచ్చేదేమిటంటే"

"నేను సినిమా హీరోని కాను. మామూలు మనిషిని అంటావ్ అంతేగా" అడిగిందామె.

"ముమ్మాటికీ" వంశీ ఉద్వేగంగా అన్నాడు.

"అంటే మామూలు మనుషుల్లో సినిమా హీరోల్లాంటి వాళ్లు లేరంటావా? "

"మళ్లీ మొదటికొస్తున్నావ్" అతను ఇసుకని గుప్పెట్లో బిగించాడు. "ఉంటే ఉంటారేమో! నాకలాంటి హీరోయిజం అక్కర్లేదు"

"హీరోయిన్ మాత్రం కావాలి" నవ్వింది అరవింద.

"అక్కర్లేదు" అతడు గడ్డిపరకల్ని పీకుతూ వాటిని అరవింద పల్చని పాదాల మీద వేస్తూ అన్నాడు "నాకు హీరోయిన్ అక్కర్లేదు. నా అరవింద కావాలి"

"నీ అరవింద కావాలంటే నువ్వుకాస్త ఆగాలి"

"నో" అతడు అరిచేశాడు. "నాకిప్పుడే కావాలి"

"అయితే" అమె అతడికేసి నిర్లిప్తంగా చూసింది. ఈ అరవింద 'నీ' అరవింద కాదు. ఒట్టి అరవిందే"

సూర్యుడు మరింత కిందకు వాలిపోవ

డంతో హుస్సేన్‌సాగర్ తీరం దగ్గర మిలమి లలు తరిగిపోయాయి. కాస్త దూరంగా పరిగె త్తుకొస్తున్న ఒక అల అంతలోనే నిశ్శబ్దంగా తల వాల్చేసింది.

వంశీ చాలాసేపు కొద్దికొద్దిగా ఎగిసిపడే చిరు అలల్ని చూస్తుండిపోయాడు. అరవింద అలల వంక చూడకుండా సాగర్ మధ్యలో ఉన్న బుద్ధుణ్ణి చూస్తుండిపోయింది.

"అయితే నీ నిర్ణయం మారదంటావ్." అడి గాడతను.

నీరెండ కరిగి చీకట్లు ముసురుకుంటున్న సాగర తీరాన్ని చూస్తూ చెప్పిందామె "అది నా కిష్టం లేదు"

"ఎందుకని? "

"నన్ను నన్నుగా మాత్రమే నీ కివ్వదల్చుకు న్నాను కాబట్టి"

"ఎప్పటికి? "

"ఎప్పటికైనా"

"నే వెళుతున్నా" అతడు విసురుగా లేచాడు. "నీతో చివరిసారిగా మాట్లాడి ఓ.కె.

**పరిచయం** కోలపల్లి ఈశ్వర్ నెల్లూరు జిల్లా వాస్తవ్యులు. చేయి తిరిగిన రచ యిత. ఇప్పటివరకు తొమ్మిది వందలకు పైగా కథలు, ఇరవై రెండు నవలలు రాశారు. చతుర, ఆంధ్రభూమి, స్వాతి, ప్రియదత్త, హాస్యానందం, సుప్ర భాతం, ఆహ్లాదం, ఆలాపన తదితర పత్రికలలో ఆయన రచనలు ప్రచురితమయ్యాయి. చదవడం, రాయడం - ఈ రెండే ఆయన అభిరుచులు. ప్రముఖకవి, రచయిత నాగభై రవ కోటేశ్వరరావు ఈశ్వర్‌ను అభినందిస్తూ కోలపల్లికి శతమానం పేరిట 108 కవితల అభినందనలమాల రాశారు. 'కోలపల్లి కొసమెరు పులు' శీర్షికన జయంతి మాసపత్రిక ఆయన కథలు ప్రచురించింది. లోగడ 'చతుర'లో ప్రచు రితమైన ఈశ్వర్ నవలను వంశీ 'ఏప్రిల్ 1 విడు దల' చిత్రంగా నిర్మించారు.

చిరునామా: **కోలపల్లి ఈశ్వర్**
కోలపల్లి నిలయం,
3-1-138, నవాబ్‌పేట,
నెల్లూరు - 524 002.

"నీ నిర్ణయం మార్చుకున్నావా? " ఆమె అతడి కళ్లలోకి చూసింది.

"ఆc" కసిగా అన్నాడు.

ఆమె అతడితో నింపాదిగా అంది "నా వంశీ మారడనుకున్నాను"

"ఇక మీదట నేను నీ వంశీని కాదు ఒట్టి వంశీని మైండిట్"

"ఐవిల్ మైండ్" చెప్పిందామె.

అతడు హఠాత్తుగా మెత్తబడిపోయాడు. "నీకు తెలీదా అరూ నువ్వు లేకుండా నేను క్షణం కూడా బతకలేనని!"

"నీకు తెలుసుగా వంశీ. నేను లేకుండా నా వాళ్లకి అసలు బతకటమే చేతకాదని"

"నేనేం నిన్ను నీవాళ్లని వదిలెయ్యమనటం లేదే! పెళ్లయ్యాక నీతో పాటూ నేనూ వారి బాధ్యత పంచుకుంటాను ప్రామిస్"

చేద్దామని వచ్చా ఇక నువ్వు నా దారికి రావు సో... మా అమ్మా నాన్నలు కుదిర్చిన సంబంధం చేసేసుకుంటాను."

"వాళ్ళు నిన్ను అమెరికా పంపిస్తానన్నారు కదూ. వెళ్లు. మన ప్రాబ్లమ్ ఎలాగూ సాల్వ్ అవదు గాని, కనీసం అక్కడ అమెరి కాలో ప్రాబ్లమ్ సాల్వేషన్స్‌లో నన్నా పాలు పంచుకో"

"పాలు పంచుకుంటానో, బ్రాందీ పంచుకుం టానో నీకది అనవసరం. నే వెళ్తున్నా"

"ఎంతయినా కంప్యూటర్ ఇంజనీర్‌వి కదా! మంచి భవిష్యత్ ఉంది నీకు. ఆల్ ది బెస్ట్"

వంశీ విసవిస నడుస్తూ వెళ్లిపోయాడు.

"ప్లీ అంత స్పీడ్‌గా నడవకు. గో స్లోలీ"

అతడు వెనక్కి తిరిగి చూళ్లేదు. అరవింద తనలో తాను నవ్వుకుంది.

ఎందుకో ఆపుకుందామన్నా నవ్వాగలేదు. కళ్లలో నీళ్లు తిరిగే దాకా అలా నవ్వుతూనే ఉంది. నవ్వి నవ్వి చెంపల మీద నీళ్లు ధార కడుతుంటే అప్పుడాపింది.

నలువైపులా ఉన్న లైట్లు ప్రతిబింబిస్తూ హుస్సేన్‌సాగర్ వింత వెలుగులు విరజిమ్ముతోంది.

అవునూ, వంశీ ఏమిటి ఇలా మారిపోయాడు. ఈ ఉదయమేగా తను నేలా, ఆకాశం, గాలీ, నీటి చుక్కలూ, చందమామా, సూర్యుడు, వంశీ, పేదరికం మారే ప్రశ్నే లేదనుకున్నది!

కానీ వంశీ మారిపోయాడు.

ఏం చేస్తాడు పాపం!

మనుషుల్ని, మమతల్ని కాలరాస్తూ ఎవ్రీథింగ్ ఈజ్ కంప్యూటరైజ్డ్ మనిషీ. ఆ మనిషి లోని మనసూ!

వంశీ కూడా మనిషేగా. అతడి మనసులోకి ఎవరో ఏదో మెసేజ్ ఫీడ్ చేశారు. సో హి ఈజ్ యాక్టింగ్ అకార్డింగ్‌లీ.

ఇక మీదట

వంశీలూ, రాంబాబులూ, చందూలూ ఉండరు.

ఆకాష్‌లూ, రాకేష్‌లూ, నితీష్‌లే ఉంటారు.

అంతా ఫాస్ట్...

ఫాస్ట్... ఫాస్ట్.

ఆ స్పీడ్‌ని



అరవిందల కన్నీళ్ళూ, అరుంధతుల వేడికోళ్లూ ఆపలేవు.

ఓ... కె... వంశీ.

రన్ ఫర్ ద లైఫ్.

రన్ ఫర్ ద నేమ్.

రన్ ఫర్ ద ఫేమ్.

అండ్ డోంట్ వెయిట్ ఫర్ మి బై గుడ్ బై ఫరెవర్.

* * *

"తప్పు చేశావేమో!" అంది భానురేఖ అరవిందతో. అరవింద వి అండ్ జె ప్రైవేట్ కంపెనీలో స్టెనోగ్రాఫర్. భానురేఖ అదే ఆఫీసులో క్లర్క్.

ఆఫీస్ అవర్స్ తర్వాత ఇద్దరూ బస్టాప్‌లో నిలబడ్డారు. సిటీ బస్ కోసం వెయిట్ చేస్తూ.

"తప్పేనేమో! కానీ తప్పదుగా" అరవింద అంది.

ఆమె మాటల్లో నిజం ఉందన్పించింది భానుకు. అయినా మళ్లీ అంది "కానీ వంశీ లాంటి వ్యక్తిని వదులు కోవటం వైజ్ అన్పించుకోదు."

అరవిందకు ముందే గుండె కోసేసినట్టుగా ఉంది. ఎవరైనా తనను "వెల్ డన్ అరవిందా! నీ త్యాగం అపురూపం. నీ వాళ్ళ కోసం నీ జీవితాన్ని త్యాగం చేస్తున్నావ్. నువ్వు కొవ్వొత్తిలా కరిగి పోతూ వాళ్ళకు వెలుగు నిస్తున్నావ్" అని పొగిడితే వినాలని ఆరాటపడుతోంది. ఆ ఆరాటం కేవలం పొగడ్త కోసం కాదు. అతణ్ణి వదులుకుని తను పోగొట్టుకున్న మనశ్శాంతిని ఆ విధంగానన్నా తిరిగి పొందాలని.

"అయ్యో! అరవిందా పొరపాటు చేశావ్" అని నిలదీస్తున్న అంతరాత్మను బుజ్జగించాలని. అలా కాకుండా ఈ భానురేఖ "తప్పు చేశావ్" అంటుంటే గుండెలో గాయం మరింత కెలికినట్టవుతోంది. 'నిజమేనేమో' అన్న ఫీలింగ్ కలుగుతోంది. "యు ఆర్ రైట్... ప్రొసీడ్" అని భానురేఖ అంటే వినాలనిపిస్తోంది. కానీ ఆమె అలా అనటం లేదు. అందుకే తన గుండెల్లో రక్తం ఓడుతున్న గాయానికి తనే కట్టు కట్టుకుంటూ అంది



"ఏమన్నావ్! వంశీ లాంటి వ్యక్తా? గాడిద గుడ్డు. ఏం వ్యక్తిత్వం అతడిది? ఆఫ్టాల్ ఓ అయిదేళ్ళు నా కోసం వెయిట్ చెయ్యలేక పోయాడు. అసలో రకంగా భానూ! అతడి ప్రేమకి ఇది నేను పెట్టిన పరీక్ష. చిత్తుగా ఓడిపోయాడు"

"అయిదేళ్ళా! పైగా ఆ టైమ్ ఆఫ్టాలా? "

"ముక్కుమీద వేలేసుకోకు. నా ఇద్దరి చెల్లెళ్లకూ పెళ్లిళ్లయి, తమ్ముడు ఉద్యోగస్తుడయ్యేసరికి అయిదేళ్ళు ఈజీగా పడుతుంది"

"పడితే..." నోరు తెరిచింది భానురేఖ.

"అసలు వంశీ ఇప్పటికే అయిదేళ్ళుగా నిన్ను ప్రేమిస్తున్నాడు. అదీ ఇదీ కలిపితే... పదేళ్లా!"

"ఆc పదేళ్లే. అలా ఎదురు చూడగలిగితేనే అతడు నిజమైన ప్రేమికుడు" మొండిగా అంది అరవింద.

భానురేఖ అరవింద కళ్లలోకి గుచ్చి గుచ్చి చూసింది. అరవింద ఆ చూపుల్ని తట్టుకోలేనట్టు రెప్పలు రెపరెప లాడించింది.

అప్పుడు రాలి పడ్డాయి రెండు కళ్లలోంచీ రెండు కన్నీటి బొట్లు.

భానురేఖ మనసు ఆర్ద్రమైంది. అరవింద భుజం మీద చెయ్యేసి అడిగింది. "ఏయ్ ఏడుస్తున్నావా? "

అరవింద చప్పున కర్చీఫ్‌తో కళ్లద్దుకుని ఓ నవ్వు నవ్వేసింది. "కంట్లో నలక పడ్డప్పుడు ఏమవుతుందో తెలుసా? లాక్రిమల్ గ్లాండ్స్ యాక్టివేట్ అయి ఓ సెక్రిషన్ విడుదలవుతుంది. అది కంటిని క్లీన్ చేసి నలకను బయటికి గెంటేస్తుంది. అది జరిగిందిప్పుడు"

"ఆహాc అదా విషయం. మాకు తెలీదులే" భానురేఖ ఎగతాళిగా అంది.

అంతలో బస్ వచ్చేసింది. ఇద్దరూ ఎక్కేశారు. కోఠీ దగ్గరకు రాగానే అరవిందకు చప్పున గుర్తుకొచ్చింది. మరునాడు వసంత బర్త్ డే అని. "నేనిక్కడ దిగేస్తాను. వసూకి చీర కొనాలి"

'నేనూ దిగేదాన్నే కానీ ఇంట్లో పని ఉంది' అంది భానురేఖ.

"పర్లేదులే" అని అరవింద దిగేసింది.

ఓ షాపులోకెళ్ళి క్రీమ్ కలర్ మీద చిన్న చిన్న లావెండర్ కలర్ పూలు ప్రింట్ చేసిన చీర సెలక్ట్ చేసింది. కౌంటర్‌లో డబ్బు చెల్లించి బయటికొచ్చాక సాయంత్రపు చల్లగాలికి ఓ పది నిముషాలు నడవాలన్పించి అలా రోడ్డంట నడవసాగింది. ఓ పది గజాలు నడిచిందో లేదో కుడి పాదం దేనికో తట్టుకున్నట్టయి ముందుకు తూలి పడబోయి నిలదొక్కుకుంది. చూస్తే అదో హేండ్ బాగ్. వంగి అందుకుంది. ఒక్క క్షణం అటూ ఇటూ చూసింది. దాని తాలూకు వ్యక్తులెవరైనా దాని కోసం వెదుకుతున్నారా అని. అటువంటి వారెవ్వరూ కనిపించక పోవడంతో దాని జిప్ లాగబోయి చప్పున ఆగిపోయింది.

ఒకవేళ... లోపలేదన్నా ఎక్స్‌ప్లోజివ్ లేదు కదా అనుకుంది. మళ్లీ అంతలోనే నవ్వుకుని మెల్లగా జిప్ లాగింది. లోపల ఓ బుక్ కన్పించింది. బయటికి తీసి చూస్తే అదో డైరీ. మొదటి పేజీలో ఆ డైరీ తాలూకు వ్యక్తి అడ్రస్ ఉంది.

మిసెస్ యామినీ శరశ్చంద్ర, బంజారా హిల్స్ అని రాసి దాని కిందనే స్టాంప్ సైజ్ ఫోటో ఒకటి అతికించి ఉంది. ఫోన్ నెంబరు కూడా ఉంది.

బ్యాగ్ లోపలి మరో అర జిప్ లాగింది అరవింద. దాదాపు ఓ వెయ్యి రూపాయలున్నాయి. అన్నీ వంద నోట్లే. అటు వైపున్న మరో జిప్ లాగితే అందులో చిల్లరగా కొన్ని నోట్లు కన్పించాయి.

"సరే అడ్రస్ ఉందిగా,ఆమెకు చేర్చెయ్యొచ్చు" అనుకుంటూ నడవటం మొదలెట్టింది.

* * *

అరవింద తన హేండ్ బ్యాగూ దార్లో దొరికిన హేండ్ బ్యాగూ బల్లమీద పెట్టి చీర ప్యాకెట్ వసంత కిచ్చి స్నానానికి వెళ్లింది. ఆమె స్నానం చేసి వచ్చేసరికి వసంతతో తులశమ్మ అంటోంది. "దాని రెక్కలు ముక్కలు చేసుకుని మన కడుపులు నింపేది కాక పుట్టి

మరే తల్లీ,
అమ్మనై ఉండీ అడిగింది
ఇవ్వలేనప్పుడు
నా కడుపున పుట్టిన
నేరానికి నువ్వీలంపటం
మొయ్యక
తప్పుతుందా

గ్రోఖులనీ, నా బొందనీ బహుమతులు కూడా పట్టుకొచ్చి ఇస్తుంటే మీకు ఒళ్ళూ పై తెలీ దంలా. ఆ చీరకేమే నిక్షేపంగా ఉంటేనూ"

"అది కాదమ్మా నాకు డార్క్ కలర్స్ అంటే ఇష్టం"

"ఆc ఇష్టం" తులసమ్మ ఈసడించినట్టుగా అంది "మన బోడి ఇష్టా ఇష్టాల కోసం అదెన్ని ఇష్టాలు చంపుకుంటోందో నీకేమన్నా తెలు స్తోందా? "

"అమ్మా ఊరుకో" తను తెచ్చిన చీర చెల్లె లికి నచ్చలేదన్న విషయం అరవిందను బాధ పెట్టలేదు. నచ్చేలాంటిది తేలేక పోయానే అని నొచ్చుకుంది. అందుకే వసంతతో,

"ఓ పని చెయ్యవే వసూ, ఆ చీర నాకుం చెయ్. నువ్వెళ్ళి మరోటి తెచ్చుకో" అంది.

"అవును పాపం నీ అక్కయ్య కుబేరుడి ముద్దుల చెల్లాయి కదా. వెళ్ళి తెచ్చుకోమ్మా ఇంకో చీర" తులసమ్మకు ఒళ్ళు మండిపో యింది.

"అబ్బ ఊరుకోమన్నానా" వసంత మనసు కష్టపడితే అరవింద మనసు విలవిల్లాడిపో తుంది. అసలామె మనసనే కాదు. ఆ ఇంట్లో ఎవరి మనసు కష్టపడ్డా తట్టుకోలేదామె.

"ఇదుగో తీసుకో" హేండ్‌బ్యాగ్ ఓపెన్ చేసి మూడొందలు వసంత కివ్వబోయింది.

వసంత బెరుగ్గా తల్లికేసి చూసి అందు కుంది. అంతవరకూ ఓ జడ ముందుకూ, ఓ జడ వెనక్కూ వేసుకుని నడుంమీద రెండు చేతులూ ఆన్చి అరవిందకేసి, వసంతకేసి మార్చిమార్చి చూస్తున్న అరవింద రెండో చెల్లెలు శ్రీదేవి, "అంతేలే, ఆవిడగారికైతే ఒకటి నచ్చకపోతే ఇంకోటి. టేస్టూ పేస్టూ లేనివాళ్ళం మేమే. ఏది తెస్తే అది కట్టా ల్సిందే" అంది.

"ఏంటీ నీ బాధ? "

వసంతకు డబ్బులిచ్చి శ్రీదేవి నడిగింది నవ్వుతూ అరవింద.

"పోయిన్నెల్లో నా బర్త్‌డేకి నువ్వు తెచ్చిన సల్వార్ కమీజ్ నాకు నచ్చలేదు" వసంతను మింగేసేలా చూస్తూ అంది శ్రీదేవి.

"అంతేనా? "

అరవింద పకపక నవ్వింది.

"డోంట్ వర్రీ. నీకు నెక్స్ట్ మంత్‌లో డబ్బి స్తాను. నీ ఇష్టమొ చ్చింది కొనుక్కో"

"నిజంగా ఇస్తావా? "

"నిజంగానే ఇందులో అబద్ధమేముంది? "

"అయితే అమ్మాయ్" తులసమ్మ కల్పిం చుకుంది

"నేనూ, వాడూ ఏం పాపం చేశాం? మా ఇద్దరిక్కూడా చెరో అయిదొందలూ ఇచ్చుకో. కొనుక్కొంటాం చీనీ చీనాంబరాలు. ఆనక మమ్మల్ని పోషించలేక నువ్వెక్కడైనా దూకి చద్దువుగాని".

"అమ్మా" అరవింద ఆప్యాయంగా తల్లి భుజాల చుట్టూ చేతులేసింది. "వాళ్ళే మడి గారు? అఫ్కోర్ బట్టలేగా! అంతేగాని రవ్వల నెక్లెస్, ఇంపోర్టెడ్ వాచ్ అడగలేదుగా. ఆ మాత్రం కూడా ఇవ్వకపోతే వాళ్లకు అక్కగా పుట్టటం ఎందుకమ్మా దండగ".

తులసమ్మ కళ్లలో నీళ్లు నిండాయి "మరే తల్లీ, అమ్మనై ఉండీ అడిగింది ఇవ్వలేన ప్పుడు నా కడుపున పుట్టిన నేరానికి నువ్వీ లంపటం మొయ్యక తప్పుతుందా. ఓ అయ్య చేతిలో పెట్టి అంపకాలు చెయ్యాల్సిన బిడ్డ నెత్తిన ఇంత బరువేసి చోద్యం చూస్తూ ఇంకా బతికున్నా".

తులసమ్మ అలా అని కళ్లొత్తుకోవడం చెల్లెళ్లు వింటే ఎక్కడ వారి ఆనందం ఎగిరి పోతుందో అన్నట్టు అరవింద భయంగా చూసింది. కానీ శ్రీదేవి, వసంత అక్కడ లే రు. ముందు గదిలోకి వెళ్లిపోయి కొనబోయే చీరె రంగు గురించి కాబోలు డిస్కస్ చేసు కుంటున్నారు.

"ఊరుకోమ్మా. కుటుంబం అన్నాక ఎవరో

ఒకరు బాధ్యతలెత్తు కోవలసిందే. నాన్న ఉంటే ఆయన మోసేవారు. లేరు కాబట్టి నేను మోస్తు న్నాను. ఇందులో నువ్వంత బాధపడా ల్సిందేం లేదమ్మా".



"బాధెందుకమ్మా అరూ సంతోషం. సంతోషంతో ఉక్కిరి బిక్కిరైపోతున్నాను. నా కడుపున పెద్ద బిడ్డగా పుట్టిన పాపా నికి నువ్విలా కళ్లెదు రుగా..." మాట పూర్తి చెయ్యలేన ట్టుగా ఆగిపోయి వంటింట్లోకి వెళ్లిపో యిందామె.

"అక్కా..."అన్న పిలుపు విని తల తిప్పింది అరవింద. అక్కడ నుంచుని ఉన్న శ్రీదేవి చేతిలో తనకు దొరికిన హ్యాండ్‌బ్యాగ్.

"ఈ హేండ్ బ్యాగ్ ఎవరిది? నువ్వు కొన్నావా? వెరీ కాస్ట్‌లీ వన్".

"దార్లో దొరికిందిలేవే. అక్కడ పెట్టెయ్. రేపు దాన్నెలాగైనా వాళ్లకి చేర్చెయ్యాలి"

అరవింద తల్లి తెచ్చిచ్చిన కాఫీ సిప్ చేస్తూ "ఫ్... జిప్ లాక్కు" అని అంటున్నా వినిపిం చుకోకుండా బ్యాగ్ ఓపెన్ చేసి బైటికి తీసింది శ్రీదేవి.

"అరె... డైరీ!" శ్రీదేవి డైరీ తెరిచి "యామినీ శరశ్చంద్ర, బంజారాహిల్స్" అని చదువుతుంటే అరవింద విసుక్కుంది.

"అబ్బ దాన్ని లోపల పడెయ్యవే" అని.

శ్రీదేవి మరో పేజీ తిప్పింది. మల్లెలు తెంపిపోస్తున్నట్టుంది వెన్నెల టెరస్ మీద. నేనూ శరత్ ఒకరికెదురుగా ఒకరం కూర్చుని ఉన్నాం. నా కళ్లలో తనని వెదుక్కుం టున్నాడు శరత్. అలా వెదుకుతూనే హఠా త్తుగా నా గుండెల మీద వాలిపోయి...

అరవింద "ఏయ్, ఒకరి డైరీలు చదవకూ డదు. అది మేనర్స్ కాదు" అని కేకలేస్తున్నా విన్పించుకోకుండా పెద్దగా చదివేస్తున్న శ్రీదేవి చదవటం చప్పున ఆపేసి అంది "బాబోయ్ ఇది ఎ సర్టిఫికేట్ డైరీ ఓన్లీఫర్ అడల్ట్స్"

అరవింద డైరీ లాగి బ్యాగ్‌లో వేసి ఆ బ్యాగ్‌ని అల్మరాలో పెట్టేసింది.

"అమ్మా రేపు గుర్తుచెయ్, శీనూ చేత ఇచ్చి పంపేస్తాను" తల్లితో అంది.

* * *

"అరె ఇది యామినీ ఆంటీ డైరీ. నీ చేతి కెలా వచ్చింది? "డైరీలో ఫొటోగ్రాఫ్ చూస్తూ ఆశ్చర్యపోయింది భానురేఖ. ఎలా వచ్చిందో



పోవడం, మా అన్నయ్య ఆ డాక్టరు గారికి రెగ్యులర్ పేషెంట్. ఓసారి వెయిటింగ్ హాల్లో అన్నయ్యా నేనూ మిగతా పేషెంట్స్‌తో పాటూ కూర్చుని డాక్టర్‌గారి కాల్ కోసం ఎదురు చూస్తున్నప్పుడు ఈవిడ కారు దిగి మహారాణిలా నేరుగా కన్సల్టింగ్ రూమ్‌లోకి వెళుతుంటే ఒళ్లుమండి అడిగా నర్సుని. "మేమింత మంది మి వెయిట్ చేస్తుంటే ఇప్పుడొచ్చి ఆవిడేంటి అలా వెళుతోంది? కారున్న పేషెంట్స్‌కి స్పెషల్ ట్రీట్‌మెంటిస్తారా ఈ డాక్టర్" అని. నర్సు నన్ను పిచ్చిదాన్ని చూసినట్టు చూసి ఒక్క నవ్వు నవ్వేసి చెప్పింది ఆవిడ డాక్టర్‌గారి మిసెస్ అని. నేనూ నర్సుకేసి చూసి ఓ వెర్రినవ్వు నవ్వి కిమ్మనకుండా కూర్చున్నా. ఓ పదినిముషాల తర్వాత ఆవిడ బయటికొచ్చి అక్కడే కన్సల్టింగ్ రూమ్ ముందే నిలబడి నాకేసి చూసి సన్నగా నవ్వింది. నేను నర్సుతో దురుసుగా అన్న మాటలు ఆమె విని ఉంటుందని నా కర్థమైపోయింది. నేనలా అంటున్నప్పుడు ఆమె ఒక్కక్షణం స్ప్రింగ్ డోర్ దగ్గర నిలబడ్డం అప్పుడు గుర్తుకొచ్చింది. నేను అనెక్స్‌పెక్టెడ్‌గా లేచి నిలబడి గిల్టీగా నవ్వాను. ఆమె రెండడుగులు నావైపుగా వచ్చి "ఇక మీదట నేనూ వెయిటింగ్ లిస్ట్ ప్రకారమే లోపలికెళతాను" అంది.

"సారీ మేడమ్" అన్నాను.

"నో రిగ్రెట్స్. న్యాయం కోసం ఇలాగే పోరాడాలి. కీపిటప్" అంది.

"చాలా ఫన్నీ మీటింగేనే మీ ఇద్దరిదీ" నవ్వింది అరవింద.

చెప్పింది అరవింద. చెప్పాక అడిగింది "అవునూ... ఏంటీ ఈమెను ఆంటి అంటున్నావ్ మన ఏజ్ గ్రూప్ మనిషిలాగే వుందే!"

"అదే ఆవిడ స్పెషాలిటీ" చెప్పింది భానురేఖ.

"ప్రస్తుతం ఆమె ఫార్టీస్‌లో ఉండొచ్చు కానీ చూడ్డానికి ఇరవై ఎనిమిదో, తొమ్మిదో అన్నట్టు ఉంటుంది. వెరీ చార్మింగ్ ఫిజిక్. ఫిజిక్కే కాదు ఆమె మనసు కూడా సో బ్యూటిఫుల్"

"ఈవిడెలా తెలుసు నీకు? బంధువా, ఫ్రెండా? "

భానురేఖ చిన్నగా నవ్వింది "రెండూ కాదు, ఈవిడ హజ్బెండ్ శరశ్చంద్రగారు కార్డియాలజిస్ట్. నీకు తెలుసుగా మా పెద్దన్నయ్య లాస్ట్ ఇయర్ హార్ట్ ఎటాక్‌తో

భానురేఖ కంటిన్యూ చేసింది "ఆ తరువాత రెండు మూడుసార్లు ఆమె నేను వెళ్లిన టైమ్‌లోనే క్లినిక్కి రావడం చూశాను. నిజంగానే ఆమె వెయిటింగ్ హాల్లో కూర్చుని తన టర్న్ వచ్చినప్పుడే లోపలికెళ్లేది. నేను ఒకటికి రెండుసార్లు సారీ చెప్పినా "యు మేడ్ మీ టు బి మేనర్డ్" అనేది. అలా మాటా మాటా కలిసింది మాకు. లాస్ట్ జూన్‌లో అనుకుంటా, అన్నయ్యను ఆ హాస్పిటల్లోనే ఇన్‌పేషెంట్‌గా అడ్మిట్ చేసినపుడు ఆమె తరచూ వచ్చి అన్నయ్యని పలకరించేది. ధైర్యం చెప్పేది, నాతో చనువుగా మాట్లాడేది. అప్పుడే అర్థమైంది నాకు ఆమెది చాలా ఫ్రెండ్లీ నేచర్ అని. అన్నయ్య పోయినపుడు. మా యింటికి వచ్చి మరీ నన్ను ఓదార్చింది. వద్దన్నా వినకుండా అయిదువేల రూపాయల చెక్ మా కుటుంబానికి ఇచ్చింది. వి అండ్ జె కంపెనీ డైరెక్టర్‌తో మాట్లాడి నాకీ ఉద్యోగం ఇప్పించింది కూడా ఆమే. చాలాసార్లు ఆమె ఇంటిక్కూడా వెళ్లాన్నేను. డాక్టర్‌గారు ఆవిడేం చేసినా నో అనరు. భార్యంటే ఎంత ప్రాణమో ఆయనకు!"

"సోషల్ యాక్టివిటీస్‌లో ఇంట్రస్ట్ ఎక్కువేమో ఆమెకు" అరవింద అంది.

"మేబి... నాకే కాదు, చాలా మందికి ఆమె ఇలా గుప్తదానాలు చేస్తూంటుందట"

"ఈ హేండ్‌బ్యాగ్‌ని ఆమెకు మా శీనూతో పంపిద్దామనుకున్నా. కాని ఇప్పుడు నాకామెను చూడాలని ఉంది. మనిద్దరం వెళ్దామా? "

"ష్యూర్" సంతోషంగా ఒప్పుకుంది భానురేఖ.

వసంత బర్త్‌డే సందర్భంగా అరవింద భానురేఖని ఇంటికి ఆహ్వానించింది. 'మీ సిస్టర్ బర్త్‌డేకి మాకేం పార్టీ లేదా? ' అని భానురేఖ జోక్ చేస్తే, 'ఇంటికి రావోయ్, పార్టీ ఇస్తానో లేదో చూద్దువు గానీ' అని ఆఫీస్ అవర్స్ తరవాత ఇంటికి లాక్కొచ్చిందామెను అరవింద. అప్పటికే వసంత శ్రీదేవినీ, ఇంకో ఇద్దరు ముగ్గురు ఫ్రెండ్స్‌నీ వెంట బెట్టుకుని సినిమా కెళ్లిపోయింది.

తులసమ్మ గారెలూ, పాయసం పెడితే తింటూ కూర్చున్న భానురేఖతో 'ఆ హ్యాండ్ బ్యాగ్ యామినిగారికి ఇచ్చొద్దాం. వస్తావా' అనడిగింది అరవింద.

"సరే పద" అంది భానురేఖ. అరవింద లేచి చెప్పులేసుకుని తులసమ్మతో,

"అమ్మా... ఈ బ్యాగ్ పోగొట్టుకున్నావిడ మన భానూకి తెలుసట. ఇచ్చి వచ్చేస్తా" అని చెప్పింది.

స్నేహితురాళ్లిద్దరూ బంజారాహిల్స్ చేరుకునేసరికి దాదాపు ఏడైంది.

లైట్లు వజ్రాల రజను విరజిమ్మినట్టు జిగేల్ మంటున్నాయి.

దేవేంద్ర భవనాల్లా మెరిసిపోతున్నాయి అక్కడి భవంతులు. ఆ పోష్ ఏరియా రిచ్‌నెస్‌ని ఆశ్చర్యంగా తిలకిస్తూ ఆలోచించి తల బైటకి పెట్టి చూస్తున్న అరవిందతో అంది భానురేఖ, "వెరీ వెల్దీ పీపుల్. ఎంత వెల్దీ అంటే వాళ్ల ఆస్తుల్ని వాళ్లే ఎస్టిమేట్ చెయ్యలేనంత. యామినీ ఆంటీ బాల్యమంతా అమెరికాలోనే గడిచిందట. శరశ్చంద్రగారు హయ్యర్ స్టడీస్ కోసం స్టేట్స్‌కి వెళ్ళినప్పుడు అక్కడే ఇద్దరికీ పరిచయమైందట. అది ప్రేమగా మారి గ్రీన్‌కార్డ్ హోల్డరైన ఆంటీ శరశ్చంద్రగారి కోసం ఇండియా వచ్చేశారు".

"శరశ్చంద్రగారెలాగూ అమెరికా వెళ్లారుగా. ఇద్దరూ అక్కడే ఎందుకు సెటిల్ అవలేదు? "

"డాక్టర్‌గారికి మదర్‌ల్యాండ్ మీదున్న అభిమానం అలాంటిది. వస్తే ఇండియా రా... లేదంటే ఇండియాలో నీ తలపుల్లోనే భగ్నప్రేమికుడిలా బతుకీడుస్తా అన్నార్ట".

అరవింద నవ్వింది.

చాలామంది అమెరికా అని, ఆస్ట్రేలియా అని వెళ్లిపోయి అక్కడే సెటిల్ అవుతుంటారు. అసలు పుట్టిన గడ్డను ఎలా మర్చిపోతారో అనుకునేది తను. స్టడీస్ కోసమో,

బిజినెస్ కోసమో వెళ్లిరావచ్చుగాని అక్కడే ఉండిపోయేదేమిటి? ఇండియా గుర్తుకొచ్చి సెన్సిటివ్‌గా అన్పించదూ అని కూడా అనుకునేది. తను ఏనాడూ కనీసం పుట్టినింటిని కూడా వదలి వెళ్లలేదు. వంశీ మాత్రం తల్లిదండ్రులు చూసిన పిల్ల పేరెంట్స్ అమెరికా పంపిస్తాం అనగానే అందుకు ప్రిపేరై పోయాడుగా. తననుకున్నంత సెంటిమెంట్ ఏం కాదు వంశీ.

ఈ డాక్టరెవరో గాని... హ్యాట్సాఫ్ టు హిమ్. ఈ విషయంలో ఆయనకు హార్టీ కంగ్రాట్స్ చెప్పాలి అనుకుంది.

"ఏంటీ... యామినీ ఆంటీ ఇంటిముందు అన్ని వెహికిల్స్ ఆగి ఉన్నాయ్" భానురేఖ ఆశ్చర్యంగా అనడంతో తన ఆలోచనల్లోంచి బయటికొచ్చిన అరవింద తమ ఆటో ఒక ఇంటి ముందు ఆగి ఉండడం గమనించింది. చుట్టూ చూసింది.

కొండరాళ్ల మధ్య కాస్ట్లీ డైమండ్‌ని పొదిగనట్టుగా ఉన్న ఆ భవనం ముందు బారులు తీరి ఉన్నాయి చాలా వాహనాలు. బార్లా తెరిచి ఉన్న ఆ ఇంటి గేటు లోపలికి, బయటికీ వస్తూపోతూ కన్పిస్తున్నారు చాలా మంది జనం.

ఆటోలోంచి దిగింది భానురేఖ. ఆమె వెంటే అరవింద కూడా దిగింది.

"ఏదైనా ఫంక్షనేమో?" అంది అరవింద.

"కావచ్చు" అంటూ అడుగు ముందుకేసింది భానురేఖ.

ఇద్దరూ ఆ ఇంటి గేటును సమీపిస్తుండగా వినిపించిన మాటలు ఇద్దర్నీ దిగ్భ్రాంతుల్ని చేశాయి.

"వెరీ నైస్ లేడీ. ఇంత ఘోరంగా యాక్సిడెంట్‌లో పోవడం. ప్చ్... దేవుడామెకు ఇలాంటి చావు రాయాల్సింది కాదు"

ఆ మాటలు విన్న అరవింద రోమాలెందుకో నిక్కబొడుచుకున్నాయి.

అసంకల్పితంగా ఆమె వెన్నుపూస ఝుల్లుమంది.




ఆ రోజు ఆదివారం. సమయం మధ్యాహ్నం పన్నెండు దాటుతోంది. లీలావతి కుర్చీలో కూర్చుని దానికున్న రెండు హేండ్స్‌నీ రెండు చేతుల్తో బలంగా పట్టుకుని ఉంది. కనుగుడ్లు గిరగిర తిప్పేస్తూ ఎటో చూస్తోంది. ముందుకూ వెనక్కూ ఊగుతూ పళ్లు పటపటమని కొరుకుతోంది.

ఎదురుగా భర్త సుధాకర్ అత్తామామలూ, మరిది నిలబడి ఆమెకేసి భయం భయంగా చూస్తున్నారు. మరో ముగ్గురు నలుగురు ఇరుగుపొరుగు ఆడవాళ్లు నిలబడి చోద్యం చూస్తున్నారు. వాళ్లలో అరవింద తల్లి తులసమ్మ కూడా ఉంది.

"నీకేం కావాలో చెప్పు కల్యాణీ" లీలావతి నుద్దేశించి వినయంగా అడుగుతున్నాడామె భర్త.

లీలావతి విన్పించుకున్నట్టు లేదు. కనీసం అతడి వంక కన్నయినా మలపలేదు. ఆమె ఊగిపోవడం మరింత జోరయింది.

"చెప్పు తల్లీ... పట్టు చీరె కావాలా... దుద్దులు కావాలా... నీ మనసులో మాట చెప్పమ్మా" అత్తగారు కోడలికి కాస్త దూరంలో నిలబడి గట్టిగా అడిగింది.

ఉన్నట్టుండి అత్తగారి వంక ఉరిమి చూసింది లీలావతి. పళ్లు పటపటమని కొరికి ఫక్కుమని నవ్వింది.

"కల్యాణీ... ఏంటా నవ్వు? ఏం కావాలో చెప్పు తెచ్చిస్తాను"

"ఏం కావాలో చెప్పాలా? చెబితే తెచ్చిస్తావా?" కనుగుడ్లు గుండ్రంగా తిప్పి మళ్లీ విరగబడి నవ్వింది లీలావతి.

ఆమె మామగారు ముందుకొచ్చారు "తప్ప

కుండా తల్లీ. నీ కోరిక తీర్చే బాధ్యత మాది"

"ఏరా... మరిదీ! నువ్వేమంటావ్?" లీలావతి సుధాకర్ తమ్ముడు ప్రభాకర్‌ని గుచ్చి చూసింది.

"నాదేముంది వదినా. అంతా నీ ఇష్టం" అన్నాడు ప్రభాకర్.

"అయితే వినండి..." లీలావతి ఊగడం ఆగింది. "రవ్వల గాజులేసుకోవాలని నాకెంత కాలంనుండో మహా ఇదిగా ఉంది. కోరిక తీరకుండానే పోయాను. నాకిప్పుడవి కావాలి. చేయించారో సరి. లేదంటే ఈ లీలావతి ప్రాణాలు తీసేస్తా. మిమ్మల్నందర్నీ సర్వనాశనం చేసేస్తా"

లీలావతి మళ్లీ వైల్డ్‌గా ఊగడం మొదలెట్టింది. పళ్లు కొరకడం ఎక్కువ చేసింది. కళ్లు బండి చక్రాల్లా తిప్పేస్తోంది. తలను అటు ఇటూ విసిరేస్తోంది.

"మొన్నేకదా కల్యాణీ... ఆఫీస్‌లో లోన్‌కి అప్లై చేసి నెక్లెస్ చేయించాను" అన్నాడు ఆమె భర్త.

లీలావతి ఒక్క అరుపు అరిచింది. కుర్చీ చేతుల్ని విరచటానికి ప్రయత్నించింది. అకస్మాత్తుగా లేచి అమాంతం నేల మీదకు దబ్బున కూలబడింది. పిడికిళ్ళు బిగించి తలమీద గుద్దుకుంటోంది. భయంకరంగా మూలుగుతూ తన శరీరాన్ని తనే అందిన చోటల్లా కొరుక్కోవటం మొదలెట్టింది.

"చంపేస్తానొరేయ్ లీలావతి గొంతు కొరికి రక్తం తాగేస్తా..." మధ్య మధ్యలో అరుస్తోంది.

"సరే... కల్యాణీ అలాగే చేయిస్తాను. లీలను వదిలిపెట్టు" అన్నాడు సుధాకర్.

"నిజమేనా?"

"నిజం... నీమీదొట్టు"

"నా మీద కాదు... మీ అమ్మ మీద ఒట్టేయ్"

"అమ్మ మీద ఒట్టు"

"నీ రెండో పెళ్ళాం మీద ఒట్టేయ్"

"లీల మీద ఒట్టు"

అయితే వెళుతున్నా. ఈ రోజు నుంచి పదిహేను రోజుల్లోపు గాజులు చేయించావా సరే, లేదంటే మళ్లీ వస్తాను. మళ్లీ వస్తాను. మళ్లీ..." అలా అంటూ అంటూనే లీలావతి నేలమీద నిస్త్రాణగా వాలిపోయింది.

లీలావతి అత్తగారు గబగబా గ్లాసుతో నీళ్ల తెచ్చి ఆమె ముఖాన చిలకరించింది.

నిద్రనుండి మేలుకున్నట్టూ కళ్ళు విప్పింది లీలావతి.

చుట్టూ నిలబడ్డ అందరి వంకా అయోమయంగా చూసింది.



అంతలోనే ఏదో అర్థమైందామెకు. కళ్లలో నీళ్లు చిప్పిల్లాయి. కొంగు ముఖానికి అడ్డంగా పెట్టుకుంది.

"ఎలా ఉంది లీలా?" అడిగాడు సుధాకర్.

లీలావతి సమాధానం చెప్పలేదు. భోరుమని ఏడ్చేసింది.

"ఊరుకో... ఊరుకో" సుధాకర్ ఆమె వీపు మీద తట్టి అనునయించాడు.

"నే చచ్చిపోతానండీ. నేను బతకను" లీలావతింకా ఏడుస్తూనే ఉంది.

"అమ్మాయిని గదిలోకి తీసుకెళ్లు" లీలావతి

మామయ్య చెప్పాడు కొడుకుతో.

సుధాకర్ లీలావతి చెయ్యి పట్టి లేపి మెల్లగా బెడ్ రూమ్ వైపు నడిపించుకెళ్లాడు. అతడి తండ్రి, తమ్ముడు లేచి లోపలికెళ్ళి పోయారు.

"ఇదంతా మా ఖర్మ" తల కొట్టుకుంది లీలావతి అత్తగారు ఇరుగు పొరుగు ఆడవాళ్ల వంక చూస్తూ.

"అయినా ఆ కళ్యాణి మహా ఆశ బోతులే. ఆ మనిషి నీ కోడలు అంటే కోపమొస్తుందేమో గాని కల్యాణి బతికున్న



ప్పుడు మా పిల్ల మంచి చీరె కట్టుకుని కనబడినా కళ్లలో నిప్పులు పోసుకునేది. అట్లాంటిది కోరికలు తీరకుండాపోయె. పాపం ఇప్పుడీ లీలావతికి వచ్చినయ్ తిప్పలు"

"లీలావతికేమమ్మా... అడిగినవన్నీ తెచ్చివ్వ లేక మేం పడుతున్నాం తిప్పలు. అది చచ్చి దయ్యమై పీడిస్తుంటే ఇది బతికుండే పీడిస్తోంది" అక్కసుగా అంది లీలావతి అత్త గారు. ఇరుగుపొరుగు లేచి బయటికొచ్చేశారు.

తులసమ్మ ఇంట్లోకొచ్చేసింది. మంచం మీద బోర్లా పడుకుని కూనిరాగం తీస్తూ నవల చదువుకుంటున్న శ్రీదేవి అడిగింది.

"ఈసారి దేనికి ప్లానేసిందమ్మా లీలావతి? "

"ఛ... ఊర్కో, ఆ పిల్లనంటావ్. కల్యాణి గోల ఇదంతా. రవ్వల గాజులు అడిగింది"

"వారెవా... లీలావతీ!" శ్రీదేవి మెచ్చుకుంది.

"మీరంతేనే చదివేస్తే ఉన్న మతులు పోయాయని, ఏదీ నమ్మరు. అదేం ఫ్యాషనో. ఆ సుధాకర్ మీలాగే ముందు నమ్మక లీలావతిని ఎంత మంది డాక్టర్లకు చూపించాడో! నయమైందా! చివరికి విసిగిపోయి లీలను పుట్టింటికి పంపబోతుంటే ఏమైంది? "

నిన్న చనిపోయిన యామినీ శరశ్చంద్ర గురించే ఆలోచిస్తూ తన గదిలో పడుకుని ఉన్న అరవింద బయటకొచ్చింది. "ఇంట్లో గ్యాస్ సిలిండర్ దానంతటదే లీకయింది. అదె లాగో తప్పించుకుంటే లీల మామగారు మెట్ల మీంచి జారిపడి కాలు విరగ్గొట్టుకున్నాడు. మరోసారి ఆమెకు షాక్ ట్రీట్‌మెంట్ ఇప్పిద్దామనుకుంటుంటే సుధాకర్‌కి బాత్‌రూమ్‌లో గీజర్ షాక్ కొట్టి ఆస్పత్రి పాలయ్యాడు.

కదమ్మా".

"అందుకేగా అరూ, వాళ్ళు భయపడిపోయి కల్యాణి కోర్కెలన్నీ తీర్చేస్తున్నారు"

"అమ్మా... ఎంత వెర్రిదానివే" అరవింద తలమీద కొట్టుకుని నవ్వింది.

"అంటే..." ఇంతకీ నువ్వు చెప్పొచ్చేదేమిట న్నట్టు చూసింది తులసమ్మ చిరాగ్గా అరవింద వైపు.

అరవింద నవ్వింది. "లీలావతి ఆశబోతు మనిషై ఉంటుంది. రెండో పెళ్ళివాణ్ణి చేసుకో వడం వల్ల మొదటి పెళ్ళివాణ్ణి చేసుకోని లోటు ఆమె హృదయాన్ని కలత పెట్టి ఉంటుంది. బహుశా అది తీరని కొరతై ఉంటుంది. ఆ కొరతను మరో రకంగానైనా కాంపెన్సేట్ చేయాలి. ఒక విషయంలో కుంగి పోయినా ఇంకో విషయంలో పొంగిపోవాలి. ఆమెకు నగల మీద చీరెల మీద మోజెక్కువ. ఆ మోజులో శాచ్యురేషన్ సాధించాలి. శాచ్యు రేషన్ సాధించాలంటే కేవలం భర్తను వేధిస్తే చాలదు. అతడు అంగీకరించక పోవచ్చు కూడా. అందుకే కల్యాణి ఆత్మ తన్నావహించి నట్టు ట్రిక్ ప్లే చేస్తోంది. కోరికలు తీర్చుకుం టోంది. తననెవరూ అనుమానించకుండా, ఏ పుట్టింటికో వెళ్లగొట్టకుండా చాలా తెలివిగా వాళ్లని ప్రమాదాల్లో ఇరికిస్తోంది. కల్యాణి ఆత్మకు వాళ్లు భయపడి సాగిలపడేలా చేస్తోం ది. కోరికలు తీరని ఆడవాళ్ళు చాలామంది ఇలాగే తీర్చుకుంటుంటారు. వారి ఆశలు పల్లె టూళ్లలో అయితే మరీ. ఇలాంటి వాళ్లు కనీసం పది కుటుంబాల కొకరుంటారు. సిటీ ల్లో రేర్. ఆ రేర్ క్యారెక్టర్ ఈ లీలావతి"

"మీతో నేను వాదించలేను గాని భోజనా లకు లేవండి"

తల్లికి తన రీజనింగ్ నచ్చలేదని ఆమె ముఖంలోని అయిష్టతే చెప్పింది అరవిందకు. "అమ్మ పిచ్చిది" అని నవ్వుకుంది అరవింద.

వాళ్ళు భోజనాలు చేస్తూ లీలావతి గురించి, ఆత్మల గురించి ముచ్చటించుకుంటున్నారు. మధ్య మధ్యలో తులసమ్మను ఆట పట్టిస్తు న్నారు.

తులసమ్మ టాపిక్ మార్చి "వసంతను చూసేందుకు వాళ్ళు రేపే కదూ, వస్తామ న్నారు" అంది.

"రేపు కాదు ఎల్లుండి" చెప్పింది శ్రీదేవి.

"ఎల్లుండి నువ్వు సెలవు పెడతా వామ్మా? "అరవిందను అడిగింది తులసమ్మ.

"ఆc పెడతానమ్మా"

తులసమ్మ కళ్లలో నీరు చిప్పిల్లింది. అర వింద కేసి కడుపు తరుక్కు పోతున్నట్టు చూసింది.

అరవిందకు అర్థమైపోయింది. "మీ నాన్నే ఉంటే నిన్నో అయ్య చేతిలో పెట్టి..." అంటూ మొదలు బెట్టి ఆపైన ఏడ్చేసి అన్నం వదిలేసి లేచిపోతుందిక అమ్మ. ఆ ప్రమాదం నుంచి తప్పించడానికి అంది "శీను ఏడీ? ఇంకా భోజ నానికి రాలేదు"

"ఏమో పొద్దుననగా వెళ్ళాడు. ఈసారన్నా ఉద్యోగం వస్తే నీకు సగం భారం దిగిపో తుందే అరూ!"

అరవింద చెయ్యి కడుక్కుని తన గదిలోకి వెళ్ళిపోయింది.

మంచం మీద వెల్లకిలా పడుకుని పైకప్పు కేసి చూస్తూండిపోయింది. చప్పున 'వంశీ' గుర్తొచ్చాడు. గుండె పట్టేసినట్టయింది.

'వద్దు. అతడి గురించి తను ఆలోచించకూ డదు. అయినా ప్రపంచమే యాంత్రికమైపో తున్న ఈ రోజుల్లో ఇంకా మనిషేమిటీ? మనసేమిటీ? ఆత్మీయతా అనురాగం లాంటి మాటలకు అర్థాలు క్రమంగా మాయమైపో తుంటే.

ఈ కాలంలో ఎవరికి ఎవరూ ఏమీ కారు. నేనెవరికీ ఏమీ కాని ఆ స్థితి త్వరగా వస్తే బాగుండు.

అప్పుడు వంశీ గుర్తు రాడు. తన గుండె ఇలా బాధతో పిండుకుపోదు. కళ్లిలా కన్నీళ్లను స్రవించవు.

హాయిగా ఓ శిలలా బతకొచ్చు. ఏ దుఃఖం తననిలా కుదిపి వేయదు.

అవునూ, మరి తనలా మారిపోతే. ఇక వసంతకూ, శ్రీదేవికీ, శీనుకూ, అమ్మకూ దిక్కె

వరు?

వాళ్ళు కూడా బండబారి పోతారుగా అంటే... అమ్మా కూతుళ్లూ, అక్కా చెల్లెళ్ళూ, తమ్ముళ్లూ, అన్నలూ... ఎవరికి వారుగా, విడిగా స్వార్థంగా, ప్రేమ రాహిత్యంలో.

నో... అలా జరక్కూడదు. ఈ లోపే నా వాళ్ళకు నేనో దారి చూపాలి. ఆనక ఎవరి జీవితం వాళ్లదయినా తనకు బాధ లేదు.

మనసుల్లోని మమతలు కరడు గట్టే కాలం పూర్తిగా రాకముందే తను కరిగి ప్రవహించాలి.

ఆలోచిస్తూ కళ్ళు మూసుకుని పడుకుంది అరవింద.

"ఇంటర్వ్యూ ఎలా చేశావన్నయ్యా" శీను వచ్చాడేమో, శ్రీదేవి అడుగుతోంది.

న్నారలా? ఎదురుగా వంశీ. తనను మింగేసేలా చూస్తూ నిలబడి ఉన్నాడు.

క్రమంగా అతడి కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి.

"అరవిందా... ఎంత నిర్దయురాలివి. నా దారిన నన్ను వెళ్లి పొమ్మని ఎంత నిష్కర్షగా చెప్పావ్?"

"నేను చెప్పానా, నువ్వే. నువ్వే నన్ను వదిలి వెళ్ళిపోయావ్. నా కోసం నిరీక్షించే ఓపిక లేదని. మహా సముద్రం ఒడ్డున నన్ను ఒంటరిగా వదిలేసి..."

"అక్కా... ఏడుస్తున్నావా?" ఆ మాటలకు ఉలిక్కిపడుతూ తల తిప్పి చూసింది అరవింద. పక్కనే తమ్ముడు.

***అలనాటి మేటి రచయిత గుడిపాటి వెంకటాచలం స్త్రీస్వేచ్ఛకోసం కలాన్ని తుపాకీలా వాడారు. కుహనా విలువలమీద దండెత్తారు. మరోకోణం నుంచి చూస్తే ఆయన గొప్ప హాస్యప్రియుడు. ఆయన వివిధ సందర్భాల్లో ఉపయోగించిన చతురోక్తులలో ఇవి కొన్ని..***



చలం

**చాలా ఆయుష్షు వుంది మీకు..**

ఉత్తరాల్లో హాస్యం చిలకరించడం చలానికి కొట్టినపిండి. ఒకానొక మిత్రుడికి ఉత్తరం రాస్తూ, 'ఏమిటి మీ మధుకు అంత జబ్బుచేసిందా? బతికాడు. మా మధుకైతే పెళ్లయింది. పాపం చావడంకన్న పెద్ద పనైపోయింది. సినిమాకు వెళ్లినా మీ ఆరోగ్యం చెడిపోకుండా ఉందికదా? అయితే ఫర్వాలేదు. చాలా ఆయుష్షు వుంది మీకు'. అంటూ చదువరుల పెదాలపై ఆయన చిరునవ్వులు పూయిస్తారు.

"బాగానే చేశాలే. అమ్మా అన్నం పెట్టు" శీనులో నిరాసక్తత.

"బాగానే అంటున్నాడుగా. ఇక అడిగేదేముందిలే" వసంత సణుగుతోంది.

"ముందు వాణ్ణి నాలుగు మెతుకులు తిననివ్వండే" అమ్మ గదుముతోంది.

"అక్కేది?"

"పడుకుందిరా" తల్లి సమాధానం.

తను పడుకుని ఉందా? అంత ప్రశాంతత తనకుందా?

ఎందుకు లేదూ? ఉంది. ఎవరూ అంటు

"శీనూ... రా కూర్చో ఏడవటమా? కంట్లో నలక పడింది ఇందాకట్నుంచీ ట్రై చేస్తున్నా రావటం లేదు. అద్సరే. ఇంటర్వ్యూ... ఎలా చేశావు?"

"అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ వస్తే బాగా చేసినట్టేనక్కా" శీను తల దించుకున్నాడు.

శీను ఫీలవుతున్నాడని గమనించింది అరవింద.

"వెళ్ళి పడుకో పో" అంది.

శీను వెళ్లిపోయాడు.

ప్చ్... ఏమిటో మనుషులు. దిగుళ్లూ,

గుబుళ్ళూ.

అరవింద నిట్టూర్చింది. పుస్తకం కోసం అల్మరా తీస్తే యామిని హాండ్‌బేగ్ కన్పించింది.

తనకది దొరకడం. ఆమె నేచర్ భానురేఖ ద్వారా విని తనామెను చూడాలనుకోవడం. తీరా వెళ్తే ఆమె చనిపోయి ఉండటం

ఆ రోజు తనామె ముఖంలోకి చాలా ఆసక్తిగా చూసింది. నిన్న విరబూసిన గులాబీలా ఉంది. కలలు చెదిరిపోగా కలత చెందిన దేవతలా ఉంది.

డైరీ శరశ్చంద్రకు ఇద్దామనుకుంది గానీ... అది సమయం కాదనుకుని వచ్చేశారు స్నేహితులిద్దరూ.

ఆయన నార్మల్ అయిన తర్వాత ఎప్పుడో క్లినిక్‌లో కలసి ఆ బ్యాగ్ ఇద్దామనుకుంది అరవింద. యామినిని చూడకుండానే ఆమె పట్ల తనెంత అడ్మిరేషన్ పెంచుకుందో చెప్పాలని కూడా అనుకుంది.

అరవింద కిటికీలోంచి ఆకాశంకేసి చూసింది. ఎక్కడో దూరంగా ఓ పక్షి చుక్కలా కదులుతూ ఎటో ఎగిరిపోతోంది.

ఆకాశంలోని కాంతికి ఓ మబ్బుతునక ధగధగమంటోంది. అక్కడ ఏదో ఆకారం. ఎవరిదో అస్పష్టంగా తనకేసి చూస్తూ గాలి వీస్తున్నట్టు మెత్తగా నవ్వుతూ అది. ఆ... ఆకారం... ఆమె... యామినీ శరశ్చంద్ర కదూ!

అరవింద గుండెందుకో ఒక్కక్షణం ఆగి కొట్టుకుంది.




నిజంగా ఆ రోజులే బాగుండేవి.

నీ పేరేంటమ్మా?

కుట్లూ అల్లికలు ఏమైనా వచ్చా?

వంట చేస్తావా?

చాకలి పద్దులూ, వెచ్చాల పట్టికలూ రాయగల పరిజ్ఞానం ఉందిగా పిల్లకు?

ఏదీ ఓ సారలా నడిచి చూపించు.

ఓ పాట పాడమ్మాయ్. మావాడు వింటాట్ట... లాంటి ప్రశ్నల వెనుక కాస్త కళాహృదయం, కొంచెం సైన్సూ కొద్దిగా ఆదరం... అభిమానం లాంటివి తొంగి చూస్తుండేవి. కుట్లూ, అల్లికలూ వచ్చిన కోడలైతే అత్తమామలకు మురిపం. పాటలు పాడగల నేర్పరైతే గర్వం. నడకలో, చూపులో లోపం లేనిదైతే పుట్టబోయేవాళ్లు ఆరోగ్యంగా ఉంటారన్న నిశ్చింత. కానీ ఇప్పటి ప్రశ్నల వెనక...

"అమ్మాయ్... పేరేంటన్నావ్?" పై నుంచి కిందిదాక ఒకే టైపులో సిలిండర్‌లా ఉన్న యాభై ఏళ్లావిడ అడిగింది.

"వసంత"తల దించుకునే చెప్పింది వసంత.

"ఏం చదువుకున్నావ్?"

"డిగ్రీ చేశానండి"

సిలిండర్ భర్త కాబోలు వెదురు బొంగులా ఉన్న ఒకాయన చప్పరించేశాడు. "ఆఁ... ఏం డిగ్రీలే! ఈ కాలంలో పీ.జీ. అనిపించుకోందే విలువలేదు"

"టెక్నికల్ కోర్సు ఏదైనా చేశారా?" సిలిండర్, వెదురు బొంగుల కుమారరత్నం అడిగాడు.

"ఇతణ్ణి చూస్తుంటే ఏమిటో గుర్తుకొస్తోంది. ఏంటబ్బా?" అనుకుంది లోపలి గది కర్టెన్ చాటునుంచి కాబోయే బావగారికేసి చూస్తున్న శ్రీదేవి.

"టైప్‌రైటింగూ, షార్ట్‌హేండు చేశానండీ" చెప్పింది వసంత.

"ఈ కాలంలో టైప్ రైటింగ్ విడిగా నేర్చుకోడమెందుకండీ. కంప్యూటర్ కోర్స్ చెయ్యాల్సింది"

'ఆ గుర్తుకొచ్చేసింది. అచ్చు స్క్రూడ్రైవర్‌లా వున్నాడు' అంతవరకూ అతన్ని చూస్తుంటే ఏం గుర్తుకొస్తుందో తేల్చుకోలేక సతమతమౌతున్న శ్రీదేవి నిట్టూర్చింది హమ్మయ్య అను



## మైగ్రైన్‌కు కొత్త మందు

మైగ్రైన్ తలనొప్పితో బాధపడుతున్నారా? అయితే మీకో శుభవార్త!

బ్రెజిల్‌లో శాస్త్రవేత్తలు మైగ్రైన్ బాధితుల మీద పరిశోధనలు జరిపి కొత్త మందు కనుగొన్నారు. 'మెలటినిన్' అనే హార్మోను వాడటం వల్ల ఎక్కువ మంది ఈ బాధ నుంచి ఉపశమనం పొందుతారు. ఈ హార్మోను నిద్రపోవటం, నిద్ర లేవడాన్ని క్రమబద్ధం చేయటమే కాక, మైగ్రైన్ తలనొప్పి తగ్గిస్తుంది.

మైగ్రైన్ తలనొప్పితో బాధపడుతున్న 34 మందికి 3 మి.గ్రా.ల మెలటొనిన్, నిద్రపోయే ముందు మూడు నెలలపాటు ఇచ్చారు. డెబ్భైఎనిమిది శాతం మందికి మూడు నెలల్లో అతి తక్కువసార్లు ఈ తలనొప్పి వచ్చినట్టు, ఇరవై ఐదు శాతం మంది పూర్తిగా నివారణ పొందినట్టు తెలిపారు. మెలటొనిన్ మెదడులో సమతుల్యత కోల్పోయిన రసాయనాలను క్రమబద్ధం చేయడంతో మైగ్రైన్ తలనొప్పి మటుమాయమవుతుంది.

కుంటూ!

"ఏదైనా ఉద్యోగం చేస్తున్నావా? " వెదురు బొంగు అడిగాడు.

లేదన్నట్లు వసంత తల అడ్డంగా తిప్పింది.

వెదురు బొంగూ, సిలిండరూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ఆనక సిలిండరు, స్క్రూడ్రైవర్ ముఖంలోకి చూసింది. స్క్రూడ్రైవర్ పెదవి విరిచింది.

"మా వసంత చక్కగా పాడుతుందండీ, స్కూల్ లైఫ్ నుండి కాలేజ్ లైఫ్ వరకూ ఎప్పుడు పాటల పోటీలు జరిగినా దీనికే ఫస్ట్ ప్రైజ్" చెప్పింది అరవింద.

'ఓ పాట పాడమంటారా? " అన్నట్టు చూసింది వసంత.

"పాటలూ, పద్యాలూ కడుపు నింపుతాయా అమ్మాయ్? ఈ కాలంలో ఉద్యోగం పురుష లక్షణమే కాదు, స్త్రీ లక్షణం కూడా. ధరలు మండిపోతున్నాయ్. అన్నిటికీ అన్నీ అమర్చుకోవాలంటే మొగుడూ పెళ్లాలిద్దరూ కష్టపడాల్సిందే" సిలిండర్ అంది.

"మీరూ ఉద్యోగం చేస్తున్నారాండీ? " కోపాన్ని అదిమిపట్టి అడిగింది అరవింద.

"మా కాలంలో అన్ని తెలివితేటలెక్కడివీ? అసలప్పట్లో ఆడపిల్లల్ని బయటకు పంపించేవాళ్లేకాదు. చక్కగా ఇల్లు తీర్చిదిద్దుకుని, భర్తనీ, పిల్లల్నీ లక్షణంగా చూసుకుంటే చాలు. ఆ రోజుల్లో మా తీరే వేరు. ఆ రోజులే వేరు" అందావిడ.

అవును అప్పుడు... ఆ రోజుల్లో జీవితాన్ని అనుభవించడానికి టైం ఉండేది. ఈ రోజుల్లో జీవితాన్ని నెట్టుకురావడానికే టైం చాలడం లేదు.

సిలిండరూ వెదురుబొంగూ హాల్లోంచి లేచి వెళ్లి వరండాలో నిలబడి గుసగుస మాట్లాడుకున్నారు, ఓ పదినిముషాల తర్వాత లోపలికొచ్చారు.

"మొహమాటం వద్దు. మనసులోని మాట చెప్పండి. ఆనక వాళ్లిష్టం" ఇబ్బంది పడుతున్న వెదురుబొంగుతో అంది సిలిండర్.

"మాకు ఉద్యోగం చేసే పిల్లను చేసుకోవాలని ఎప్పట్నించో ఆశ. ఆ ఆశెలాగూ తీరడం లేదు కాబట్టి ఓ లక్ష ముట్టచెబితే..."

కర్టెన్ చాటునుంచి కిసుక్కున నవ్వింది శ్రీదేవి. అందరూ... నవ్వింది నువ్వా నువ్వా అన్నట్లు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. ఎవరైందీ అర్థం కాలేదు. శ్రీదేవి బాగా

చాటుకి తప్పుకుంది.

"పిల్ల ఒంటిమీద బంగారం పిల్లదే కద మ్మాయ్" అరవింద లక్ష రూపాయల కట్నం అన్న మాటకు మౌనం వహించడంతో 'టేకింగ్ థింగ్స్ గ్రేటెడ్' పద్ధతిలో ఇక బంగారం ముచ్చట కొచ్చేసింది సిలిండర్.

'గాజులు ఎదురింటి అర్చనక్కవీ. మెళ్లో రెండు పేటల గొలుసుందే అది మా పక్కింటి లీలావతిగారిది. ఇకపోతే గొంతుకు పెట్టుకుని ఉందే ఒంటిరాయి నెక్లెస్ అది మా అరవింద క్కయ్య ఆఫీసులో పన్చేసే క్రిష్ణారావ్ భార్యది' అని అరిచి చెప్పాలన్పించింది శ్రీదేవికి కానీ, అరవిందక్క ఏం చెబుతుందో అన్నట్టు ఊరు కుంది.

అరవింద ఏమీ చెప్పలేదు. ఏం తోచన ట్టుగా తల్లి వైపు చూసింది.

"పిల్ల ఒంటిమీద బంగారం సంగతేమో గాని పిల్ల బంగారమమ్మా" అంది తులసమ్మ సిలిండర్‌తో.

"కరిగించి నగలు చేయించుకోవచ్చుయితే" మొదటి నుంచీ మాటా పలుకూ లేకుండా కాలిమీద కాలేసుక్కూర్చుని వసంతను నఖశిఖ పర్యంతం గుచ్చి గుచ్చి చూస్తున్న సిలిండర్ పెళ్ళికాని కూతురు అంది.

"ఈ పిల్ల అచ్చు ప్రిస్టేజ్ కుక్కర్‌లా ఉంది" శ్రీదేవి తనలో తను అనుకుంది.

తులసమ్మ గొంతు విప్పింది "ఆయన పోయిన దగ్గర్నుంచీ సంసార బాధ్యతనంతా నెత్తినేసుకుంది మా పెద్దమ్మాయి. నేను తల్లి నన్న మాటేగాని అసలు తల్లి అదే. ఈ పిల్ల లకు ఓ పాతికో పరకో అంటే ఇచ్చుకోగలదు గాని లక్షలంటే దానివల్ల కాదు. పెద్ద మన సుతో ఆలోచించండి"

సిలిండరూ, వెదురుబొంగూ మళ్లీ వరం డాలో కెళ్లారు. ఈసారి వాళ్లతో స్క్రూడ్రైవర్ కూడా జాయిన్ అయ్యాడు. కాసేపు తర్జన భర్జనలు పడ్డాక ముగ్గురూ లోపలికొచ్చారు.

"మీ పిల్ల మా వాడికి మరీ నచ్చింది కా బట్టి వదులుకోలేకున్నా. ఇంకో మాట చెబు తాం. దానికొప్పుకుంటే మీ పిల్లను మా కోడ లిగా చేసుకోవటానికి మాకేం అభ్యంతరం లేదు"

తులసమ్మ తడికళ్లలో దీపాలు వెలిగాయి "చెప్పండన్నయ్యగారూ" వరుస కలిపేసింది ఆనందంతో. వెదురుబొంగు అరవింద వంక తిరిగాడు "నువ్వు పని చేసేదెక్కడమ్మా? "

"వి అండ్ జె ప్రైవేట్ లిమిటెడ్‌లోనండీ"

"ప్రైవేట్ సంస్థా? "

"త్వరలో గవర్నమెంట్ అండర్ టేకింగ్ లోకి వెళుతోందండీ"

"జీతమెంతో? "

అరవింద ఒక్కక్షణం తటపటాయించి చెప్పింది "మూడువేలా ఐదువందలు"

"అంటే సంవత్సరానికీ..." ఆయనోక్షణం ఆగి లెక్కలేసి చెప్పాడు "పన్నెండుమూళ్ల ముప్ఫయ్యారు, పన్నెండైదుల అరవై, వెరశి నలభైరెండు వేలు"

ఆ లెక్కలెందుకో అర్థంకాలేదు అరవిందకి.

"చూడమ్మాయ్... మీ చెల్లిక్కూడా టైపు షార్ట్‌హేండూ వచ్చుగా!"

"వచ్చండీ"

"మరి మరి"

"చెప్పండి"

"నీ ఉద్యోగం ఆ పిల్లకు బదిలీ చేయించు. ఇక ఒక్కపైసా కట్నం అక్కర్లేదు మాకు"

అరవిందకు ఒక్కక్షణం అర్థం కాలేదు అత నేమంటున్నాడో! అయ్యోలోగా తులసమ్మ అందుకుంది "దాని ఉద్యోగం దీనికేయించి మీ ఇంటికి పంపితే నా యిల్లేం కావాలి? నాకు వసంతొక్కర్తే బిడ్డ కాదే. ఇంత అన్యాయ మా? అసలు మీరు ఆలోచించే మాట్లాడుతు న్నారా? "

వసంత లేచి ఇంట్లోకెళ్లిపోయింది "అది కాదండీ... అసలు ఉద్యోగం అలా మనిష్టప్ర కారం ఎవరికంటే వాళ్లకి బదిలీ చెయ్యడానికి మేనేజ్‌మెంట్ ఒప్పుకుంటుందా? " అరవింద అయోమయంగా అంది.

"ఒప్పుకుంటేనే. మీ పిల్ల ఉద్యోగస్తురాలైతేనే ఈ పెళ్లి జరుగుతుంది"

ఇంట్లోకి బయటకి తిరుగుతూ కావల్సినవి అమరుస్తున్న శీను అక్కడికి వచ్చి "మీరు

వద్దూ మీ సంబంధమూ వద్దు. ముందు బయటకి నడవండి" అన్నాడు.

"నడవక ఇక్కడెందుకుంటాం? కట్నమూ ఇవ్వక, ఉద్యోగమూ లేక ఎవడు చేసుకుంటా డోయ్ నీ అక్కను" స్క్రూడ్రైవర్ ఎద్దేవా చేశాడు.

"నీలాంటి వెధవ కానివాడు చాలా" శీను రెచ్చిపోయాడు.

"ఏం కూశావ్? "

తులసమ్మ ఏడుస్తోంది. చేతులెత్తి వాళ్లకి దండం పెట్టి వెళ్లిపొమ్మంటోంది.

అరవింద, శ్రీదేవి కలిసి శీనూని లోపలికి లాక్కుపోయారు. వసంత మంచం మీద బోర్లాపడి వెక్కుతోంది.

వసంతను ఓదారుస్తూ శ్రీదేవి "అసలు ఆ స్క్రూడ్రైవర్ గాడినేమిటక్కా నువ్వు చేసుకు నేది. ఛీ..." అంది.

ఆ రాత్రి అరవిందకు నిద్రపట్టలేదు.

కాలం మారిపోతోంది. మనిషి మనిషిననే విషయాన్ని మర్చిపోతున్నాడు. మానవ త్వమా? అంటే ఏమిటీ అనడగుతున్నాడు. దయా... జాలీ... అనే పదాలు నేనెప్పుడూ వినలేదే అని ఆశ్చర్యపోతున్నాడు.

అరవింద లేచి కిటికీ ఊచల్ని పట్టుకుని బయటికి చూసింది.

ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి. 'తను... తనసలు తన కుటుంబానికి ఏమైనా చెయ్యగలదా? ఎప్పటి కైనా? ఆ ఆలోచనతో అశక్తత ఆవరించింది అరవిందను.

"ఈ మగాళ్లెందుకు ఇంత స్వార్థంగా మారి పోతున్నారు? సంపాదించకుండానే లక్షలొచ్చి ఒళ్లో వాలాలట."

దుర్మార్గులు, నీచులు, నికృష్టులు.

అందరూనా? మరి వంశీ. వంశీ అయితే తన కోసం ఆ లక్షల్ని వదులుకుని వస్తానం టున్నాడు. తనే అతన్ని కాలం ఆవలి అంచు లకు తరిమి కొట్టింది.

ఇంత చేసీ తను తనను నమ్ముకున్న వాళ్లకి ఏం చేస్తోంది?

ఒకరికి సహాయం చెయ్యటానిక్కూడా అర్హత ఉండాలేమో తనకు తనే సాయం చేసు కోలేని తను ఒకరికేం చెయ్యగలదు?

కిటికీలోంచి గాలి జివ్వుమని వీచింది. అర విందకు ఒళ్లంతా గగుర్పొడిచింది. చప్పున వచ్చి మంచం మీద పడుకుండి పోయింది.

అల్మారా తలుపెందుకో తెరుచుకుని ఉంది. మొదటి ర్యాక్‌లో ఓ మూలగా ఉన్న యామిని హ్యాండ్ బ్యాగ్ నైట్ బల్బ్ కాంతి లో కూడా స్పష్టంగా కన్పిస్తోంది.

దానికేసే నిర్నిమేషంగా చూస్తుండి పోయింది అరవింద.

అలా చూస్తూ చూస్తూనే నిద్రలోకి జారిపో యింది.

4



'నువ్వు వెళ్ళిపోయినా నీ జ్ఞాపకం నన్ను వీడిపోదు. నా హృదయం ద్రవీభవించి కురి సిన కన్నీరు నీ చుట్టూ ఘనీభవించి నీకూ, నాకూ మధ్య మంచు గోడను నిర్మిస్తుంటే ఇక నిన్నెన్నటికీ నేను చూడలేనేమో అన్న బాధ నా బతుకునే కుదిపివేయగా ఒక వేడి నిశ్వ సనం విడిచా. ఆశ్చర్యం. అది మంచు గోడను నిలువునా కరిగించి వేసింది.

ఇప్పుడు నా ఎదురుగా నువ్వున్నావ్. నిన్ను భౌతికంగా నేను స్పృశించక పోతేనేం. నా మనసు నిన్ను అవిరామంగా హత్తుకుంటూనే ఉంటుంది. నా జీవితపు దారిలో నువ్వు వెద జల్లిన జ్ఞాపకాల సుగంధాలను ఆఘ్రాణిస్తూనే ఉంటుంది.

శరశ్చంద్ర డైరీ రాయడం ముగించి, రాసిన దాన్ని ఓ సారి చదువుకున్నాడు. ఆయన కళ్లలో చిప్పిల్లి చెంపల మీదుగా జారిన ఓ కన్నీటి చుక్క డైరీ పేజీమీద పడి ఇంకిపో యింది.

'యామినీ ఈ కన్నీటి చుక్క నేను నీకిచ్చే బహుమతి. ఇది వెలకట్టలేని బహుమతి సుమా! ఎందుకంటే ఒకరి కోసం మరొకరి హృదయాంతరాళం స్పందిస్తే ఆ స్పందన గుండె పునాదుల్ని కుదిపేసినప్పుడు అక్కడి అట్టడుగు పొరల్లో ఉన్న ఆర్తి మొత్తం ఒక నీటి బిందువై కనురెప్పల్ని చీల్చుకుని రాలుతుంది కనుక

ఆయన లైటార్పి బెడ్ లైట్ వేశాడు.

"యామినీ ఎలా నిన్ను... నిన్నోసారి చూడాలని ఉంది. ఒక్కసారి రావూ... జన్మంతా సరిపడా నిన్ను కళ్లలో నింపుకుంటాను".

ఆయనకు నిద్ర పట్టడం లేదు. లేచి కూర్చున్నాడు. కిటికీ కున్న కర్టెన్ తొలగించి, శూన్యంలోకి చూస్తున్నాడు.

వెన్నెల వెండి మంట లా ఉంది. చుక్కలు ఆ మంటలోంచి పైకెగసిన నిప్పు రవ్వల్లా ఉన్నాయ్.

ఎవరో తలుపు తట్టినట్లు అన్పించి చివుక్కున వెనుదిరిగి తలుపుకేసి చూశాడు.

నిశ్శబ్దం. నిశ్వసిస్తోందక్కడ.

తిరిగి కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు.

వెన్నెల వెలుగుల్లో చెట్ల ఆకులు మెల్లిగా కదలడం కనబడుతోంది.

ఆ కాంపౌండ్‌లో తిరుగుతున్న బ్రౌనీ ఎందుకో ఊరికే అరుస్తోంది.

మళ్లీ శబ్దమైంది తలుపు మీద.

శరశ్చంద్ర ఈ సారి తలుపుకేసి చూడలేదు. చప్పున తెరిచేశాడు.

"ఎవరూ? "

ఆయన బాల్కనీలోకి వచ్చాడు ఎవరూ కనబడలేదు. మంద్రంగా పరుచుకున్న జీరో బల్బు వెలుతురు తప్ప పై గదుల్ని కింద హాల్‌కి కనెక్ట్ చేస్తూ ట్విస్టెడ్‌గా ఏర్పాటు చేసిన మెట్ల మీదుగా కిందకి దిగాడు.

అంతా నిశ్శబ్దం.

ఒక్క క్షణం అక్కడున్న సోఫాలో కూర్చుని వెనక్కు జేరబడి కళ్ళు మూసుకున్నాడు.

"బాబుగారూ!" ఆ హాల్లోనే ఓ మూలగా పడుకుని ఉన్న జోగి, యజమాని అలా అర్ధ రాత్రి కిందికి రావడంచూసి కంగారుగా లేచొచ్చాడు.

"ఏం లేదులే జోగయ్యా. నువ్వెళ్లి పడుకో"

"కాసిని పాలు ఇమ్మంటారా? భోజనం కూడా చేయలేదు తమరు".

"ఏంటి జోగయ్యా అంటున్నావ్? మీ అమ్మగారు లేకుండా నేనెప్పుడైనా భోంచేశానా? "

జోగి కళ్లలో నీళ్లు నిండుకున్నాయి "అట్లా అని ఎన్నాళ్లు పస్తులుంటారు బాబూ"

"బహుశా నా యామిని దగ్గరకు నేను చేరే వరకూ"

జోగి చప్పున ఆయన కాళ్ల దగ్గర కూర్చున్నాడు. "తమరింత పెద్ద డాక్టరు. చావు బతుకులు రోజు కిన్ని కళ్ల జూస్తుంటారు. నేను తమరికి చెప్పేటంత టోణ్ణా"

"యామిని చనిపోయిందా జోగయ్యా"

"బాబుగారూ" జోగి దుఃఖాన్ని మింగుకున్నాడు.

"నాలో ఉందనుకుంటున్న ఈ ప్రాణం యామినిది. పోయిందనుకుంటున్న యామిని లోని ప్రాణం నాది. చూడు జోగయ్యా! మీ అమ్మగారు చనిపోలేదు. నేను... నేను చనిపోయాను. కాలి బూడిదైపోయాను"

శరశ్చంద్ర రెండు చేతుల్లో ముఖం దాచుకున్నాడు. జోగయ్య ఆయన పాదాలు రాస్తూ "బాబూ.. నేనోమాట చెబుతాను. కొట్టి పారెయ్యకండి" అన్నాడు.

ఏంటన్నట్టు చూశాడు శరశ్చంద్ర.

"అమ్మగారు పోయినా ఆమె ఆత్మ ఇక్కడే


ఒకరి కోసం మరొకరి హృదయాంతరాళం స్పందిస్తే ఆ స్పందన గుండె పునాదుల్ని కుదిపేసినప్పుడు అక్కడి అట్టడుగు పొరల్లో ఉన్న ఆర్తి మొత్తం ఒక నీటి బిందువై కనురెప్పల్ని చీల్చుకుని రాలుతుంది

తిరుగుతోంది బాబూ. ఇందాకా అమ్మగార్ని కళ్లారా చూశానయ్యా"

"జోగీ!"

"నిజం. బాబూ! ఒంటికని లేచిపోతుంటే మీ గది ముందు అమ్మగారు నిలబడి తలుపు తట్టడం కన్పించింది"

శరశ్చంద్ర ఎగ్జయిటింగ్‌గా చూశాడు.

"జోగయ్యా నిజంగా చూశావా?"

"తమరి మీదొట్టు బాబూ"

శరశ్చంద్ర లేచి జోగయ్య భుజాలు పట్టి కుదిపేశాడు. "అప్పుడు నువ్వేం చేశావ్? అమ్మగార్ని పలకరించావా? నన్ను లేపకూడదూ?"

జోగయ్య శరశ్చంద్ర కళ్లలోకి బెరుగ్గా చూశాడు. "నాకు భయమేసి ఒంటికి పోకుండానే వచ్చి పడుకున్నానయ్యా"

శరశ్చంద్ర పళ్లబిగువున కోపాన్ని ఆపుకున్నాడు. "పొరపాటు చేశావ్ జోగయ్యా".

ఆ మాటలని తల పట్టుకూర్చున్నాడు.

జోగి కాసేపు మౌనంగా ఉండి తరవాత అన్నాడు "బాబూ! ఈ సారి అమ్మగారు కన బడితే ధైర్యంగా నిలేస్తా"

శరశ్చంద్ర అభిమానంగా చూశాడు జోగి వైపు "దట్స్ గుడ్. ఆ పని చెయ్యి. రేపు రాత్రికి ఎలాగైనా నువ్వు అమ్మగార్ని పలకరించాలి. నాతో ఒక్కసారి మాట్లాడమని చెప్పాలి. జోగయ్యా అలా చేశావంటే వచ్చే జన్మలో నీకు బిడ్డనై పుడతానయ్యా"

యాభై ఏళ్ల శరశ్చంద్ర.. చిన్నపిల్లాడిలా తనను బతిమాలుతుంటే జోగికి దుఃఖం ఆపుకుందామన్నా ఆగలేదు.

* * *

"శరత్ చిన్నమాట"

ఏమిటన్నట్టు చూశాడు శరశ్చంద్ర యామిని వైపు "ఆ ఏడో నంబర్ గదిలో పేషెంట్‌కి ఆపరేషన్ ఫ్రీ ఆఫ్ కాస్ట్ చేసెయ్. అతడి ఎకనామికల్ పొజిషన్ ఈజ్ టూ వర్స్ట్"

"చిత్తం మేమ్‌సాబ్"

"నా మాట వింటావా? లేదా?"

"విననిదెప్పుడమ్మా?"

"మన హాస్పిటల్ బోయ్ చంద్రాని పని లోంచి తీసెయ్యొద్దు"

"మైగాడ్! అతనెంత పొరపాటు చేశాడో తెలుసా యామినీ?"

"ఏం... నువ్వెప్పుడూ పొరపాటు చెయ్య లేదా? పోనీ నేను చెయ్యలేదా? పొరపాట నేది..."

వెంటనే అందుకున్నాడు శరశ్చంద్ర "మానవ నైజం. నాకర్థమైంది చంద్రాని క్షమిం చేస్తున్నా. ఇక నన్నొదిలెయ్"

"చూడు శరత్ ఓ రిక్వెస్ట్"

"ఏంటి తల్లీ... రెండో నంబర్ గదిలోని పేషంట్‌కి ఉచితంగా మందు లివ్వాలా? మన ఆయా కొడుక్కి హాస్టల్లో సీటిప్పించాలా? లేక..."

"ఈసారి అవేమీ కాదు... మీరో పెళ్ళికి అటెండ్ కావాలి."

"బాబోయ్" శరశ్చంద్ర దండం పెట్టేశాడు. "ఆ గొడవ మాత్రం నాకు పెట్టకు. కావాలంటే చెప్పు ఖరీదైన బహుమతి పంపిస్తాను"

అవతలి వాళ్లెంత నిరుపేదలైనా కేవలం మన బహుమతి కోసం ఎదురు చూడరు శరత్. మన ప్రెజన్స్ వాళ్ళకిచ్చినంత సంతోషం మనమిచ్చే గిఫ్ట్ అదెంత ఖరీదైనదైనా సరే ఇవ్వలేదు"

శరశ్చంద్ర ఓడిపోయినట్టుగా చూశాడామె వైపు.

"ఇంతకీ ఎవరిది పెళ్లి?"

మన నైట్ వాచ్‌మెన్ కూతురుది. రాత్రి తొమ్మిదింటికి ముహూర్తం. ఓ అయిదు వేలకు చెక్కూ... పట్టుచీర ప్రజెంట్ చెయ్యండి. పట్టు చీరె ఆల్రెడీ కొని పెట్టేశాను"

శరశ్చంద్ర ఏదో అనేలోగా యామినే అంది "అదే ముహూర్తానికి మన జోగయ్య మునిమనువరాలి పెళ్ళి. నేనటు వెళ్లాలి"

చివుక్కున మెలకువొచ్చింది శరశ్చంద్రకు. ఏదీ యామిని?

చుట్టూ ఆవరించుకున్న చీకట్లు. ఆ చీకట్లను కాస్త కాస్తగా చీలుస్తూ మంద్రంగా పరుచుకున్న నైట్ బల్బ్ కాంతీ. ఏ.సి. చప్పుడు.

తప్పు మరేం లేదక్కడ.

"యామినీ! నన్నిక్కడ ఒంటరిగా వదిలేసి ఎక్కడికమ్మా వెళ్ళిపోయావ్?

నువ్వు లేకుండా నేను బతగ్గలననే అనుకు న్నావా? "

ఎవరో కాలింగ్ బెల్ నొక్కారు.

శరశ్చంద్ర వెళ్లి తలుపు తీశాడు.

ఎదురుగా జోగి వణికిపోతూ నిలబడు న్నాడు. "అమ్మగారు... అమ్మగారు..." అంటూనే విరుచుకు పడిపోయాడు.

శరశ్చంద్ర కంగారుగా అతని నాడి పట్టుకు చూశాడు. కాసిని నీళ్ళు ముఖాన చిలకరిం చాడు.

జోగి మెల్లగా కళ్ళు తెరిచి చుట్టూ అయో మయంగా చూశాడు.

"ఏం జరిగింది జోగయ్యా? "

శరశ్చంద్ర వంక, మరో వంక సంభ్రమంగా మార్చి మార్చి చూస్తున్నాడు గాని పెదవి విప్పే ప్రయత్నం చెయ్యటం లేదు జోగి.

"జోగయ్యా నిన్నే... ఏంటి చూస్తున్నావ క్కడ? "

జోగి శరశ్చంద్ర కేసి ఆశ్చర్యంగా చూసి మళ్ళీ ఓ వైపుకి చూస్తూ చేతులు జోడించాడు. "అమ్మగారయ్యా నవ్వుతూ అదుగో తమరి వంకే చూస్తున్నారు"

శరశ్చంద్ర గుండె వేగం పెరిగింది. కళ్ళు చిట్లించి చూశాడు జోగయ్య చూసిన వైపుకు.

ఆయనకేం కనబడలేదు.

"నాకేం కనబడ్డం లేదు జోగయ్యా" నిరుత్సా హంగా అన్నాడు.

"అదేంటయ్యా... తెల్లటి వస్త్రాల్లో అమ్మ ధగ ధగలాడి పోతుంటే..."

అంత పెద్ద కార్డియాలజిస్టు వెర్రివాడిలా జోగికేసి చూశాడు. పెదవులు ఉద్వేగంతో వణుకుతుండగా అడిగాడు. "నువ్వు చెప్పేది నిజమా జోగయ్యా"

"ఏంది బాబూ అట్లా అంటారు. తమర్నిం తప్పటినుంచీ ఈ చేతుల మీద పెంచా. ఎప్పు డైనా ఈ జోగి తాత తమరితో అబద్ధం చెప్పాడా? "

"అయితే... అమ్మగార్ని నాక్కనబడమని చెప్పు జోగయ్యా" విపరీతమైన యాంగ్జయి టీతో శరశ్చంద్ర నుదుటన చెమటలు పడుతు న్నాయి.

జోగయ్య ఓ వైపుకి రెండు క్షణాల పాటు చూసి ఏదో వింటున్న వాడిలా ఉండిపో యాడు.

"ఏం జోగయ్యా... కనబడుతుందటనా? "

"ప్చ్" నిట్టూర్చాడు జోగయ్య. "మీక్కనబడ లేదంటయ్యా."

గుండె పట్టేసినట్టయింది శరశ్చంద్రకు.

"బాబూ" ఆదుర్దాగా పిల్చాడు జోగి "అమ్మ గారు తమతో ఏదో చెబుతున్నారు"

"ఏంటి జోగయ్యా" పసిబిడ్డ తండ్రి గుండెల మీదకు ఎగబడుతున్నట్టుగా జోగీని పట్టి కుది పేశాడు శరశ్చంద్ర.

జోగయ్య భృకుటి ముడిచి ఒకవైపు దృష్టిని కేంద్రీకరించి చెప్పసాగాడు "శరత్... నా మాట వినవూ... అంటున్నారు బాబూ"

"యామినీ నువ్వేం చెప్పినా వింటా. ఇక్క డికిక్కడే నా ప్రాణాల్ని తోడి నీ దోసిట్లో పొయ్యమన్నా పోస్తాను" శరశ్చంద్ర స్వరం తీవ్రంగా కంపిస్తోంది.

"అయితే...లేచి...డైనింగ్ హాల్లోకి పదండి"

"నువ్వు... నాతో వస్తావా? "

"ఊఁ"

శరశ్చంద్ర ఉత్సాహంగా లేచాడు. వెనకే జోగి నడుస్తున్నాడు.

"జోగయ్య... అమ్మగారు..."

"మీకు ముందే నడుస్తున్నారు బాబూ" డైనింగ్ హాల్లోకి వచ్చాక జోగయ్య చటుక్కున నిలబడి "అమ్మా చెప్పండి" అన్నాడు. ఓ క్షణం తర్వాత శరశ్చంద్రకేసి చూశాడు.

"తమర్నట్లా కూర్చోమంటున్నారండీ" జోగ య్య డైనింగ్ టేబుల్ దగ్గరున్న ఓ చెయిర్ చూపించాడు.

శరశ్చంద్ర మంత్ర ముగ్ధుడిలా కూర్చు న్నాడు.

జోగయ్య శూన్యంలోకి కాసేపు ఏదో వింటు న్నట్టుగా చూసి "అట్లాగేనమ్మా" అంటూ కిచె

న్‌లోకి వెళ్లి ఓ గ్లాసునిండా పాలు పట్టుకొచ్చి మీద పెట్టాడు. ఫ్రిజ్ ఓపన్‌చేసి రెండు యాపిల్స్ ముక్కలు కోసి ప్లేట్లో సర్దాడు.

"తమరు ఇవి తిని పాలు తాగాలంట అమ్మగారు చెప్పమన్నారయ్యా"

శరశ్చంద్ర పెదవుల మీద పేలవంగా మెరిసిందో నవ్వు. "ఇంకా ఏం చెప్పమంటున్నారు జోగయ్యా?"

"తమరు రేప్పొద్దుటి నుండి హాస్పిటల్ కెళ్లాలి. ఎప్పటిలా ఆనందంగా ఉండాలి అంటున్నారు బాబూ".

"జోగయ్యా?"

"అయ్యా!"

"ఈ పండు తిని, పాలు తాగమని అమ్మగారు కనబడి చెప్పక్కర్లేదు. నువ్వు చెప్పినా తాగుతాను. కాకపోతే ఇంకాస్త ఆలస్యంగా".

"అయ్యా..."




"ఆగు నన్ను చెప్పనీ జోగయ్యా" శరశ్చంద్ర స్వరం దుఃఖంతో కంపిస్తోంది "మీ అమ్మగారు నన్ను వదలివెళ్లిపోయిన రోజు భౌతికంగా స్పృహలో ఉన్నా, మానసికంగా స్పృహ కోల్పోయాను. ఆకలి దప్పుల్లాంటివేం అనుభవించలేదు నేనారోజు. ఆ మరునాడు కూడా జడంగా వుండిపోయాను. మూడోరోజు దాహం వేసింది. నా యామిని లేకుండానే నేను నీళ్లు తాగాను. ఆ మరునాడు ఆకలి వేసింది. నువ్వే బలవంతం చేస్తే నా యామిని చేత్తో వడ్డించకుండానే అన్నం తిన్నాను. ఇంకో నాల్రోజులు ఓపిక పట్టు. పాలేమిటి... పళ్లేమిటి... పరమాన్నమే తింటాను. నాయామిని లేకుండానే. నేను మామూలుగా బతికేస్తాను. ఈ లోపు నువ్వింత నాటకం ఆడి... నన్నిలా..."

"అయ్యా... నేచెప్పేది కాస్త..."

"జోగయ్యా... నిన్నర్థం చేసుకోగలను. ఏ స్వార్థం లేకుండా నన్నభిమానించే గుండె నీది. నా బాధ నువ్వు చూళ్లేవు. నా ఆకలిని నువ్వు తట్టుకోలేవు. నా దుఃఖాన్ని నువ్వు భరించలేవు. నాకు తెలుసు" శరశ్చంద్ర లేచి అభిమానంగా జోగి భుజం తట్టాడు.

జోగి... తన భుజాన్ని తడుతున్న శరశ్చంద్ర హస్తాన్ని అలాగే పట్టుకుని తలమీద పెట్టుకున్నాడు. "ఒట్టయ్యా... అమ్మగారు... ఇక్కడ... తమతోనే ఉన్నారు. నే చెప్పేది అక్షరాలా నిజం".

శరశ్చంద్ర విభ్రాంతిగా జోగికేసి చూశాడు.

## 5

అరవింద తలెత్తి బోర్డు వంక చూసింది. డాక్టర్ వై. రఘునాథ్, ఎమ్.బి.బి.యస్. అని రాసి ఉంది. హాస్పిటల్ రిసెప్షన్‌లో కెళ్లి పేషెంట్ వివరాలు చెప్పి రూమ్ నెంబర్ అడిగి తెలుసుకుంది. క్యారిడార్ వెంబడే పదడుగులు వేసి లెఫ్టుకి తిరిగి పదో నంబర్ గది ముందు ఆగింది.

భానురేఖ... నాలుగు రోజుల బట్టీ ఆఫీస్‌కి రావడం లేదు. ఆమె తల్లికి ఆరోగ్యం బాగా లేకపోతే హాస్పిటల్లో అడ్మిట్ చేసినట్టు తెలిసింది అరవిందకు. ఈరోజు వెళ్దాం... రేపు వెళ్దాం అనుకుంటూనే నాల్రోజులు తాత్సారం చేసేసింది. ఇవాళ ఇక లాభం లేదని ఆఫీస్ అవర్స్ అవగానే నేరుగా ఇటొచ్చేసింది.

తలుపు దగ్గరగా వేసి ఉండటంతో మునివేళ్లతో చిన్నగా దానిమీద శబ్దం చేసింది.

తల్లి నిద్రపోతుంటే బెడ్ పక్కనే ఉన్న చెయిర్లో కూర్చుని పుస్తకం తిరగేస్తున్న భానురేఖ నర్సు అనుకుని "కమిన్" అంది.

అరవింద తలుపు నెట్టుకుని లోపల అడుగు పెట్టగానే "హాయ్... నువ్వా?" అంది ఆశ్చర్యం ఆనందం కలగలిపేసుకుని.

"నేనే" అరవింద చిన్నగా నవ్వి అక్కడే



ఉన్న స్టూల్ మీద కూర్చోబోతుంటే భానురేఖ లేచి అరవిందకు చెయిర్ ఆఫర్ చేసి తను స్టూల్ లాక్కుంది.

"ఏమైంది అమ్మకు? " ఆ సమయంలో కూడా నిద్రపోతున్న మాణిక్యమ్మ వైపు అయోమయంగా చూస్తూ అడిగింది.

"ఒకటా... బి.పి. షుగరు... దానిపైన ఫీవర్. అమితమైన నిద్ర. డాక్టర్ ఓ వారం తన అండర్‌లో ఉంచమని సజెస్ట్ చేశాడు. ఇంట్లో చాకిరీ వదినదీ... ఇక్కడ కాపలా నాది. ఆఫీస్‌కి సెలవు పెట్టక తప్పలేదు. ఏమన్నా అన్నారా మన ఎమ్.డిగారు"

"ప్చ్. ఆయనేం అన్లేదులే. ఇప్పుడెలా ఉంది? "

"రేపో ఎల్లుండో డిశ్చార్జ్ చేస్తామన్నారు" చెప్పి మళ్లీ దిగులుగా అంది "అసలు విషయం అదికాదులే అరవిందా! మా చిన్నన్నయ్య విఠల్ విజయనగరంలో జాబ్ చేస్తున్నాడు. నీకు తెలుసుగా! నన్ను అమ్మనీ అక్కడికొచ్చెయ్యమంటాడు. అప్పుడు పెద్ద వదిన సంగతేంటి అని అమ్మ బాధ. అన్నయ్య పోయినా తను మమ్మల్నే అంటిపెట్టుకుని ఇక్కడే ఉండిపోయింది. అమ్మకీ ఎందుకో వదినంటే ప్రాణం. ఇప్పుడు మేం అక్కడికి వెళ్లిపోతే వదిన పుట్టింటికి పోవల్సిందే. అమ్మకి అదిష్టం లేదు. పోనీ ఇలాగే ఉండిపోదామంటే నా బరువు బాధ్యతలు ఒంటరిగా మోసే కెపాసిటీ లేదు. నీకులాగే నేనూ తండ్రి లేని బిడ్డను. కాకపోతే తండ్రి స్థానంలో అన్నయ్య ఉన్నాడు. మొన్నటికి మొన్న వాడో ఉత్తరం రాశాడు. దీన్ని టెలిగ్రామ్‌లా భావించి ఇద్దరూ బయలుదేరి వచ్చారా సరి... లేకుంటే భాను పెళ్లి బాధ్యత నాది కాదు అంటూ. దాంతో అమ్మ బెంబేలు పడిపోయింది. నాకేం పర్లేదత్తయ్యా. మా పుట్టింటికి పోతాను. భాను భవిష్యత్తు ముఖ్యం అని పెద్దొదిన

ఎంత ఇదిగా చెప్పినా ససేమిరా వినకుండా మనసులో దిగులు పెట్టేసుకుంది. ఇదుగో... ఇప్పుడిలా హాస్పిటల్ బెడ్ మీదకు చేరింది. నిన్న అన్నయ్యకు టెలిగ్రామ్ ఇస్తానన్నా ఒప్పుకోలేదు. సరే! వాడొచ్చి ఏం హడావుడి చేస్తాడోలే అని నేనూ ఊరుకున్నా"

భానురేఖను పూర్తిగా మాట్లాడనిచ్చి అంది అరవింద "కొడుకు ఏ దురదృష్టశాత్తో పోతే... ఆ దురదృష్టాన్ని కోడళ్ల నెత్తిన రుద్ది ఇంట్లోంచి తరిమే అత్తగార్లని చూశాగాని కొడుకు భార్యని ఇంతగా ప్రేమించే అత్తగార్ని ఇదే చూడ్డం"

"ఈ కోడలి మీది ప్రేమ మా చిన్నన్నయ్యకూ, చిన్నొదినకూ కొరుకుడు పడని విషయం" నవ్వింది భానురేఖ.

"సరే! ఇంతకీ ఏం నిర్ణయించుకున్నారు? "

"నేనేం నిర్ణయించుకోలేదు. మా పెద్దవదిన మాత్రం ఓ నిర్ణయానికొచ్చేసింది. మా అమ్మని డిశ్చార్జి చేసే టయానికి తమ ఊరెళ్లిపోతుందట కనబడకుండా. నేను అమ్మను ఒప్పించి ఆమెతో పాటూ విజయనగరం వెళ్లిపోవాలట"

"ఈ పరిస్థితుల్లో ఆమె నిర్ణయం సబబుగానే ఉన్నట్లనిపిస్తోంది"

"అంతేనంటావా? " దిగులుగా చూసింది భానురేఖ.

"తప్పదు. జీవితంలో అన్ని బంధాలూ విలువైనవే. కానీ అన్నిటికీ బందీలం కాలేం. కొన్ని త్యాగం చెయ్యక తప్పదు"

"ఈ ఫిలాసఫీనే కదూ వంశీ విషయంలో తమరు అప్లై చేసింది!"

అరవింద కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది.

తను అనవసరంగా ఆమెను బాధపెట్టానేమో అనుకుంది భానురేఖ. "సారీ" అంది ఇబ్బందిగా చూస్తూ.

అరవింద ఆమె 'సారీ'ని చాలా తేలిగ్గా తీసుకుంటూ "ఇప్పుడు సారీ చెప్పాల్సిన మాట నువ్వేమన్నావని! నీవన్నట్టూ వంశీని నేను ఇలా ఆలోచించే వదులుకున్నాను. ఈ విషయంలో నో రిగ్రెట్స్" అంది.

ఆమె మరీ అంత మామూలుగా అంటుంటే భానురేఖ ఉండబట్టలేక అనేసింది "చూడ్డానికి మెత్తగా ఉంటావ్‌గాని నీ గుండె చాలా గట్టిది"

"చూడు భానూ... వంశీని నేను నమ్ముకున్నాను. నావాళ్లు నన్ను నమ్ముకున్నారు. వంశీని కాదంటే అతణ్ణి నమ్ముకున్న నేను మాత్రమే నష్టపోతాను. నా వాళ్లను కాదంటే నన్ను నమ్ముకున్న నేరానికి వాళ్లు నష్టపోతారు. సో... బేరీజు వేసుకుని నన్ను నేను నష్టపరుచుకున్నాను"

"అదా నీ లాజిక్కు? మరి వంశీ సంగతేంటి? ముళ్లేసుకోడం తెంచుకోడం లాంటివన్నీ నీవంతయితే అతడు మాత్రం నిమిత్త మాత్రుడా? నువ్వు వంశీని నమ్మినట్టే అతడూ నిన్ను నమ్మాడుగా? అతను నష్టపోలేదా ఇప్పుడు? "

"నో... శుభ్రంగా పెళ్లిచేసుకుని అమెరికా వెళ్లిపోతున్నాడు"

భానురేఖెందుకో ఫక్కుమని నవ్వింది. అరవింద మాటలకు- ఎందుకలా నవ్వుతావ్ అని అరవింద అడిగేలోగా మాణిక్యమ్మ చప్పున కళ్లు తెరిచింది.

వెంటనే భానురేఖ ఆమె దగ్గరకు వెళ్లింది. మాణిక్యమ్మ అరవిందకేసి చూసి నీరసంగా నవ్వింది.

"ఎలా ఉందమ్మా? " అరవింద అడిగింది.

మాణిక్యమ్మకు కళ్లలో నీళ్లూరాయి. "నేపోతే బావుండు అరవిందా? "

"చూడు అరూ ఆ మాటలు" అని దిగాలుగా అని తల్లితో 'ఏమిటమ్మా ఆ మాటలు' అని కాస్త గట్టిగా కోప్పడుతున్నట్లు అంది భానురేఖ.

"ఎందుకే కోప్పడతావ్. నీ కోసం ఆ అమాయకురాల్ని వదిలి రాలేను. దాన్నంటి పెట్టుకుని నీ భవిష్యత్ పాడుచెయ్యలేను. నేపోయాననుకో. మీ ఇద్దరిదీ చెరోదారి చూసి కుమిలిపోడానికి నేనుండను"

"మీరు ఎగ్జయిట్ కాకూడదు" అరవింద ప్రేమగా ఆమె తల నిమిరింది.

"నాకు భానెంతో శ్యామల కూడ అంతే నమ్మా. వాడు పోతూ... అమ్మా శ్యామల్ని నీ దగ్గరే ఉంచేసుకో. నీ పెద్దకొడుకే అదనుకో అని అప్పగింతలు పెట్టిపోయాడు. ఆ పిల్లకీ నేనంటే పంచప్రాణాలు. అత్తయ్యా ఆయన్ని కన్నతల్లి మీరు. మీలో ఆయన్ని చూసు కుంటూ ఇక్కడే పడివుండనీ అని ఏడ్చిందది. పుట్టింటివాళ్లు ఆ పిల్లంటే ప్రాణం పెడతారు. అయినా అది వాళ్ల దగ్గరకు పోలేదు. ఇప్పుడీ చిన్నాడూ, వాడి పెళ్లాం... మమ్మల్ని విడది య్యాలని చూస్తున్నారు. ఆ పిల్ల నా దగ్గరుం డటం వాళ్లకి సుతరామూ ఇష్టంలేదు. అందుకే ఇలా కష్టపెడుతున్నాడు. భాను పెళ్లి చెయ్యాలంటే ఇదే మార్గమా? మనసుంటే మరో మార్గం కనబడదూ? "

"అలాగెందుకనుకోవాల్లెండి. భానుకు పెళ్లిచె య్యాలన్న ఆత్రుతలో అతడు మిమ్మల్ని రమ్మంటున్నాడు. పైగా మీరతని తల్లి. రేపు దీనికి పెళ్లయ్యాక మీరక్కడేగా ఉండాల్సింది"

మాణిక్యమ్మ కళ్లు మూసుకుంది. కన్నీళ్లు ఆమె చెంపల మీదుగా జారిపోతున్నాయి. "ఇలాగే ఏడుస్తుండు... మళ్లీ బి.పి. రైజ్ అవుతుంది" చిరాకుపడిపోయింది భానురేఖ.

"అటు చూస్తే మొగుడు చచ్చిన పిల్ల. ఇటు చూస్తే కన్నకొడుకు. ఎవర్నీ వదులుకోలేను. ఎవరో ఒకర్ని వదులుకోకపోతే మధ్యలో ఇదీ అన్యాయమైపోతుంది. భగవంతుడా, ఇంత కమ్మటి బంధాల్ని ఆర్థికంతో ముడిపెట్టావెందు కయ్యా" అంది మాణిక్యమ్మ కళ్లు మూసుకునే.

మనిషికీ మనిషికీ మధ్య ఏర్పడే బంధానికి మూలకారణం మనసే కావచ్చు కానీ... ఆ బంధాన్ని పటిష్టం చేసి నిలబెట్టగలిగేది ఆర్థిక స్థితిగతులేనని ఖచ్చితంగా అన్పించింది అర విందకు.

కాసేపు అదీ ఇదీ మాట్లాడి తను వెంట తెచ్చిన బ్రెడ్డూ, పళ్లూ మాణిక్యమ్మ గారికి ఇచ్చి దాదాపు ఏడవుతుండగా బయటపడింది.

హాస్పిటల్ రిసెప్షన్ వరకూ తనతోపాటు వచ్చిన భానురేఖతో "భానూ... ఆ డైరీ శర చ్చంద్రగారికి అందజేయనే లేదు నేనింకా" అంది అరవింద.

"అప్పుడే ఆమెపోయి పదిహేను రోజులవు తోందికదూ!" నిట్టూర్చింది భానురేఖ.

"వారం క్రితం క్లినిక్కి శీనూతో పంపాను. హాస్పిటల్ కి ఆయన రావడం లేదట. సర్లే... నీతో కలిసి వెళ్లి ఆయనకి డైరీ ఇచ్చి పర్సన ల్ గా కండోలెన్సెస్ చెబుదాం అని అలానే ఉంచేశా. నువ్వేమో... అమ్మ కారణంగా లీవ్ పెట్టేశావ్. నెక్స్ట్ వీక్ లో వెళదామా? "

"తప్పకుండా. నేనూ ఆయన్ని పర్సనల్ గా ఓ సారి కలవాలి అరవిందా. పెద్దన్నయ్య విషయంలో భార్యా, భర్త లిద్దరూ మాకు బాగా హెల్ప్ చేశారు. చెప్పాగా నీకు"

"సరే, నేనిక వెళ్తాను" అంది అరవింద. హాస్పిటల్ రిసెప్షన్ దాటి గేటు వరకూ వచ్చాక తనతో పాటే వస్తున్న భానురేఖ వైపు సడన్ గా తిరిగి "అవునూ ఇందాక నేను వంశీ శుభ్రంగా పెళ్లి చేసుకుని అమెరికా వెళ్లిపో యుంటాడు అంటే అలా నవ్వావెందుకు? " అనడిగింది.

"ఎందుకంటే వంశీకి నీ పట్ల ఉన్న ప్రేమ ను నువ్వెంత తక్కువగా అంచనా వేసినం దుకు నవ్వాలో ఏడవాలో అర్థం కాక నవ్వ డమే బెటరన్పించి నవ్వేశాను"

"అంటే..."

"అంటే..." భానురేఖ అరవింద కళ్లలోకి లోతుగా చూసింది. "నీ వంశీ ఒక్కనాటికీ నిన్ను మర్చిపోడు. నిన్నుకాక ఇంకెవర్నీ పెళ్లి చేసుకోడు"

అది నిజమైతే ఎంత బాగుండు! ఒక్కక్షణం అరవింద హృదయం లయ తప్పింది.

కానీ...

అతడు తన కోసం అలా నిరీక్షిస్తుంటే తన తడికి చేరువకాలేక అల్లాడి పోతుంటే

ఓహ్... అది నరకం. ప్రత్యక్ష నరకం. ఆ బాధలో తను ఖచ్చితంగా తన కుటుంబాన్ని అశ్రద్ధ చేస్తుంది.

వద్దు. ఆ పరిస్థితి వద్దే వద్దు.

వంశీ తను అనుకున్నట్టు పెళ్లి చేసుకో వాలి. తనకు దూరంగా అమెరికా వెళ్లిపోవాలి.

తను అతడి జ్ఞాపకాల్ని కన్నీళ్లతో కడిగేసుకో వాలి. దట్సాల్ అనుకుంది.

ఇంక మాటలు పొడిగించడం ఇష్టం లేనట్లు గబగబా ముందుకు నడిచి అటుగా వెళ్లే ఓ ఆటోని ఆపి ఎక్కేసింది అరవింద. ఆటో కను మరుగయ్యేంత వరకూ చూస్తూ గేట్లోనే నిల బడింది భానురేఖ.

* * *

అరవింద ఉదయం నుండి మూడీగా ఉంది. ఆ రోజు ఆఫీసుక్కూడా వెళ్లలేదు. క్రితం రోజు ఆఫీస్ నుండి ఓ గంట ముందే వచ్చేసింది. స్నానం చేసి కాఫీ తాగి గదిలో దూరి పడు కుంది. అన్నానికి పిలిచినా రాలేదు. ఆకల్లేదు తనను డిస్టర్బ్ చెయ్యొద్దని చిరాగ్గా చెప్పింది.

ఒక్కోసారి అరవింద ప్రవర్తన అలాగే ఉండటం కుటుంబ సభ్యులకి అనుభ వమే కావటంతో ఆమె జోలికి ఎవరూ వెళ్లలేదా రాత్రంతా. కానీ మరు నాడు కూడా ఆమె పరిస్థితిలో మార్పు లేకపో వడంతో కాస్త కలవరం బయలుదేరిందా ఇంట్లో. మరీ ఆఫీసు కూడా మానేసేసరికి ఏం జరిగి ఉంటుందా అన్న ఆతృత అందర్నీ ఓ చోట నిలవ నివ్వటం లేదు.




ముందుగా తులసమ్మ వెళ్ళి తొమ్మిదవు తున్నా లేవకుండా పక్క మీదే దొర్లుతూ ఆలో చిస్తున్న కూతుర్ని లేపి అంది "ఏంట్రా అరూ... ఇంకా లేవకుండా! ఆఫీసుకి టైమవు తోంది" అంది.

"నేనీరోజు ఆఫీస్‌కి వెళ్ళటం లేదమ్మా" అర వింద లేచి కూర్చుంటూ చెప్పింది.

"ఏమ్మా? "

"తలనొప్పి" తల్లి ఇంకో ప్రశ్న వెయ్యటానికి అవకాశం ఇవ్వకుండా బాత్ రూం కెళ్లిపో యింది అరవింద.

తులసమ్మ తరవాత వంతు వసంత తీసు కుంది. అరవింద తలారా స్నానం చేసి ఫ్యాను కిందకు చెయిర్ లాక్కుని జుట్టు ఆర బెట్టుకుంటున్నట్టు కనబడుతూనే శూన్యంలోకి చూస్తుండడాన్ని ఇట్టే పసిగట్టేసింది వసంత.

"అక్కా"

ఉలిక్కి పడి చూసింది అరవింద. ఎదు రుగా పొగలు కక్కే కాఫీ కప్పుతో నిలబడ్డ వసంతకేసి.

"కాఫీ"

అరవింద మామూలుగా నవ్వటానికి ప్రయ త్నిస్తూ కాఫీ కప్పు అందుకుంది. సిప్ చేస్తూ చేస్తూ కప్పు పక్కనే ఉన్న టేబుల్ మీద పెట్టింది. తిరిగి గడ్డం కింద చేతులు ఆన్చి శూన్యంలోకి చూస్తూండిపోయింది అప్ర యత్నంగా.

కాఫీ ఇచ్చి వెళ్లి పోతు న్నట్టు ఇవతలికి వచ్చిన వసంత ఆమె చర్యల్ని గమ నిస్తూనే ఉంది. ఎప్పుడైతే అరవింద కప్పు పక్కన పెట్టేసి తిరిగి ఆలోచనలో మునిగిందో వెంటనే మెల్లగా నడుచుకుంటూ వెళ్ళి అర వింద ఎదురుగా నిలబడింది.

అరవింద ఆమెనసలు గమనించనే లేదు. ఓ నిముషం పాటు ఓపిగ్గా చూసింది వసంత. అరవింద చూపులు కొద్దిగా చలించి ఓ కన్నీటి బొట్టు ఆమె చెక్కిలి మీదుగా జారు తున్నప్పుడు మాత్రం ఇక ఆగలేక అడిగేసింది.

"నీ బాధ పంచుకోడానికి మేం పనికిరామా అక్కా? "

అరవింద హఠాత్తుగా ఈ లోకంలోకి వచ్చి వసంత కేసి చూసింది. "బాధా? అదేం లేదే. కాఫీ తాగుతుంటే ఏదో గుర్తుకొచ్చింది ఆలో చిస్తూ అలా చూస్తుంటే కంట్లో నలక పడింది. దాంతో"

"కళ్లలో నీరు కమ్మి ఓ కన్నీటి చుక్క రాలి పడింది. అంతేకదక్కా" వసంత ఉక్రోషంగా అంది.

అరవింద అంతే అన్నట్టుగా ఊరుకుంది.

"మా కెందుకు చెబుతావ్? అసలు నీకు

మేమేమవుతామని? చెప్పినా మేము ఆర్చేవా ళ్ళమా, తీర్చే వాళ్లమా వద్దులే ఏం చెప్పకు. ఈ సారి ఏంటని అడిగితే నీ చెప్పుచ్చుకు కొట్టు" వసంత విసవిస నడుచుకుంటూ వెళ్ళి పోయింది.

ఆమెను పోనిచ్చి అరవింద లేచి తలుపేసు కుంది. నిర్ఘాంత పోయారందరూ. రాత్రి కూడా ఏం తిన్లేదు. ఇక ఈ పూట కూడా పర గడుపేనా?

"ఎవర్ని సాధించాలనీ? ఎందుకీ వేషాలు. మనసులో మాటేదో సూటిగా చెప్పరాదూ" తులసమ్మ కేకలేసింది కిటికీలోంచి అరవింద కేసి చూస్తూ.

అరవింద చెయిర్‌లోంచి లేచి "ఓ గంటాగి తింటాను సరా" అనేసి కిటికీ తలుపులు కూడా మూసేసుకుంది.

"చూశావ్రా దాని అహం" తులసమ్మ అంటుంటే శీను మందలించాడు "గంటాగి తింటానందిగా. ఇంకేంటి నీ బాధ? తనకెన్ని సమస్యలో. కాసేపలా వదిలెయ్ అక్కను"

వంశీతో అరవింద ప్రేమ వ్యవహారం శ్రీదే వికి చూచాయగా తెలుసు. అయితే ఇంట్లో ఎప్పుడూ ఎవరితో అన్లేదు. ఓ సారి పెన్ను అవసరమై అరవింద టేబుల్ సొరుగు వెతు కుతుంటే కనబడింది శ్రీదేవికి "రేపు సాయంత్రం ఆరు గంటలకు ఇందిరా పార్క్ దగ్గర కలువు" అని రాసివున్న స్లిప్ కింద సంతకం చూస్తే "వంశీ" అని ఉంది. పార్కుకు వెళ్ళి చూద్దామా అనుకుంది గాని ధైర్యం చాల్లేదు. ఆ రోజు సాయంత్రం శ్రీదేవి ఊహించినట్టుగానే అరవింద ఆఫీసు వదిలిన వెంటనే ఇంటికి రాలేదు. రెండు గంటలు ఆలస్యంగా వచ్చింది. ఈ విషయం మనసు లోనే ఉంచుకుని. అప్పటి నుండీ అక్కను అప్పుడప్పుడూ అబ్జర్వ్ చేస్తోంది.

అందుకే ప్రస్తుతం అరవింద ప్రవర్తన చూస్తుంటే

"ఒకవేళ అక్కను అతడేమైనా మోసం చేశాడా? " అన్పించిందామెకు.

మళ్ళీ అంతలోనే "అక్క అలాంటి కేరక్టర్ కాదులే. వెరీ ప్రిన్సిపుల్డ్. వాళ్ల ఎమ్డీ బాగా తిట్టారేమో" అని సరి పెట్టుకుంది.

లీలావతికి మళ్ళీ కల్యాణి పూనిందని ఎవరో అంటుంటే విని కాసేపు చోద్యం చూడ్డా నికి వెళ్ళింది శ్రీదేవి.

తులసమ్మ అరవింద గురించే ఆలోచిస్తూ గంటెప్పుడు గడుస్తుందా... అమ్మాయెప్పుడు తలుపు తెరుస్తుందా అన్నట్లు ఎదురుచూస్తూ కూర్చుంది.

లోపల గదిలో అరవింద బెడ్ మీద బోర్లా పడుకుని ఉంది. ఆమె కళ్ళల్లోంచి నీళ్లు ఎడ తెరిపి లేకుండా ధారలు ధారలుగా కారిపోతు న్నాయి.

తను ఇదే జరగాలని కోరుకుంది గాని, ఖచ్చితంగా అలాగే జరుగుతుందని మాత్రం అనుకోలేదు.

"వంశీ! నన్ను మర్చిపో. నువ్వు లక్షణంగా మీ అమ్మా నాన్న కుదిర్చిన సంబంధం చేసు కుని అబ్రాడ్ వెళ్లిపో" అని తేలిగ్గా అంది. అలా అంటున్నప్పుడు తనెంతో ఎదిగిపోయి నట్టూ, ఎంతో ఉదాత్తత తన సొంతమైనట్టూ భావించింది. ఏదో బాధ గుండెను రంపంలా కోస్తున్నా పైకి బింకంగా వాగేసింది. కానీ, నిన్న మధ్యాహ్నం లంచ్ అవర్లో శ్రీకర్ కన బడి "వంశీకృష్ణ నిన్న అమెరికా వెళ్లిపోయా డండీ" అని చెప్పినప్పుడు తన బింకం సడలి పోయింది. గుండె వెయ్యి ముక్కలుగా విచ్చి పోయింది.

తనేమో అనుకుంది గాని, ఆ వేదన భరిం చడం తన వల్ల కావటంలేదిప్పుడు.

కళ్ళు ఎంత విప్పుకు చూసినా చీకట్లే కనబ డుతున్నట్లు.

ఎంతగట్టిగా ఊపిరి తీస్తున్నా గాలి అంద నట్టూ, గుండె కొట్టుకుంటున్నా ప్రాణం మాత్రం పోతున్నట్టూ.

అంటే... తనకు వంశీ వెళ్ళిపోవటం నిజంగా ఇష్టం లేదు. అంతరాంతరాల్లో ఎక్కడో చిన్న ఆశ. అతడు తనని విడిచిపోడని. తన కోసం జీవితాంతం ఎదురుచూస్తాడని చూడాలనీ.

తనదెంత స్వార్థం.

## పురుషులకూ నెలనెలా తప్పదు!



'ఏమిటో డాక్టర్! మావాడు నెలకోసారి విచిత్రంగా ప్రవర్తిస్తున్నాడు. వేళకి తినడు, అందర్నీ విసుక్కుంటాడు, ఏదడిగినా నెగిటివ్‌గా బదులిస్తాడు. ఎందులోనూ ధ్యాస లేనట్టు విపరీత ధోరణిలోఉంటున్నాడు' పదిహేడేళ్ళ కొడుకుని వెంటబెట్టుకుని మానసిక వైద్యుడి దగ్గర కొచ్చిన తల్లి వాపోయింది.

ఆ లక్షణాలు సహజమే! పెద్దగా కలవరపడాల్సిందేంలేదు అంటున్నారు ఇంగ్లీష్ మనోశాస్త్రవేత్తలు. ఆడవాళ్ళలో నెలకోసారి ఋతుక్రమ సమయంలో కలిగే పై లక్షణాలు మగవాళ్ళలోనూ ఉంటాయని పరిశోధనలు జరిపి మరీ కనుగొన్నామంటున్నారు. ఇంకా చెప్పాలంటే స్త్రీలకంటే పురుషుల్లోనే ఈ లక్షణాలు అధికమట. దీనికో పేరు కూడా పెట్టారు పీరియాడిక్ మేల్ టెన్షన్ (పిటిఎం) అని. వంద మంది స్త్రీలు, పురుషులపై జరిపిన పరిశోధనల్లో ఋతుక్రమ సమయంలో స్త్రీలలో ఏర్పడే సమస్యలే, పురుషుల్లోనూ ఉత్పన్నమవుతున్నాయని వాళ్లు కనుగొన్నారు.

ఆడవాళ్ళ నెలసరి బాధలు అందరికీ తెల్సినవే...మరి మగాళ్ళ బాధలూ... వాస్తవమే. వాళ్లకయినా, వీళ్లకయినా నెలకోసారి తప్పదట! ఇక భరించక ఏం చేస్తాం.

కానీ, అతడలా చూడలేదు. వెళ్లిపోయాడు. ఈ గుండెనీ, ఈ ఊరినీ, చివరికి ఈ దేశాన్నే దాటుకుని వెళ్లిపోయాడు.

తన కోసం ఇక రాడు. వంశీ ఇక ఎప్పటికీ, ఎప్పటికీ తనవాడు కాడు.

మొన్నటిదాకా అతడి హృదయం మీద వాలిపోయి,ఆ గుండె చేసే చప్పుళ్ళు వినే తను ఇక మీదట ఎప్పుడైనా, ఎక్కడైనా తారసపడితే అంత దూరాన నిలబడి "నమస్తే వంశీ గారూ... బాగున్నారా? "అని పలకరించాలా?

సాయంసంధ్యలో హుస్సేన్‌సాగర్ ఒడ్డున పచ్చని పచ్చిక తివాచీమీద తన ఒళ్ళో తల పెట్టుకు పడుకుని "నాకిక్కడ ఇలాగే చనిపోవాలనుంది" అనే వంశీ ఇప్పుడా మాటను మరో...

ఆ ఆలోచనల్ని భరించలేక తల విదిలించేసింది అరవింద.

గుండె బరువు దింపుకోవడానికి చెప్పుకుని ఏడుద్దామంటే భానురేఖ లేదు.

అరవింద వెళ్లి పరామర్శించిన రెండోరోజు భానురేఖ తల్లిని డిశ్చార్జి చేశారు. అనుకున్నటే ఆమె పెద్దాదిన పుట్టింటికి వెళ్లిపోయింది. వెళుతూ వెళుతూ భానురేఖ చిన్నన్నయ్యను వచ్చి తల్లినీ చెల్లినీ తీసికెళ్ళమని టెలిగ్రాం ఇచ్చి మరీ వెళ్లింది. మరునాడే రెక్కలు కట్టుకు వాలాడతను.

భానురేఖ జాబ్‌కి రిజిగ్నేషన్ ఇవ్వటం, తల్లితో కలిసి విజయనగరం వెళ్లిపోవటం అంతా మూడే మూడు రోజుల్లో జరిగిపోయింది.

స్నేహితురాలు విడిపోయిన విషాదం నుంచి అరవింద తేరుకోకముందే, వంశీ అమెరికా వెళ్లిపోయాడన్న వార్త, ఆమెను మానసికంగా మరింత కృంగదీసేసింది.

అరవింద ఏడ్చి ఏడ్చి కన్నీళ్లన్నీ ఇంకిపోయాక మెల్లగా నిద్రలోకి జారుకుంది. ఎప్పటికో మెలకువొచ్చి మంచం మీద దిగ్గున లేచి కూర్చుంది. గోడకున్న గడియారాన్ని చూసింది. సాయంత్రం నాలుగున్నర.

అవునూ... తను ఓ గంటాగి టిఫిన్ చేస్తానందిగా. గంట కాదు సుమారు ఆరు గంటలు గడిచిపోయాయి. మరి ఒక్కరైనా తలుపు

తట్టి తన్ని పిలవలేదే? ఏమైపోయారు వీళ్లంతా?

అరవింద మంచం దిగి తలుపు తీసింది.

అక్కడే ఆమె గది గడప కవతలగా ఉన్నారు నలుగురూ.

తులసమ్మ పవిటకొంగు నేలమీద పరుచుకు పడుకుని ఉంది. శ్రీదేవి గోడకు ఆనుక్కూర్చుని ఉంది. వసంత నీరసంగా ఓ మూల మోకాళ్ళ చుట్టూ చేతులు చుట్టి వాటి మీద తల ఆన్చి కూర్చుంది.

శీను స్టూలు మీద కూర్చుని ఆందోళనగా అరవింద గదికేసే చూస్తున్నాడు.

ఆ దృశ్యాన్ని చూస్తుంటే. కడుపు తరుక్కుపోయింది అరవిందకు.

గబగబ శీనూని సమీపించి అడిగింది "శీనూ భోంచేశావా? "

"నీతోపాటూ తిందామని అందరం అలాగే ఉన్నాం"

తన కోసం ఇంతమంది నిరాహారంగా నిరీక్షిస్తుంటే తను మాత్రం తనొక్కతే, ఈ ప్రపంచంలోని బాధనంతా అనుభవిస్తున్నట్టూ, అతడి కోసం తను పడేదే బాధైనట్టూ, తన కోసం వీళ్ళు పడే బాధ బాధే కానట్టూ ఎంత నిర్దయగా ఉండిపోయింది. అరవిందకు సిగ్గుగా అనిపించింది. తల్లి దగ్గరకు వెళ్లి నేలమీద పడుకున్న ఆమెకు సమీపంగా మోకాళ్ల మీద కూర్చుని "ఆకలేస్తోందమ్మా" అంది.

తులసమ్మ అమాంతం లేచి అరవిందను వాటేసుకుని బావురుమంది. "నా తల్లీ దుఃఖం తీరిందా అమ్మా. ఈ అమ్మకు చెప్పుకున్నా వృధా అని నీలో నువ్వు కుమిలిపోయావు కదూ! నీ అవసరం, బాధా తెలుసుకుని నిన్ను ఓదార్చే శక్తిని ఆ దేవుడు నాకియ్యలేదమ్మా. అందుకే తల్లీ కనీసం నిన్ను మనసారా ఏడవనిద్దామని తలుపులు తట్టకుండా ఇట్లా నీ కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాం తల్లీ"

అరవిందే తల్లిని వాటేసుకుని ఒక నిమిషం పాటు అలాగే ఉండిపోయింది. తర్వాత లేచి వెళ్ళి అందరికీ కంచాలు పెట్టింది. వసంత వడ్డిస్తుంటే "అన్నీ మధ్యలో పెట్టేసి కూర్చోవే. ఎవరికి వాళ్లం వడ్డించుకుందాం" అంది.

ఐదుగురూ గుండ్రంగా కూర్చుని అన్నం తింటున్నారు.

భోజనాలయ్యాక తిరిగి తన గదిలోకి వెళ్లిపోయింది అరవింద. కిటికీ దగ్గరకు వెళ్లి బయటకు చూస్తూ నిలబడిపోయింది. మదిలో మెదిలాడు వంశీ.

నో... అతడి జ్ఞాపకాల్ని తను భరించలేదు. భరించలేని జ్ఞాపకాల్ని మనసులోకి రానీయకూడదు.

తనిప్పుడు ఏదో ఒకటి చెయ్యాలి. లేదా ఎక్కడికైనా వెళ్లాలి.

ఒంటరిగా ఆలోచనలకు చస్తే చిక్కకూడదు.

ఏం చెయ్యాలి?

అప్పుడు గుర్తుకొచ్చింది యామినీ డైరీ. తనీ రిస్కుల్లో పడి దాని సంగతే పట్టించుకోలేదు. "భానురేఖ కూడా ప్రస్తుతం తోడు లేదు. అయినా ఒక్కదాన్నే వెళ్లాలి. తప్పదు. ఇల్లో సారి చూశానుగా' అనుకుంది. గడియారం కేసి చూసింది అరవింద.

అయిదు కావస్తోంది. వచ్చేటప్పటికి పొద్దుపోతుందేమో! రేపు కూడా ఆఫీసుకి సెలవు పెట్టేసి ఉదయాన్నే వెళ్ళాలి.

అసలెప్పుడెళ్లినా ఆయన ఇంట్లో ఉంటారో ఉండరో, పోనీ క్లినిక్కెళితే... ఊహూఁ... ఇంటికే వెళ్లాలి. యామిని అనే మనిషిని చూడకపోయినా కనీసం ఆమె మసలిన ఇంటిని చూడాలి.

ముఖ్యంగా శరశ్చంద్రగార్ని చూడాలి!

వంశీకి దూరమైన తనలాగా యామినికి దూరమైన శరశ్చంద్ర ఎంతగా తల్లడిల్లిపోతున్నాడో!

ఈ జ్ఞాపకాల మూటను పట్టుకెళ్ళి ఆయన ఒళ్ళో పెట్టేయాలి. అప్పుడాయన చెమ్మగిల్లిన కళ్లలో కృతజ్ఞత మెరిసి తన హృదయాన్ని తాకాలి.

అరవింద లేచి అల్మారాలోంచి యామిని హేండ్‌బేగ్ అందుకుంది. జిప్ లాగి డైరీని బయటికి తీసింది. దానివంకే కాసేపు కన్నార్పకుండా చూసి, మళ్ళీ లోపల పెట్టేసి బ్యాగ్ అల్మారాలో పెట్టేసింది. 'రేపు ఖచ్చితంగా వెళ్ళాలి' అనుకుంది మళ్ళీ




యామినీ శరశ్చంద్ర లైఫ్ సైజ్ ఫొటో వంక కన్నార్పకుండా చూస్తోంది అరవింద.

అగరు పొగల్లోంచి యామిని నవ్వుతూ చూస్తోంది. అలా నవ్వుతుంటే ఆమె కళ్లలో దీపాలు వెలుగుతున్నట్లున్నాయ్. దేవతల ముఖాల్లో కనిపించే కరుణ ఆమె ముఖాన్ని ఆవరించుకొని ఉంది.

"స్వీట్ లేడీ" అనుకుంటూ నిట్టూర్చింది అరవింద.

"ఒక్క పది నిముషాలు కూర్చో తల్లీ. అయ్యగారు స్నానం చేసి వస్తారు" ఇంకోసారి చెప్పాడు జోగయ్య.

అరవింద మొన్నోసారి వస్తే శరశ్చంద్ర ఇంట్లో లేడు. ఉదయాన్నే ఏదో ఆపరేషన్ అటెండ్ అవడానికి వెళ్లాడని చెప్పాడు జోగయ్య. ఇక క్లినిక్కి వెళ్లినా 'హి ఉడ్ బి వెరీ బిజీ' అనుకుని ఇంటికెళ్లిపోయింది.

వంశీ వెళ్లిపోయాడన్న బాధ ఇంకా మనసును తూట్లు పొడుస్తూనే ఉండడంతో మూడీనెస్ నుంచి బయటపడలేక ఓ నాల్రోజులు మిత్రురాలు భానురేఖ దగ్గరకు వెళ్లి గడిపి వచ్చింది.

'యామిని డైరీ ఇన్ని రోజులైనా తిరిగి ఇవ్వకపోవడం ఘోరం. ఖచ్చితంగా ఈరోజు ఎలాగైనా ఇచ్చి తీరాల'నుకుని వచ్చింది.

ఈసారి ఆయన్ని ఎటువంటి పరిస్థితిలోనూ మిస్ కాకూడదన్న నిర్ణయంతో మరీ ఉదయాన్నే వచ్చింది. జోగయ్య అయ్యగారింకా నిద్ర లేవలేదు కూర్చోమ్మా అని చెప్పాడు. అలాగేనని వెయిట్ చేస్తూ కూర్చుంది.

"ఫరవాలేదులే. ఎంతసేపైనా కూర్చుంటా" నవ్వుతూ అంది జోగయ్య మళ్లీ చెప్పటం చూసి.

ఓ నడివయసు స్త్రీ ట్రేలో కాఫీ తెచ్చి టీపాయ్ మీద పెట్టింది. అరవింద ఆ కప్పు అందుకుంటూ అనుకుంది "వంటావిడ కాబోలు"

"ఏ ఊరమ్మా తమర్ది? "

"ఈ ఊరే. చిక్కడపల్లిలో ఉంటాను" చెప్పింది అరవింద.

ఆమె లోపలికి వెళ్లిపోయింది ట్రేలో ఖాళీ కప్పు పెట్టుకుని. ఆమెతోపాటు లోపలికి వెళ్లిన జోగయ్య ఓ నిముషం తరువాత మరో కాఫీ కప్పుని ట్రేలో పెట్టుకుని ఆ హాల్లోంచి మెట్లెక్కి పై గదుల వైపు వెళ్లాడు. 'కాఫీ శరశ్చంద్రగారికేమో!' అనుకుంది అరవింద.

'కాఫీ తాగేసి ఇక ఆయన కిందకు దిగుతాడు' అనుకుని సర్దుక్కూర్చుని తిరిగి యామిని ఫొటో వంక చూడసాగింది.

చూస్తున్న అరవింద కళ్లు కాస్త చలించాయి ఏంటీ?

ఫొటోలో యామిని ఇందాక నవ్వుతోంది కదూ! మరి ఇప్పుడేమిటి, తనకేసి భృకుటి ముడిచి చూస్తోంది!

అరవింద సోఫాలో ఇబ్బందిగా కదిలింది.

అరె!... ఆమె పెదవులు. సన్నగా... కంపిస్తున్నాయ్...

ఇది... తన భ్రమ కాదు కదా!

ఆమె... ఆమె... కనురెప్పలు ఆర్పుతోంది.

మైగాడ్...

ఏం జరుగుతోంది?

అరవింద అరచేతుల్లో చెమటలు పోస్తున్నాయ్.

"అరవిందా!"

ఎవరు... ఎవరు నన్నలా పిల్చింది?

అరవింద చుట్టూ చూసింది భయంగా. ఎవరూ లేరక్కడ.

ఆమె భయాన్ని పసిగట్టినట్టు యామిని పెదవుల మీద సన్నగా చిరునవ్వు విచ్చుకుంది.

అరవింద వెన్ను ఝల్లుమంది. వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

ఫోటోలో యామిని నవ్వుతోంది. రెప్పలు రెపరెపలాడిస్తోంది. దగ్గరకు రమ్మన్నట్టు పిలుస్తోంది.

అరవింద తల్లోంచి నుదుటి మీదకు ధారగా జారుతోంది స్వేదం. ఒళ్లు చల్లబడిపోతుంది. అరికాళ్లల్లోంచి మొదలైన సన్నటి ప్రకంపన వెన్నుపూస గుండా పాకి మెదడును చేరుకుని మనిషిని మొత్తంగా కుదిపివేస్తోంది.

ఫోటోలో యామిని. నీళ్లలో పడిన నీడలా, అలవోకగా కదులుతోంది. తెరలు తెరలుగా విడిపోతోంది మళ్లీ ఒక్కటిగా అలుక్కుపోతోంది.

అరవింద చూస్తుండగానే ఫోటోలోని యామిని ప్రాణం పోసుకుంది. అరవిందకేసి సూటిగా చూస్తూ ఒక్క అడుగు... ఒక్కటే అడుగు ముందుకేసింది.

"ఈ అమ్మాయేనయ్యా... పాపం అరగంట నుంచీ తమకోసం చూస్తోంది"

జోగయ్య చెబుతున్నాడు.

ఎదురుగా డాక్టర్ శరశ్చంద్ర.

అరవింద మెల్లగా... కలలోలా లేచింది. ఆమె కళ్లింకా యామిని మీదే ఉన్నాయ్.

యామిని మరో అడుగు వేసింది అరవింద వైపుగా.

మూడు... నాలుగు... ఐదు... ఆరు... యామిని... ముఖం... అరవింద ముఖానికీ ఆనుకున్నట్టుగా ఉంది. ఇద్దరికీ మధ్య గాలి చొరబడే సందు కూడా లేదు.

"అమ్మా... అయ్యగారు" జోగయ్య అంటున్నాడు. యామిని ఇంకొక్క అడుగేసింది. అది అరవింద హృదయంలో పడినట్టుగా అన్పించింది.

"న... నమస్తే..." ఎలా లేచిందో అలాగే విరుచుకుపడిపోయింది అరవింద.

హఠాత్తుగా నేల మీదకు ఒరిగిపోయిన అరవింద పల్స్ పట్టుకు చూశాడు శరశ్చంద్ర.

ఎక్కడో బలహీనంగా కొట్టుకుంటుందామె గుండె. జోగయ్య గబగబ నీళ్లు తెచ్చి అరవింద ముఖాన చిలకరించాడు.

* * *

పెళ్లుమని నవ్వాడు వర్మ. ఆయన భార్య అశ్వని చిరాగ్గా చూసింది. వర్మ అదేం పట్టించుకోకుండా శరశ్చంద్రతో అన్నాడు "నువ్వు డాక్టర్ అయ్యుండి ఇంత అజ్ఞానంలో పడతామనుకోలేదు. మోరోవర్ వియ్ స్టెప్డ్ ఇన్‌టు ట్వెంటీ ఫస్ట్ సెంచరీ అన్నది మరచిపోతున్నావ్ నువ్వు"

శరశ్చంద్ర. తనక్కాస్త దూరంలో చేతులు కట్టుకుని నిలబడ్డ జోగయ్యకేసి చూశాడు. జోగయ్య తల బరబర గోక్కున్నాడు. యామినేమిటీ, ఆత్మరూపంలో ఇక్కడ తిరగడమేమిటీ, ఇప్పుడా అమ్మాయిని ఆవహించడమేమిటీ, అబ్సర్డ్. దీజ్ ఆర్ ఆల్ కాక్ అండ్ బుల్ స్టోరీస్" తల విదిలించేశాడు వర్మ.

"అదికాదు వర్మా..."

"ఏది కాదు శరత్? యామిని ఆత్మకథే హాస్యాస్పదమైతే, దాన్ని నువ్వు నమ్మడం మరీ హాస్యాస్పదంగా ఉంది"

"ఇలాంటివి మరీ కొట్టిపారెయ్యకండి. మా వూళ్లో ఓసారి అచ్చు ఇటువంటి సంఘటనే ఒకటి జరిగింది" చెప్పింది అశ్వని.

"నీలాంటి వాళ్లుంటే ఇలాంటివాళ్లు పిచ్చివాళ్లవడం ఖాయం" భార్యతో అన్నాడు వర్మ శరశ్చంద్రకేసి చూపిస్తూ.

"నేచెప్పేది కాస్త విను వర్మా, ఆ తరవాత మాట్లాడు"

శరశ్చంద్ర స్వరంలో విసుగును గమనించి వర్మ మౌనంగా ఊరుకున్నాడు చెప్పమన్నట్టు.

"ఆ అమ్మాయి ఎవరో, ఏమిటో నాకు తెలీదు. ఇంతవరకూ కనీసం ఆమె ముఖమైనా నేను చూడలేదు. నా కోసం వచ్చిందని జోగయ్య చెబితే కిందికి వచ్చాను. నేను మెట్లు దిగుతున్నప్పుడు గమనించా. ఆ

అమ్మాయి చూపులు యామిని ఫొటో మీదే ఫిక్స్ అయి ఉన్నాయి. ఊరికే చూస్తోంది అనుకున్నా. నేను ఎదురుగా నిలబడ్డా. ఆ అమ్మాయి నా ప్రెజెన్స్ ఫీలవలేదు. "అమ్మా... అయ్యగారు" అని జోగయ్య అంటే నావైపు చూడ కుండానే నమస్తే అంది. అంటూ అంటూనే... అన్‌కాన్షస్ అయిపో యింది. కాన్షస్‌లోకి వచ్చిందగ్గర్నుండీ తను యామినిలా బిహేవ్ చేస్తోంది లేవడంతోటే. నా ఫొటోకి పూలమాలేంటి? నేను పోయాన నుకున్నారా అని గొడవచేసి పెద్దగా ఏడ్చేసింది. మొదట స్టన్నయ్యాను. తరవాత ఏదై నా భ్రాంతికి లోనైందేమోనని అనుకున్నాను. ఎంతగా 'నువ్వు యామినివి కావు' అని నచ్చచె ప్పాలని చూసినా ఆమె ససే మిరా అంటోంది. పైపెచ్చు గుం డెలవిసేలా ఏడుస్తోంది. ఎన్నో గుర్తులు, జ్ఞాపకాలు, కేవలం మా ఇద్దరికి మాత్రమే తెలిసినవి కూడా చెబుతోంది".




"చెబితే...!" వర్మ రెట్టించాడు.

"నేను నమ్మీ నమ్మలేని స్థితిలో ఉన్నానిప్పుడు. ప్రస్తుతానికి ఆమెకు సెడేషన్ ఇచ్చి పడుకోబెట్టాను"

"నమ్మీ నమ్మలేని స్థితెందుకు? నమ్మకు. దట్సాల్"

శరచ్చంద్ర తలాడించి ఊరుకున్నాడు.

"ఆమె ఇప్పుడే స్పృహలోకి రాదా? " అడిగాడు వర్మ.

"ఇంకో పదినిమిషాల్లో రావచ్చు"

"ఆమెకి సంబంధించిన వివరాలేం దొరక లేదా? వెంట ఏదైనా మనీపర్స్ లాంటిది తెచ్చుకోలేదా? "

"హేండ్‌బ్యాగ్ వుంది. అందులో ఓ యాభై నోటూ, నాలుగు పదులూ, కాస్త చిల్లరా ఉంది. చిన్న మిర్రరూ, ఆడవాళ్ల మేకప్ సామగ్రి మినహా మరేం లేదందులో. ఆమె ఎవరో ఐడెంటిఫై చెయ్యడానికి కావల్సిన ఏ ఆధారమూ దొరకలేదు"

ఊరు మాత్రం ఇదేనయ్యా. ఇందాక కాఫీ ఇస్తూ అడిగితే, తనుండేది చిక్కడపల్లిలో అని చెప్పింది"అని వంటావిడ మధురం చెప్పింది.

"పేరడిగావా? " వర్మ ఆమెకేసి చూశాడు.

"ప్చ్... లేదయ్యా" నొచ్చుకుంటూ అంది.

అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు కాసేపు.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ శరశ్చంద్ర అన్నాడు "వర్మా, నీకో ముఖ్యమైన విషయం చెప్పలేదు. అది విన్నాక నీ అభి ప్రాయం చెప్పు"

చెప్పమన్నట్టు చూశాడు.

"ఈ మధ్య మన జోగయ్యకు యామిని ఆత్మ తరచూ కనబడు తోంది"

అశ్విని ఆందోళనగా చూసింది.

"అవునా జోగయ్యా? " వర్మ నొసటితో వెక్కిరిస్తూ నోటితో అడిగాడు.

అది పసిగట్టాడు జోగయ్య 'ఎవరి నమ్మకాలు వాళ్లవి బాబూ. నా మటుకు నేను అమ్మగారి ఆత్మ ఈ ఇంట్లో భేషుగ్గా తిరుగుతోందని చెప్ప గల్ను"

"ఆహాc... అమ్మగారి ఆత్మ నీతో మాట్లాడుతూ కూడా ఉంటు oదా? " నవ్వు దాచుకున్నాడు వర్మ.

"బ్రహ్మాండంగా మాట్లాడతారు. చక్కగా నా ఎదురుగా నిలబడతారు. అయ్యగారేం చెయ్యాలో నాకు చెబుతారు. నేనా విష యం అయ్యగారికి చెబుతుంటాను"

"అయ్యగారూ! దాన్ని మీరు ఫాలో అవు తుంటారా"? వర్మ శరశ్చంద్ర కేసి చూస్తూ అన్నాడు ఎగతాళి స్వరంతో.

శరశ్చంద్ర అవుతుంటానన్నట్టు తలూపాడు, కాస్త గిల్టీగా ఫీలవుతూ.

"పది నిముషాలు అయిపోయాయి. ఆమె స్పృహలోకి వచ్చుంటుందేమో!" అశ్విని అంది.

"వచ్చుంటుంది" శరశ్చంద్ర లేచాడు.

"గదిలోకెళ్ళి పలకరిద్దామా? ఆమెనిక్కడికి పిలిపిద్దామా? " అడిగింది అశ్విని వర్మని.

"ఏదో ఒకటి చేద్దాం" అంటూ లేచాడు వర్మ.

మెట్లెక్కి పైకి వెళ్లారందరూ "ఒకవేళ ఆమెలో యామిని ఆత్మ నిజంగా ఉంటే, మనల్ని గుర్తుపట్టాలి"

మెట్లెక్కుతూ అంది అశ్విని.

"అబ్బో ఈవిడిప్పుడు నీ గదిలో సెటిలైందా శరత్" నవ్వాడు వర్మ. అరవింద ఉన్న గది తలుపుమీద ట్యాప్ చేయబోయింది అశ్విని.

ఆమెకా అవకాశం ఇవ్వకుండానే సడన్‌గా తెరుచుకుంది తలుపు.




సనసన్న పూలున్న తెల్లటి పల్చటి రాజ్ కమల్ శారీలో అందంగా, రేగిన జుట్టుతో, అలసిపోయిన కనురెప్పలతో, పెదవుల మీద లేతగా పరుచుకుంటున్న చిరునవ్వుతో అశ్విని కేసి చూస్తూ అచ్చు యామినిలా - మెలోడియస్‌గా అంది అరవింద, "హాయ్... అనీ!" అశ్విని గుటకమింగి ఓ అడుగు వెనక్కేసి అంది కొంచెం భయంగా "హాయ్".

"అరె! అన్నయ్య కూడా వచ్చారే!" అరవింద గది బయటకి వచ్చి మెట్ల మీదుగా దిగసాగింది.

ఆమె వెనకే మౌనంగా దిగారంతా.

"కూర్చోండి" సోఫా చూపిందామె.

అశ్విని అరవిందకేసి ఓ సారి తేరిపార జూసి చెప్పింది "మేమొచ్చి చాలా సేపైందండీ"

అరవింద భృకుటి ముడివడింది. "అండీ నా? ఇదెప్పట్నుంచి? అసలేమైందే నీకు? యానీ అని క్యూట్‌గా పిల్చేదానివి"

అశ్విని వర్మకేసి చూసింది. మెల్లగా అతడి కుడిపాదం మీద గోకింది "ఈమెలో యామిని ఆత్మ ఉన్నట్టుందండీ"

వర్మ అశ్వినికేసి ఫన్నీగా చూసి కన్ను గీటాడు. "అప్పుడే బోల్తాపడ్డావ్"

అశ్విని చిన్నబుచ్చుకుంది.

ఇదేం గమనించని అరవింద అందర్నీ మరోసారి కూర్చోమని చెప్పి తనూ కూర్చుంది.

"అన్నయ్యా! అడుగుదాం... అడుగుదాం అనుకుంటానే మర్చిపోతున్నా. ఆ నిర్మలా సాహితి కేస్ ఏమయ్యింది? "

ఈసారి తెల్లబోవటం వర్మ వంతైంది.

వర్మ లీడింగ్ క్రిమినల్ లాయర్. నిర్మలా సాహితి అతడి క్లయింట్. ఈ మధ్యే రెండేళ్ల క్రితం ఆమెకి పెళ్లయింది. భర్తతో అన్యోన్యంగా కాపురం చేసుకుంటున్న సమయంలో ఓ ఆగంతకుడొచ్చి నిర్మలా సాహితికి తనకూ ఇదివరకే పెళ్లయిందని, ఓ ఆటంబాంబ్ లాంటి వార్త పేల్చాడు. సాక్ష్యాధారాల కింద పెళ్లి ఫొటోల్ని కూడా ఎగ్జిబిట్ చేశాడు. నిర్మల తనకే పాపం తెలీదంటోంది. ఆమె భర్త ఆమె నొదిలేశాడు. ఇప్పుడా కేసు కోర్టులో ఉంది. వర్మ ఆమె తరపు లాయర్.

"కేసింకా జరుగుతోంది" అన్నాడు, ఆమెనే పరిశీలనగా చూస్తూ.

"పాపం...నిర్మలా సాహితి అమాయకురాలే అన్పిస్తోందన్నయ్యా. నువ్వెలాగైనా ఆమెకు జస్టిస్ చెయ్యాలి"

"జస్టిస్ చేసేది జడ్జిగారు. వాదించడం వరకే నా బాధ్యత" వర్మ అన్నాడు.

"నీ వాదన మీదే కథా జడ్జిమెంట్ బేస్ అయ్యేది. సో యూ మస్ట్ సేవ్ హర్"

యామిని కూడా ఇలాగే మాట్లాడుతుంది. ఎప్పుడూ ఆమె మాటలు ఇతరుల వెల్‌ఫేర్ని కాంక్షిస్తుంటాయ్.

"అనీ! ఏంటీ అలా ఉన్నావ్? ఏదైనా ఫిజికల్ డిజార్డరా? " తనవంకే వెర్రిదానిలా

చూస్తున్న అశ్వనితో అని "కొంచెం దాన్ని చెకప్ చెయ్యండి. డాక్టర్లెదురుగా ఉంటే, ఎంత ఆరోగ్యవంతులైనా పేషెంట్లయిపోతారు మరి" అంది యామిని నవ్వుతూ శరశ్చంద్రతో.

శరశ్చంద్ర వర్మకేసి చూశాడు. వర్మ శరశ్చంద్ర కేసి చూశాడు. ఆ ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తోంది అశ్వని. జోగయ్యా, మధురం అబ్బురంగా అరవిందనే గుచ్చి గుచ్చి చూస్తున్నారు.

అందరూ అదోలా నిశ్శబ్దంగా ఉండటాన్ని విచిత్రంగా గమనించింది అరవింద. ఆమె చూపులు వాళ్లమీద నుంచి గోడ మీదున్న యామిని ఫొటో మీదకు మళ్లాయి.

ఆ ఫొటోకింకా వేళ్లాడుతున్న పూలమాలను చూస్తున్న ఆమె కళ్లు క్షణాల్లో ఎర్రబడ్డాయి.

ఒక్క ఉదుటున లేచెళ్లి కుడి చేతిని పైకిలేపి ఆ పూలమాలను పట్టుకుని వైల్డ్‌గా లాగేసింది.

చటుక్కున లేచి నిలబడ్డారందరూ.

"చూశావా అనీ! శరత్ నన్ను బతికుండగానే చంపేశాడు. నా గుండెలో గుండెవనీ, ప్రాణంలో ప్రాణానివనీ కబుర్లు చెప్పే శరత్ ఎందుకు ఎందుకిలా చేస్తున్నాడు. నేనింకా నీకు చెప్పలేదు. బాధని గుండెల్లోనే దాచుకున్నా. ఉదయం నుండీ నేను యామినినే కాదని నన్నేడిపిస్తున్నాడు"

అరవింద అశ్వనిని చుట్టేసి భోరుమంది. అశ్వని అరవింద భుజం మీద ఓదార్పుగా చెయ్యేస్తూనే శరశ్చంద్ర కేసి అనీజీగా చూసింది.

శరశ్చంద్ర లేచి అరవిందతో ఏదో అనబోతుండగా వర్మ వారిస్తున్నట్టుగా సైగ చేశాడు.

అరవిందను పూర్తిగా ఏడవనిచ్చి ఆమె తేరుకున్నాక అన్నాడు. వర్మ "చూడూ... నువ్వెవరో, నీ పుట్టుపూర్వోత్తరాలేమిటో నాకు బాగా తెలుసు. మా యామిని ఐ మీన్ శరశ్చంద్ర మిసెస్ నెల్లక్రితం రోడ్ యాక్సిడెంట్‌లో చనిపోయింది. నువ్వెంత నటించినా లాభంలేదు. బయటకు నడువ్. లేదంటే పోలీసులకి ఇన్ఫాం చెయ్యాల్సి ఉంటుంది"

అరవింద అయోమయంగా చూసింది వర్మకేసి. "నువ్వు మా పర్సనల్ విషయాలు సేకరించి వల్లెవేసినంత మాత్రాన యామినివైపోలేవ్" అన్నాడతను.

అరవింద శరశ్చంద్రకేసి నడిచింది. అనూహ్యంగా అతడి షర్ట్ కాలర్ వడిసి పట్టుకుని అంది "ఏంటి శరత్? ఏంటతను అనేది? అంటే నువ్వు... నువ్వు అతని క్కూడా నేను యామిన్ని కాదని చెప్పేశావా? నేను నిజంగా నీ యామిన్ని కానా? "

"డౌటేం అక్కర్లేదు. నువ్వు యామిని కావు... కావు... కావు" వర్మ స్టడీగా, ఖచ్చితంగా చెబుతూ ఆమె కళ్లలోకి గుచ్చిచూశాడు.

"వింటున్నావా శరత్! నేను నీ యామినిని కానట. అయితే మరి నేనెవర్ని? చెప్పు శరత్... చెప్పు. నేనెవర్ని ప్లీజ్... నా తల పగిలిపోతుంది. నా గుండె మండిపోతోంది. చెప్పెయ్. శరత్ ఒక్కమాట నీ నోటితో 'నువ్వు నా యామిని కాదు' అన్నావంటే వెళ్లిపోతాను. నీకు దూరంగా వెళ్లిపోతాను. ఇంకెప్పటికీ నీకు కనబడని లోకాలకు వెళ్లిపో..."

అరవింద అలాగే నేల మీదకు జారిపోయింది. ఒక్క అంగలో వచ్చి పట్టుకున్నాడు జోగయ్య. ఆమె నేల మీద పడకుండా, మెల్లగా ఆమెను ఒళ్లో పడుకోబెట్టుకుని ముఖం మీద కన్నీళ్లకు చెదిరి అంటుకుపోయిన ముంగురుల్ని సవరించాడు. ఆనక కళ్లెత్తి శరశ్చంద్ర వంక చూశాడు.

ఎర్రబడ్డ జోగయ్య కళ్లలోంచి జారి అతడి నెరిసిన చెంపల్ని తడుపుతున్నాయి కన్నీళ్లు.

శరశ్చంద్రనే సూటిగా చూస్తూ అన్నాడు "అయ్యా... ఎవురు నమ్మినా నమ్మకపోయినా ఈ తల్లి యామినమ్మే. నా తల్లిని మీరంతా గుర్తు పట్టలేక పోవచ్చుగాని నేను గుర్తుపట్టేశాను. నా బంగారు తల్లిని ఎవురుగాని ఇంక ఒక్కమాటన్నా నేను తట్టుకోలేనయ్యా. తట్టుకోలేను" జోగయ్య ఒడిలో తలపెట్టుకుని మగతగా కళ్లు మూసుకుని ఉన్న అరవిందకేసి రెండు క్షణాలు చూశాడు శరశ్చంద్ర.

ఎందుకో తెలీదు. అతడి కళ్లలో నీళ్లు

చిప్పిల్లి రెండు అశ్రుబిందువులు చెక్కిళ్ల మీదు గా రాలిపడ్డాయి.

**7**

శ్రీదేవికి ఓ మాట నోట్లో ఆడుతోంది. చెబుదామా వద్దా అని సందేహిస్తోంది. కాసే పు ఆలోచించాక చెప్పెయ్యడమే మంచిదన్పిం చిందామెకు. అరవింద 'వంశీ' అనే వ్యక్తితో లేచిపోయిందేమోనని ఆమె అనుమానం.

తల్లివంక చూసింది. రాత్రి నుంచీ నిద్రాహా రాల్లేక సొమ్మసిల్లిపోయి నేలమీద ఓ మూల పడుకుని ఉందామె. వసంత స్తబ్దంగా కుర్చీలో కూర్చుని వీధి గుమ్మంవైపు ఊరికూరికే చూస్తోంది.

శ్రీదేవికి తెలుసు, ఆ ఎదురుచూపు. అక్క జాడ కోసం బయటికి వెళ్లిన శీను కోసమని.

అరవింద కనిపించకుండాపోయి అది రెండో రోజు. క్రితం రోజు ఉదయం ఏడు గంటలకల్లా బయటికి వెళ్లిపోయిన మనిషి సాయంత్రం ఎనిమిదవుతున్నా ఇంటి కి రాకపోతే, ఆఫీస్ వదిలాక ఎట్టైనా పని మీద వెళ్లిందేమోలే అని రాత్రి పదివరకూ ఎదు రుచూశారు. ఆ తరు వాత మాత్రం ఇంటిల్లి పాదీ భయపడిపోయారు. శీను పదిన్నర ప్రాంతం లో వి అండ్ జె కంపెనీకెళ్లి ఎంక్వ యిరీ చేశారు. అక్కడ నైట్ వాచ్‌మెన్ ఆమె ఆరోజు ఆఫీస్‌కు వచ్చిందీ లేనిదీ తనకు తెలి యదన్నాడు. అతన్నడిగి ఎండీ అడ్రస్ కను క్కొని సరాసరి ఆయన ఇంటికెళ్లిన శీనూకి అసలు ఆరోజు అరవింద ఆఫీస్‌కే రాలేదని తెలిసింది. అంతవరకూ ఏ మూలో ఉన్న ధైర్యం కాస్తా నీరుకారిపోయింది. చేసేది లేక ఇంటికి వచ్చి విషయం చెప్పాడు. తులసమ్మ గుండెలు బాదుకుంది.

"ఛ... ఊరుకోమ్మా. అదేమన్నా చిన్నపిల్లా. ఉదయానికల్లా వస్తుంది. ఏదైనా పనిబడి ఎట్టైనా వెళ్లిందేమో! ఇట్లా ఏడ్చి రభస చేస్తే అక్క పరువు పోతుంది. అందరూ మరోలా అనుకుంటారు. కామ్‌గా ఉండు" గదిమింది వసంత.



వసంత చెప్పింది సబబే అన్పించింది తులసమ్మకు. అందుకే నోటికి చెంగడ్డం పెట్టుకుని గుడ్లనీరు గుడ్లలోనే కుక్కుకుంది.

తెల్లవారింది. ఏడైంది, ఎనిమిదైంది, పన్నెండైంది... మళ్ళీ సాయంత్రమైంది.

"నా తల్లికేదో అయింది. దాన్నెవరో ఏదో చేసేసుంటారు" తులసమ్మ పదేపదే అనుకుంటూ రోదిస్తోంది.

శీను తిరిగినవాడు తిరిగినట్టే ఉన్నాడు. మళ్ళీ ఇప్పుడెక్కడికో వెళ్ళాడు.

"ఏం తులసమ్మా! అరవిందేదీ, నిన్నట్నుంచి కన్పడ్డం లేదే?" ఇరుగుపొరుగు పరామర్శ మొదలైంది.

ఆరున్నరవుతుండగా సైకిల్‌ని వీధిలోనే నిలిపి లోపలికొచ్చాడు శీను.

తులసమ్మ ఏడుపు ఆపి చప్పున కొడుక్కి ఎదురెళ్లింది.

శీను ఆమెను తప్పించుకుని లోపలికెళ్లాడు.

ఆమెకర్థమైంది. అరవింద జాడ తెలియలేదని.

వసంత గుండె గుబగుబలాడుతోంది. ఊరికే ఒళ్లంతా చెమట్లు పడుతున్నాయ్. ఒకటే ఆందోళన.

"అక్కెప్పుడూ ఇలా చెప్పకుండా ఎక్కడికీ వెళ్లలేదు" శ్రీదేవితో ఆ మాటే వందలసార్లు అంది. అలా అంటున్నప్పుడు వద్దంటున్నా కన్నీళ్లు జలజల రాలిపోతున్నాయి.

శీను అలసటగా స్టూలు మీద కూర్చున్నాడు. వసంత మంచినీళ్లు తెచ్చిస్తే గటగట తాగేసి కర్చీఫ్‌తో నుదురు తుడుచుకుంటూ అన్నాడు "ఇక పోలీస్ రిపోర్ట్ ఇవ్వటం మంచిదేమో!"

"ఆడపిల్లరా నాయనా. అట్లా చేస్తే దానికి పరువుంటుందా?" తులసమ్మ తల బాదుకుంది.

ఆమె చెప్పింది రైటే అన్పించినా శీను విసుక్కున్నాడు "మరింక నన్నేం చెయ్యమంటావ్?"

శీను ప్రశ్నలోని అసహాయతకు శ్రీదేవి నొచ్చుకుంది.

'ఇక లాభం లేదు. అసలు విషయం చెప్పెయ్యటమే మంచిది' అనుకుంది.

"అన్నయ్యా!" పిల్చింది శ్రీదేవి.

అదే సమయంలో "శీనూ!" అంది వసంత కాసింత ఉద్వేగంగా.

శ్రీదేవి తను చెప్పాలనుకున్న విషయాన్ని వాయిదా వేస్తూ వసంత మాట్లాడ్డానికి ఛాన్సిచ్చింది.

"అప్పుడోసారి... అక్కకు ఓ హేండ్ బాగ్ దొరికింది చూడు. అదివ్వటానిగ్గాని వెళ్లుంటుందేమో?" వెళితే ఏంటి అన్నట్టు చూశాడు శీను.

"అసలు ఆఫీస్‌కి అది తొమ్మిది తొమ్మిదిన్నర మధ్య బయలుదేరుతుంది. నిన్నెందుకో ఏడింటికే వెళ్లిపోయింది. కారణమడిగితే పనుందని అంది" మళ్లీ అంది వసంత.

శ్రీదేవి గబగబ వెళ్లి అరవింద గదిలోని అల్మారా తీసి చూసింది. అక్కడ ఆ హాండ్ బ్యాగ్ లేదు.

"ఆ బ్యాగ్ లేదింట్లో" చెప్పింది.

"అయితే అక్క ఖచ్చితంగా అక్కడికే వెళ్లుంటుంది" వసంత కాస్త ఎగ్జయిటింగా అంది.

"వెళితే వెళ్లుంటుంది. బ్యాగ్ ఇచ్చేసి, ఆఫీస్‌కి వెళ్లటమో ఇంటికి రావటమో చేస్తుందిగాని



అక్కడే ఎందుకు సెటిలౌతుంది? "

"అది కాదురా శీను. అసలు పిల్ల అక్కడి కైనా వెళ్లిందో లేదో తెలుసుకుంటే తప్పే ముంది? ఏ పుట్టలో ఏ పాముందో. వాళ్లే దైనా ఆచూకీ చెబుతారేమో!" అశగా అంది తులసమ్మ.

"నువ్విదివరకోసారి ఆ శరశ్చంద్రగారి క్లినిక్కి వెళ్లావు, కానీ అప్పట్లో ఆయన క్లినిక్కి రావటం లేదని చెప్పారన్నావు" గుర్తు చేస్తున్న ట్లుగా అంది శ్రీదేవి.

"ఇల్లు తెలీదేమో కదూ" వసంత అంది.

"నాకేం తెలుసు? "

"అన్నయ్య వెళ్లి చాలా రోజులవుతోందిగా. ఇంకా ఆయన క్లినిక్కిరాకుండా ఉంటాడా? " శ్రీదేవి అంది.

శీనూ లేచాడు "క్లినిక్కెళ్లి చూస్తా. అక్కడ ఆయన లేకపోతే క్లినిక్‌లోని వాళ్లెవరైనా ఇంటి అడ్రస్ చెబుతారేమో ట్రై చేస్తా"

అతను వెళ్లిపోయాక అనుకుంది శ్రీదేవి 'అక్కడా అక్క ఆచూకీ దొరక్కపోతే అప్పుడే చెప్పాలి అసలు విషయం' అని.

శీను హాస్పిటల్‌కి వెళ్లేసరికి ఏడవుతోంది. ముగ్గురు పేషెంట్స్ కూర్చుని ఉన్నారు. వాళ్ల పక్కనే బాయ్ కూడా కూర్చుని ఉన్నాడు. వాలకం చూస్తుంటే డాక్టర్ లేడేమోనన్పిం చింది.

అప్పుడే లోపలికి వచ్చిన నర్సు!

బాయ్‌ను చూస్తూ "సార్ రారంటనా? " అంది.

"ఏమొస్తారో ఏమో. అరగంటకోసారి ఫోన్ చేసి ఇంకో అరగంటలో వస్తానంటున్నారు" చెప్పాడతడు.

"ఆ అమ్మాయింకా ఉందంటవా? "

"ఎక్కడి కెళ్తుంది? ఏకంగా మేడమ్‌గార్నే నేనంటుంటే"

"అయినా భలే విచిత్రం కదా సాయీ మేడ మ్‌గారు పోవటమేంటి? ఈ పిల్లెవరో వచ్చి మేడమ్‌లాగా నటించడమేంటి? "

"నటనేనంటారా? ఒకవేళ నిజంగానే మేడమ్ ఆత్మ ఆ అమ్మాయిని పట్టుకుందేమో! ఆ ఇంట్లో మేడమ్ ఆత్మ తిరుగుతోందని ఈ మధ్య జోగయ్య అన్నాడోసారి నాతో"

నర్స్ ఫక్కుమని నవ్వింది. "నువ్వు నమ్ము తున్నావా? సరే రేపు నేను కూడా డాక్టర్‌గా రింటికెళ్లి నేనే మేడమ్‌నని యాగీ చేసేస్తా. అప్పుడు మా యిద్దరిలో ఎవరు మేడమో తేల్చడానికి నువ్వొద్దువు కానీ" అంది జోక్ చేస్తున్నట్లుగా.

బాయ్ సిగ్గుగా నవ్వాడు ఆమె జోక్‌కి.

మళ్లీ నర్సే అంది, "ఊరుకో సాయీ! మేడమ్ ఆత్మ ఇంట్లో తిరుగుతోందని ఈ జోగయ్యెక్కడో వాగుంటాడు. అది విని, ఆ విషయం ఈ విషయం సేకరించి ఇది ఎవ తో ఇంట్లో దూరి నాటకమాడుతోంది. డాక్టర్ గార్ని పడితే లక్షల ఆస్తి ఒళ్లో పడ్డట్టేగా"

"అంతేనంటావా? "

"కాక...! పోలీసులగ్గాని పట్టిస్తే ఇట్టే దిగొ స్తుంది ఆత్మా, గీత్మా" కాస్త కోపంగా అని నర్స్ వెళ్లిపోయింది.

శీను వాళ్ల సంభాషణ పూర్తిగా విన్నాడు పెక్యూలియర్‌గా అన్పించింది "ఏంటి నర్స్ అనేది? " అని బోయ్ నడిగాడు.

అతడు విషయం చెప్పి "నర్సేంటో అంటోం ది గాని ఇలాంటి విచిత్రాల్ని మనం పూర్తిగా కొట్టి పారెయ్యకూడదు" అన్నాడు.

అతడి మాటలు పూర్తి కాకుండానే ఫోన్ మోగింది. కాల్ రిసీవ్ చేసుకుని శీనూతో చెప్పాడు "సారివాళ్టికి రాడట"

శీనూ లేచాడు. బోయ్ కన్సల్టింగ్ రూమ్‌కు తాళాలు వేశాడు.

శీనూ కెక్కడో ఏదో అనుమానంగా ఉంది. నిన్న పొద్దున్నే ఎవరో ఒకమ్మాయి డాక్టర్ గార్ని కలవాలని ఇంటికెళ్లిందట. ఒకవేళ ఆ అమ్మాయి అరవిందక్క కాదు కదా!

అరవింద కూడా నిన్న ఉదయాన్నే బయ లుదేరింది. పనుందంటూ ఒకవేళ డాక్టర్‌గారికి డైరీ అందచేయాలన్న ఉద్దేశంతో నేరుగా ఇంటికెళ్లిందేమో!

అంతే అయింటుందనిపించింది శీనూకు.

కానీ, ఆ అమ్మాయి అరవిందైతే- తను

డాక్టర్‌గారి మిసెస్‌లా ఎందుకు బిహేవ్ చేస్తుంది? ఆ అవసరం అక్కకేముంది?

బాయ్ అన్నట్టు, ఏదైనా వింతే జరిగిందా? ఒకవేళ ఆ అమ్మాయి అరవిందే అయితే ఇప్పుడు అక్క పరిస్థితేంటి?

వాళ్లూ ఆ నర్స్‌లాగా ఆలోచిస్తే అక్కను ఫ్రాడ్‌గా భావించి ఏ పోలీసులకో అప్పగిస్తే...

శీను తల విదిలించాడు.

"చూడు, నేను డాక్టర్‌గార్ని అర్జంటు పని మీద కలవాలని వచ్చాను. ఆయన రారంటున్నావు. పోనీ ఆయన రెసిడెన్స్ ఎక్కడో చెబుతావా? " బాయ్‌ని అర్థింపుగా అడిగాడు.

బోయ్ శీనూని ఓసారి ఎగాదిగా చూసి అడ్రసు చెప్పాడు. శ్రీను ఓ చిన్న స్లిప్ మీద ఆ అడ్రస్ నోట్ చేసుకున్నాడు.

శీను హాస్పిటల్ గేటు బయటకొచ్చి ఒక్కక్షణం ఆలోచించాడు.




ఇప్పుడు తను ఇంటికెళ్లి విషయం అమ్మకు చెప్పాలా, లేక నేరుగా డాక్టర్‌గారింటికెళ్లి ఆమె అరవింద అవునో కాదో తెల్చుకోవాలా?

అతనికి రెండోదే మంచిదన్పించింది. ఏదో చెప్పి ఇంట్లో వాళ్లకు కంగారు పెట్టే బదులు అసలు ఆవిడ అక్కో కాదో తెలుసుకోవటం ఉత్తమం అనుకున్నాడు. అడ్రసు రాసుకున్న స్లిప్ వంక చూసి బయలుదేరాడు.

* * *

ఆ రాత్రి ఆ ఇంట్లో ఎవరి కంటిమీదా కునుకు లేదు. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని తపన పడిపోతున్నారు.

తులసమ్మ అయిదు నిముషాలకోసారన్నా, "ఒరే శీనూ పిల్లనెందుకో వాళ్లు గుప్పెట్లో పెట్టుకున్నారా ఏ చేతబడో ప్రయోగించి దాన్ని వశం చేసేసుకున్నారు. నా తల్లి ఎన్ని బాధలు పడుతోందో ఆ మాయావుల చేతుల్లో. భగవంతుడా... నిద్రలో కూడా నిన్నే తలచుకుంటుందీ. ఎందుకయ్యా నా బిడ్డను ఇలా చేశావ్? " అంటోంది.

శీను హాస్పిటల్ నుంచి నేరుగా బంజారా హిల్స్ వెళ్లాడు. అతనూహించినట్టే శరశ్చంద్ర ఇంట్లో ఉన్న అమ్మాయి అరవిందే. ఆమె కనబడిందన్న ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు! కానీ ఆ ఆనందం ఎంతోసేపు నిలవలేదు.

శీనూని ఏ మాత్రం గుర్తించలేదు అరవింద. అతడు ఎన్ని ప్రయత్నాలు చేసినా నువ్వెవరో నాకు తెలీదు పొమ్మంది. చివరికతడు హతాశుడై కళ్లనీళ్లు పెట్టుకుంటే జాలిపడి అంది "చూడు బాబూ, నేను మిసెస్ యామినీ శరశ్చంద్రను. మీ అక్క అరవిందంటున్నావ్... ఆమె ఒకవేళ నాలా ఉండిఉండవచ్చు మీ అక్కయ్య కనబడక దుఃఖంలో ఉన్నట్టున్నావ్. పోనీ నేనే మీ అక్కననుకో. అప్పుడప్పుడూ వస్తుండు. ఆ మాత్రం అభిమానాన్ని పంచివ్వడానికి నాకేం అభ్యంతరం లేదు".

ఆ మాటలని ఆమె తన గదిలోకెళ్లి తలుపు మూసుకుంది.

శరశ్చంద్ర శీనూని ఓదార్చాడు. "ఐ థింక్ మెంటల్లీ షి ఈజ్ నాట్ సౌండ్. ఓ రెండ్రోజులు ఓపిక పట్టు మెల్లగా దార్లో కొస్తుంది"

శీనూ శరశ్చంద్ర కళ్లలోకి నిస్సహాయంగా చూశాడు. "అసలు... ఇలా ఎందుకు జరిగింది సర్? "

రమామణి చివ్వున చూసింది శీనువైపు. ఆమె శరశ్చంద్రకు స్వయానా చెల్లెలు. ఇక్కడ జరుగుతున్న వింత తెలుసుకుని చూసిపోదామని వచ్చింది.

"ఇలా ఎందుకు జరిగిందో, జరుగుతోందో, ఇక ముందు ఇంకా ఏం జరగనుందో అన్నీ నీకూ నీ అక్కయ్యకూ తెలియాలి. అమాయకుడు వాడికేం తెలుస్తుంది? " అనేసింది కసిగా.

శీనూ అయోమయంగా చూశాడామె వైపూ, శరశ్చంద్ర వైపూ మార్చి మార్చి

శరశ్చంద్ర ఆమెను వారించేలోగానే మరో మాట కూడా అందామె. "అంత అయోమయంగా చూస్తున్నావేం బాబూ? మా అన్నయ్య ఆస్తిపాస్తులు కాజెయ్యాలని మీరంతా కలిసి ఆడుతున్న నాటకం కాదూ ఇది! వాడు దుఃఖంలో ఉండటం చూసి, వివరాలన్నీ తెలుసుకుని చిత్రంగా కోటలో పాగా వేశారు. నాలుగు రోజులు ఏదో వంకతో దగ్గరగా మసిలి వాణ్ణి బుట్టలో వేసుకుని మీ అక్కకు కట్టబెట్టాలనేగా మీ ఆలోచన. పైకి తెలీనట్టూ ఆ వగలమారి ఏడుపులెందుకంట? "

"రమా" శరశ్చంద్ర వారిస్తున్నట్లుగా చూశాడామె వంక.

శీనుకు ఇక తనక్కడ ఉండడం సబబు కాదన్పించింది. లేచి నిలబడి శరశ్చంద్రతో చెప్పాడు. "సార్, మా అమ్మనీ, సిస్టర్స్‌నీ పిల్చుకొస్తాను. కనీసం వాళ్లను చూస్తేనన్నా..." ఆపైన మాట్లాడలేక ఆగిపోయాడు.

"గుర్తు పడుతుందిలే. పట్టేట్టు నేను చేస్తాగా. అంతగా పట్టలేదనుకో. పోలీసులుండనే ఉన్నారు. లాఠీతో ఒక్కటి పీకారనుకో తల్లో జేజెమ్మ కూడా గుర్తొస్తుంది. పో, పిల్చుకురాపో మీ గ్యాంగ్‌ని" శాడిస్టులా నవ్వింది రమామణి.

శీను కళ్లలో రెపరెపలాడుతున్న భయాన్ని పసిగట్టి వెంటనే రియాక్టయ్యాడు శరశ్చంద్ర "సీ... మిస్టర్..."

"శ్రీనివాసండీ"

"మీ అక్కయ్యను కంటికి రెప్పలాగా కాపాడే బాధ్యత నాది. నువ్విప్పుడెళ్లి మీ ఫ్యామిలీని తీసుకురావడం కుదరదు. రాత్రివేళ వాళ్లను కంగారు పెట్టకు. ఉదయాన తీసుకురా"

"అలాగే సార్"

"భయపడకు. మీ అక్కయ్యను జాగ్రత్తగా చూసుకుంటాను. నువ్వు, మీ వాళ్లు నిశ్చింతగా ఉండండి. సరేనా". శీను భుజం తట్టాడు శరశ్చంద్ర.

శీను నెమ్మదిగా లేచి బయటకొచ్చాడు.

"ఏమిత్రా చూసుకునేది ముందు బయటికి గెంటెయ్యక. నా ఒళ్లంతా కారం రాసినట్టుంది. దాన్ని చూస్తుంటే" రమామణి స్వరం హైపిచ్‌లో వినబడుతోంది.

రిస్ట్‌వాచీ పదిగంటల్ని సూచిస్తోంది. తనిప్పుడు ఇంటికెళ్లి అందర్నీ తీసుకుని ఇక్కడికొచ్చేసరికి పదకొండు దాటొచ్చు. డాక్టరుగారు చెప్పింది కరెక్టే. రేపు ఉదయం రావడమే మంచిదేమో! కానీ ఆమెవరో,డాక్టర్‌గారికి బాగా కావలసిన మనిషిలా ఉంది. అక్కనేమైనా బాధ పెడుతుందా? లేదులే అక్కని కంటికి రెప్పలా చూసుకుంటానని డాక్టర్ చెప్పారుగా. ఆయన మంచి వ్యక్తిలాగానే కనబడుతున్నారు!

ఇలా ఆలోచిస్తూ ఇల్లు చేరిన శీను ఈ వింతను ఇంట్లో చెబితే ముందెవరూ నమ్మలేదు. అతడి మాటల్ని నమ్మడానికి కాస్త టైమ్ పట్టింది వాళ్లకు. వెంటనే వెళ్లిచూడాలని తొందరపడిపోయారు. కానీ శీనూ పడనీయలేదు.

"హమ్మయ్య! అక్క వంశీ అనే అబ్బాయితో లేచిపోలేదు. ఛ అక్కెప్పుడూ అలా చెయ్యదు నయం. తొందరపడి వాగాను కాదు" అనుకుంది శ్రీదేవి. తరువాత వసంతతో "వసంతక్కా! ఇది వింటుంటే లీలావతికి ఆత్మపూనడం నిజమనిపించడం లేదూ" అంది.

"లీలావతిదీ అబద్ధమే, అక్కదీ అబద్ధమే. ఇందులో ఏదో గూడుపుఠాణి ఉంది. దాన్ని చూస్తేగాని అసలు విషయం తెలీదు" అంది వసంత.

మొత్తం మీద అరవింద ఎక్కడో ఓ చోట క్షేమంగా ఉందన్న వార్త వాళ్లందరకు కాస్త నిశ్చింతనిచ్చింది. కాకపోతే ఎప్పుడెప్పుడు ఆమెను చూడాలా అన్న ఆత్రుత, ఆందోళన మాత్రం వాళ్లకు నిద్ర పట్టనివ్వటం లేదు.

"చూడు శ్రీ అక్కకు శరశ్చంద్రగారి మిసెస్ హేండ్ బ్యాంగ్ దొరికిన విషయం పొరపాటున కూడా అనకు. అందులో డైరీ చదివి అక్క కావాలని నటిస్తోందని వాళ్లు పూర్తిగా నమ్మేస్తారు. చీటింగ్ కేస్ ఫైల్ చేసినా చెయ్యొచ్చు" శీను పదేపదే చెబుతున్నాడా విషయాన్ని.

"అబ్బ! ఇప్పటికిది నువ్వలా చెప్పటం పదో

సారి నేనెందుకంటానన్నయ్యా. నాకు బుర్ర లేదనుకున్నావా?" శ్రీదేవి విసుక్కుంటోంది.

"ఆ బాగ్గులోనే ఏదో శని ఉన్నట్టుందే. వసంతా. అది దొరికినప్పట్నుంచీ పిల్ల తీరే మారిపోయింది" తులసమ్మ అంటోంది.

"ఇలాగే మాట్లాడక్కడ" వసంత అరుస్తోంది.

"ఎందుకే అట్లా అరుస్తావ్! నేనేమన్నాననీ" తులసమ్మ సణుగుడు.

అన్నిటి మధ్యా అనుకోకుండా తెలవారిపోయింది. సరిగ్గా ఏడయ్యేసరికి అందరూ రెడీ అయి ఆటో ఎక్కారు.

* * *

అరవింద వడలిన పువ్వులా పడివుంది మంచం మీద. శరశ్చంద్ర గదిలోపలికి వచ్చి శబ్దం చెయ్యకుండా కూర్చున్నాడు. బెడ్ అంచుల మీద ఆమెను కనిపెట్టుకుని అక్కడే కూర్చుని ఉన్న జోగి ఆయన్ని చూడగానే బయటికి నడిచాడు.

ఆ మాత్రం అలికిడికే మెల్లగా కళ్లు తెరిచిందామె. శరశ్చంద్రకేసి కాసేపలాగే చూసి మళ్లీ కళ్లు మూసుకుంది. మూసుకున్న రెప్పల మాటునుంచి 'టప్' మని రాలి పడ్డాయి. రెండు వెచ్చటి కన్నీటి బొట్లు. ఆయన మార్ధవంగా ఆమె తల నిమిరాడు.

కదిలిపోయింది అరవింద. ఆమె హృదయాన్ని కోసుకుంటూ తెరలు తెరలుగా వచ్చింది దుఃఖం.

"శరత్!" ఆమె పెదవులు ఉద్వేగంగా కదిలాయి "నేను... నేను..."

"నువ్వు నా యామినివి. మిసెస్ యామినీ శరశ్చంద్రవి సరేనా!"

"శరత్!" తన తలను నిమురుతున్న ఆయన చేతిని చప్పున పట్టుకుని భద్రంగా

## చలం ఎందుకు వణుకుతాడంటే...

చలాన్ని కేవలం వచన రచయితే అనుకుంటారు చాలామంది. ఆయన పద్యాలు కూడా ఆశువుగా చెబుతాడని ఈ కింది సంఘటన నిరూపిస్తుంది. ఒకరోజున చలం గారూ.. అబ్బూరి వరద రాజేశ్వరరావు మాట్లాడుకుంటూ రోడ్డున వెళ్తున్నారు. కొంత దూరం వెళ్లాక వరద ఇప్పుడే వస్తానంటూ పక్కన ఉన్న గుడిసెచాటుకు వెళ్లాడు. తిరిగి వచ్చాక తనురాసిన పద్యం గురించి మాట్లాడుతూ,

'గుడిపాటి వెంకట చలము
గడగడమని వణుకు నన్నుచూసి కారణమేమో..?'

అంటూ చలంగారి వంక అర్థోక్తిగా చూశాడు.

వెంటనే ఆయన అందుకుని

'వడివడి పోయన్ తడబడ
నడివీధిని నవ్వుదురని నలుగురు వరదా!'

అంటూ ముగించారు. భావం తేలికగానే అర్థమవుతోంది కదా? చలంగారు తనను చూసి భయపడతారని ఏదో చెప్పాలని ప్రయత్నించిన వరదను అతను అంతకు ముందు లఘుశంకకు వెళ్లిన వైనానికి లంకెపెట్టి (అతను రోడ్డుమీదే ఆ పని కానిచ్చేస్తే దారినపోయే నలుగురూ ఎక్కడ నవ్వుతారోనని తాను భయపడినట్లుగా చెప్పి) మిగిలిన రెండుపాదాలూ పూరించారు చలం. మరి చలమా మజాకా?



గుండెలకు ఆనించుకుంది.

ఆమె గుండె అమితమైన ఉద్వేగంతో దడద డమని కొట్టుకోవడం ఆయనకు స్పష్టంగా తెలుస్తోంది.

"మరి ఉదయం. వాళ్లంతా ఎవరు? నన్ను అరవిందా అరవిందా అని పిలుస్తారేమిటి? ఎందుకు వాళ్లు నీ నుండి నన్ను వేరు చెయ్యాలని చూస్తున్నారు శరత్? "

ఒక్క క్షణం ఆలోచించి చెప్పాడు "వాళ్లకు అచ్చు నీలా ఉండే ఓ అమ్మాయి ఉందట. మూడు రోజుల్నుంచీ కన్పించటం లేదట. నిన్ను చూసి ఆమే నువ్వనుకుని..."

ఆయన మాటలు పూర్తికాకుండానే అంది అరవింద "నువ్వూ నీ బంధువులూ కూడా అదేగా అంటున్నారు!" శరశ్చంద్రకేం చెప్పాలో తోచలేదు. మౌనంగా ఉండిపోయాడు.

ఆమె హఠాత్తుగా లేచి కూర్చుని అరచేతుల్లో ముఖం దాచుకుని భోరుమని ఏడ్చేసింది.

ఆయన కంగారు పడిపోయి అన్నాడు "అరవిందా! ఊరుకోమ్మా. ఊరుకోమంటుంటే".

అరవింద ఉక్రోషంగా చూసిందాయన వంక "అదుగో మళ్లీ అరవిందా అంటున్నారు నన్ను. ఎవరా అరవింద? ఎందుకు నా ప్రాణాలిట్లా తీస్తోంది".

"ఐయామ్ సారీ... పొరపాటుగా అనేశా"

"ఇది పొరపాటు కాదు శరత్. నా గ్రహపాటు. ఇంత వయసొచ్చాక నీకు నామీద మొహం మొత్తింది. ఒకవేళ పిల్లల్లేరన్న దిగులు నిన్నలా చేస్తోందేమో! పోనీ మనసులో నా పట్ల విముఖత కలిగితే చెప్పు మ్యూచ్యువల్‌గా విడిపోదాం. ఆనక నీ జీవితం నీది నన్ను మాత్రం ఇలా చిత్రవధ చెయ్యొద్దు. ప్లీజ్" అరవింద చేతులెత్తి దండం పెట్టింది.

"అలాంటిదేం లేదు. నువ్వు విశ్రాంతి తీసుకో".

"తీసుకోబోయానుగా శాశ్వతంగా విశ్రాంతి. మళ్లీ నువ్వే బతికించావ్" కోపంగా చూసింది.

ఉదయం శీనూ కుటుంబ సభ్యుల్ని తీసుకు రావడం, వాళ్లు అరవింద చుట్టూ చేరి ఇంటికి రమ్మని వత్తిడి చేయడం, ఆమె వారిని గుర్తించలేక పోయేసరికి పెద్దపెట్టున తులసమ్మ ఏడవడం, రమామణి లాంటి ఇంకొందరు శరశ్చంద్ర శ్రేయోభిలాషులు ఆమెను వెళ్ళిపొమ్మని బెదిరించటం, అసలు నువ్వు యామినివి కాదనటం లాంటి సంఘటనల్ని భరించలేక గదిలో కెళ్లిపోయి తలుపులు మూసుకుని నిద్ర మాత్రలు మింగేసింది. శీనూ కుటుంబసభ్యుల్ని ఓదార్చే గొడవలో పడటం వల్ల, లోపల పడుకుని ఉందేమోలే అనుకోవటం వల్ల శరశ్చంద్ర గంట తరవాతగాని విషయం గమనించలేదు. వెంటనే అందరికీ నచ్చజెప్పి అప్పటికి పంపించేసి ఆమెను ప్రమాదం నుంచి రక్షించాడు.

"ఇంకోసారెవరైనా వచ్చి నువ్వు యామినివి కాదు అన్నారో వాళ్లను చంపి నేను చస్తాను" దృఢంగా ఉందామె స్వరం.

"ఒకరితో నీకేమిటి? మనస్ఫూర్తిగా నేనంటున్నాను. నువ్వు నా యామినివే. ఆ దేవుడొచ్చి కాదన్నా వినను ఓకే? "

ఆ పరిస్థితిలో ఆమెతో ఎలా మాట్లాడాలో అలా మాట్లాడాడు శరశ్చంద్ర.

"శరత్!" మెత్తగా పిల్చింది అరవింద.

"ఊఁ..."

"మొన్న మన మేరేజ్‌డే నాడు నువ్వేమన్నావో గుర్తుందా? "

"ఏమన్నాను? " నొసలు ముడివేశాడు.

"నేను శరత్తుని, నువ్వు యామినివి. శరత్కాలపు రాత్రిలో విరిసిన వెన్నెల మన జీవితం. యామిని ఉన్నంతవరకూ వెన్నెల కాస్తూనే ఉంటుంది. యామిని లేనిరోజు వెన్నెల కూడా ఉండదు. అన్నారు అవునా? "

శరశ్చంద్రకు తల తిరిగిపోయింది. క్రితం నెల ఇరవయ్యారో తేదీన జరుపుకున్న ఇరవై రెండో మేరేజ్ యానివర్సరీనాడు బెడ్‌రూమ్‌లో ఎవరూ లేని ఏకాంతంలో అక్షరాలా యామినితో తను అన్న మాటలివి.

శరశ్చంద్ర శరీరం మీద వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

ఈమెను నిజంగానే... యామిని ఆత్మ ఆవహించిందా!

"ఆ మాట ఎన్నటికీ మరచిపోనని, నా చేతిలో చెయ్యి వేసి చెప్పు శరత్"

శరశ్చంద్ర ఆమెవంకే కన్నార్పకుండా చూస్తూ అప్రయత్నంగా ఆమె చేతిలో చెయ్యే శాడు.

ఆమె అరచేతిలో నుండి ఏదో శక్తి విద్యుత్ లాగా ప్రవహించి తన శరీరంలోకి చొచ్చుకో వడం ఆయనకు అస్పష్టంగా తెలుస్తోంది.

"నో! నేనింక ఎవరి మాటలూ నమ్మను. స్వర్గలోకపు అంచుల దాకా వెళ్లిపోయి కూడా తిరిగి నా కోసం మళ్లీ వచ్చిన నా యామిన్ని అవివేకంతో దూరం చేసుకోను".

కలలోలాగా తనలో తను మాట్లాడుకుం టున్న శరశ్చంద్ర కేసి కళ్లు విప్పార్చి చూసింది అరవింద. ఆమె కనుపాపలు వెయ్యి వోల్టుల కాంతితో వెలుగుతున్నాయి.

## 8

ఇంటి ముందు ముగ్గు పెడుతున్న శ్రీదేవి మారుతీ ఎస్టీమ్ వచ్చి గుమ్మం ముందు ఆగేసరికి ఆశ్చ ర్యంగా చూసింది.

డ్రైవర్ డోర్ తెరిచి పట్టుకున్నాడు. శరశ్చంద్ర కారు దిగి ఓ సారి శ్రీదే వికేసి ఆపైన ఇంటికేసి చూశాడు.

శ్రీదేవి ఆయన్ని గుర్తుపట్టేసింది. చేతిలోని ముగ్గుగిన్నె పక్కన పెట్టేసి సంభ్రమంగా చూస్తూ ఆయన్ని ఇంట్లోకి ఆహ్వానించింది.

తులసమ్మ వంటింట్లో కాఫీ పెడు తోంది. వసంత పెరట్లో అంట్లు తోముతోంది. శీను ఇంకా లేవకుండా పక్క మీద అటూ ఇటూ పొర్లుతు న్నాడు.

శ్రీదేవి ఆయన్ని కుర్చీ వేసి కూర్చో బెట్టి ఇంటిల్లిపాదికీ ఉప్పందించేసింది. తులసమ్మ స్టౌ ఆర్పేసి కొంగు భుజం నిండా కప్పుకుని ఇవతలికి వచ్చింది. వసంత అంట్ల గిన్నెలక్కడ పడేసి పరుగు లాంటి నడకతో వచ్చి శరశ్చం ద్రను చూసి గడపవతలే ఆగిపో యింది. శ్రీను హడావుడిగా లేచి లుంగీ సర్దు కుని, క్రాపు దువ్వుకుని హాల్లోకి వచ్చి ఆయ నకు నమస్కారం పెట్టాడు.

"ఏమంటోంది బాబూ అమ్మాయి? దానికి ఈ అమ్మ గుర్తొచ్చిందా?" దుఃఖాన్ని ఆపు కుంటూ అడిగింది తులసమ్మ. అప్పటికి ఆ యింటికి అరవింద దూరమై వారం కావ స్తోంది. అరవింద ఆత్మహత్యా ప్రయత్నం తరవాత ఓ సారి శీను వెళ్లినా అతణ్ణి చూడ్డా నికి ఆమె నిరాకరించింది.

శరశ్చంద్ర తులసమ్మ కేసి జాలిగా చూశాడు "కన్నకడుపు బాధ నాకు తెలుసమ్మా కానీ... మనసు



కఠినపరచుకోక తప్పదు".

"చెప్పడమంత తేలిక్కాదులెండి. మనసు రాయి చేసుకోడం" వసంత అక్కసుగా అంది.

ఆమెలో అనుమానం ఉంది. 'ఎప్పుడో యాక్సిడెంటల్‌గా అక్కను చూసి ఈ శరశ్చంద్ర మనసు పడ్డాడేమో! అందుకే ఈ నాటకమంతా ఆడిస్తున్నాడేమో!" అని కానీ ఆ నాటకానికి అరవింద ఎందుకు ఒప్పుకుంటుందనేది శేష ప్రశ్నగానే మిగిలి పోయిందామెలో.

శరశ్చంద్ర వసంత వంకోసారి చూసి మళ్లీ తులసమ్మతో అన్నాడు "మీకో విషయం చెప్పాలని నేనింత దూరం వచ్చాను".

"చెప్పు బాబూ" ఎంత కాదన్నా కన్నకూతుర్ని కంటికి రెప్పలా చూసుకుంటున్నాడన్న కృతజ్ఞతా భావం ఉంది తులసమ్మలో.

"మా యింట్లో జోగయ్య అని ఓ నౌకరున్నాడు. వయస్సు డెబ్భై దాకా ఉంటుంది. పేరుకు నౌకరే గాని ఇంట్లో వ్యక్తిలా కలసిపోయాడతడు. చిన్నప్పటి నుంచీ నన్ను తన గుండెల మీద పెంచాడు. ఈ మధ్య నా భార్య పోయాక అతడికామె ఆత్మ రూపంలో కనబడ్డం మొదలైంది. అతడి ద్వారా నాతో మాట్లాడేది. నేనేం చెయ్యాలో, ఎలా నడుచుకోవాలో మొత్తం ఆమె చెప్పేది. అటువంటి సమయంలో మీ అమ్మాయి మా ఇంటికి రావడం జరిగింది. ఆత్మ రూపంలోని నా భార్య ఆమెని ఆవహించి ఉంటుందేమో అన్పిస్తోంది నాకు. దానికి రుజువేమిటంటే, కేవలం మా భార్య భర్తలిద్దరికీ మాత్రమే తెలిసిన విషయాలెన్నో ఆమె చెబుతోంది. మా బంధుమిత్రులందర్నీ ఇట్టే గుర్తుపట్టేస్తుంది. వాళ్లు తనకి చిరపరిచితులే అన్నట్టు వారితో మాట్లాడుతుంది. ఇంకోటేంటంటే మీ అమ్మాయి 'నేనే యామిన్ని' అనటం మొదలు పెట్టిన దగ్గర్నుండి మా జోగయ్యకు నా భార్య ఆత్మ కనబడ్డం మానేసింది. కాబట్టి మీ అమ్మాయిని నా భార్య ఆత్మ ఆవహించడం నిజమేనని నమ్ముతున్నాను నేను."

అంతవరకూ ఊపిరి బిగపట్టి వింటున్న తులసమ్మ గొల్లుమంది "ఇక దాని బతుకేం కావాలి బాబూ. పసివయసులో దాని ఖర్మిట్లా కాలిపోయింది" అంటూ.

ఆమెను ఏడవనిచ్చి మళ్లీ అన్నాడాయన "ఒకవేళ ఆత్మలూ అవీ హాస్యాస్పదం అనుకుంటే ప్రస్తుతం ఆమె పర్టిక్యులర్ మెంటల్ డిజార్డర్‌తో బాధపడుతోందనుకుందాం కాబట్టి ఆమెను అతి సున్నితంగా ట్రీట్ చెయ్యాల్సిన బాధ్యత మనకుంది. ఆ వైపు నుంచి చూసినా ఆమెను ఆమె ఇష్టానుసారం కొన్నాళ్లు వదలక తప్పదు".

"ఇప్పుడేం చేద్దామంటారు సార్? " వాడిపోయిన ముఖంతో అడిగాడు శీను.

"ఆమె తనంతటత తానుగా తనెవరో తెలుసుకునే వరకూ ఓపిక పడదాం. అంతవరకూ ఆమె నా భార్యగానే చెలామణి అవుతుంది".

ఉలిక్కిపడి చూసింది తులసమ్మ. అర్థం చేసేసుకున్నాడు శరశ్చంద్ర. "ఆమెలోని ఆత్మ మాత్రమే నా యామిని. భౌతిక శరీరం మీ కూతురిది. ఐ మీన్ అరవిందది. నాకు ఆత్మ రూపంలోని అరవింద అక్కర్లేదు. మీ బిడ్డను అమలినంగా తిరిగి మీ కప్పగించే బాధ్యత నాది".

తులసమ్మ రెండు చేతులెత్తి నమస్కారం పెట్టింది. వసంత కెందుకో ఉన్నట్టుండి ఆయన పట్ల ఎనలేని గౌరవభావం పొంగిపొరలగా "థేంక్స్ సర్" అంది.

శరశ్చంద్ర కాసేపు మౌనంగా ఉండిపోయి అన్నాడు "అరవింద వి అండ్ జెలో స్టెనో కదూ! మీ కుటుంబ భారాన్ని మోసేది కూడా ఆమేననుకుంటా"

శరశ్చంద్ర శీను వైపు చూశాడు. శీను కాస్త బిడియంగా అవునన్నట్టు తలూపాడు.

అంతవరకూ కేవలం కన్నబిడ్డ దూరమైన శోకంతో అల్లాడిపోతున్న తులసమ్మకు ఒక్కపెట్టున విరుచుకు పడబోతున్న ఆర్థిక సంక్షోభం కళ్లముందు మెదిలింది.

"అదే ఈదుకొచ్చేది బాబూ, ఈ సంసార భారాన్నంతా. నెలకు మూడువేలు తెచ్చి... నా దోసిట్లో పోసేది. ఇక మీదట ఈ బిడ్డల్ని

# చతుర భాషితాలు

జ్ఞానం లేని న్యాయబుద్ధి బలహీన మయినది. నిరుపయోగమైనది. న్యాయబుద్ధి లేని జ్ఞానం ప్రమాదకర మయినది. భయంకరమైనది.

-శామ్యూల్ జాన్సన్

అందంగా ఉండే దేనినైనా చూసే అవకాశాన్ని ఎన్నడూ విడనాడవద్దు. ఎందుకంటే సౌందర్యం- దేవుని చేతివ్రాత.

-ఎమర్సన్

చిన్న చిన్న పనులే విశిష్టతకు దారితీస్తాయి. కానీ విశిష్టత చిన్నది కాదు.

-మైకేలేంజిలో

మధ్య రకం మాట్లాడుతుంది. కానీ మేధావి వర్గం గమనిస్తుంది.

-బెంజమన్

పరిస్థితులను మనం అదుపులో ఉంచుకోవడంలోనే మగ తనం ఉంది.

-మహాత్మాగాంధీ

అడ్డంకులు లేని దారిని నువ్వు కనుగొనవచ్చు. బహుశ అది నిన్ను ఎక్కడికీ తీసుకువెళ్ళలేదు.

-ఫ్రాంక్‌క్లార్క్

పెద్దల వివేకాన్ని యువజనం అలవర్చుకోవాలి. యువజనుల హృదయం పెద్దలకు ఉండాలి.

-బాంగ్‌బాక్

మనల్ని మనం జయించగలగడం మాత్రమే చిరకాలం నిలుస్తుంది. ఈ విజయం ఎలాంటి విచారాన్ని కలిగించదు.

-నెపోలియన్

జ్ఞానాన్ని మార్పిడి చేసుకోవడమే సంభాషణ. జ్ఞానహీనతను మార్పిడి చేసుకొనటమే వాదం.

-అలెగ్జాండర్ కింగ్

వర్తమానం పట్ల మనుషులకు లక్ష్యం లేకపోతే, సమీప భవిష్యత్తులో వారికి దుఃఖం సంభవిస్తుంది.

-ఒ.పి. శర్మ

పరిస్థితులు కఠినంగా ఉన్నప్పుడు, బాగా సానబెట్టినప్పుడే ప్రకాశం వెలువడుతుందని గుర్తుంచుకో.

-ఇర్వింగ్

నేనేం చెయ్యాలో" అంది దిగాలు పడిపోతూ.

తల్లి అలా అనటం శ్రీదేవికి ఆత్మన్యూనతగా అన్పించింది. అందుకే వెంటనే అంది, తల్లి వంక చిరాగ్గా చూస్తూ "సరే ఇన్నాళ్లూ అక్క చూసింది, ఇక మేం లేమా'!"

శరశ్చంద్ర ఆమె వంక ముచ్చటగా చూసి తరువాత తులసమ్మతో అన్నాడు "మీ బాధలకు కొంతవరకు బాధ్యుణ్ణి నేనేనమ్మా. వి అండ్ జె ఎం.డితో మాట్లాడి అరవింద ఉద్యోగాన్ని వసంతకు మార్పించాలనుకుంటున్నా, మీకేమైనా అభ్యంతరమా? "

తులసమ్మ కళ్లు మెరిశాయి. "అభ్యంతరమెందుకు బాబూ! పిలిచి అన్నం పెడతానంటుంటే కాలదన్నుకుంటామా! అమ్మాయికి టైపు షార్ట్ హాండు వచ్చు. అలాగే చెయ్యండి. ఒక్క మాట బాబూ...ఆ చేత్తోనే మా శీను క్కూడా ఎక్కడైనా చూస్తే మీ ఋణం ఉంచుకోం. ఇక ఆఖరిది చిన్నపిల్ల, దాని సంగతి ఎప్పటికో చూడొచ్చు"

"ప్రయత్నిస్తానమ్మా" చెప్పాడాయన.

వసంత వెళ్లి గబగబ కాఫీ కలుపుకొచ్చింది. ఆ కాఫీ తాగి లేచాడాయన. అందరూ ఆయన వెనకే గుమ్మందాకా వచ్చారు.

ఆయన కారెక్కబోయి మళ్లీ వెనక్కొచ్చాడు. "జరిగిన దాన్లో నా ప్రమేయం లేకపోయినా బాధ్యత మాత్రం ఉందనుకుంటున్నా. అందుకే ఆధారాన్ని కోల్పోయిన మీకు అరవింద జీతం బదులుగా నెలకో ఐదువేలు ఇవ్వాలనుకుంటున్నా." ఆయన అలా చెప్పి శీను వైపు తిరిగాడు. "ప్రతినెలా ఫస్టున హాస్పిటల్ కొచ్చి మనీ కలెక్ట్ చేసుకో"

"వసంతకీ, నాకూ ఉద్యోగమిప్పిస్తున్నారుగా. మళ్లీ ఈ డబ్బు... ...

"ఇది స్వయంగా నాకు పుట్టిన ఆలోచన కాదయ్యా. మీ అరవింద చెప్పింది. వాళ్లెవరో అమ్మాయిని పోగొట్టుకుని కష్టాల్లో ఉన్నట్టున్నారు. నెలకింతని సాయం చెయ్యి శరత్ అంది. ఇక్కడ కూడా నేనామెలో యామిన్ని చూశా. నా మిసెస్... ఇతరుల బాధల పట్ల ఖచ్చితంగా ఇలాగే రియాక్ట్ అవుతుంది"

ఆయన కారెక్కి కూర్చున్నాడు.

"మేమెప్పుడైనా వచ్చి అక్కయ్యను చూడొచ్చా సార్" శ్రీదేవి కళ్లనిండా నీళ్లతో శరశ్చంద్ర వంక చూసింది.

"నో ప్రాబ్లం. మీ ఇష్టమొచ్చినన్ని రోజులు ఉండొచ్చు కూడా! బట్ అరవిందను యామినీ శరశ్చంద్రగా ట్రీట్ చేయగలిగితేనే. అదర్‌వైజ్... ఆమె ప్రవర్తన మరోలా ఉండొచ్చు"

అర్థం చేసుకుంది శ్రీదేవి. "అలాగే సార్" అంది.

కారు వెళ్లిపోయాక లోపలికి వస్తుంటే శ్రీదేవి చెవిన పడ్డాయా మాటలు పక్కింటి గోడవతల్నించి "ఆ పిల్ల మాత్రం ఎంతకాలం పడుంటుంది? ఈడూ జోడూ అనుకుంటే ఈ జన్మకు కుదురుతుందా? ఉప్పు కారం తినే ఒళ్లు కదూ! మొత్తానికి బ్రహ్మాండమైన నాటకం ఆడుతోంది. కోట్లకి వారసుడు, బంగళాలు, కార్లూ, పైగా డాక్టరు. వయసెక్కువైతేనేం! అయినా ఆయన వయసు మళ్లినవాడిలా లేనేలేడులే. నలభైలోపంటే నమ్మొచ్చు"

శ్రీదేవికి ఏడుపు తన్నుకొచ్చింది.




డియర్ అరవిందా!

అట్లాంటిక్ సముద్రాన్ని దాటి వెళ్లినా నువ్వు నాముందే ఉన్నావు. అనుక్షణం ఎదురొస్తూ, నన్ను నలిబిలి చేస్తున్నావ్. నాకు నా కుటుంబం ముఖ్యం నువ్వు కాదు అని తెగేసి చెప్పిన నిర్దయురాలిపైన నాకెందుకింత ప్రేమో అర్థం కాదు.

కంప్యూటర్ల మధ్య కూర్చుని పనిచేస్తున్నా, హృదయం మాత్రం విషాద గీతాలు పాడుతూనే ఉంది. కరిగిపోయిన నా కళ్లు కన్నీళ్లు పెట్టుకుంటూనే ఉన్నాయ్.

ఆ సాయంకాలం... హుస్సేన్ సాగర్ ఒడ్డున నువ్వు తీసుకున్న నిర్ణయంతో ఎవరి జీవి తం వాళ్లదైపోయిందనుకున్నాను. కానీ అసలు ప్రేమంటే ఏమిటో ఇప్పుడే తెలుస్తోంది. నువ్వు నాకున్నావనుకున్నప్పుడు... నీ మది మమకారపు లోతు ఎంతో తెలీలేదు. నువ్వు నాకు లేని ఇప్పుడు మాత్రం అందులో కంఠం వరకూ మునిగిపోయాను. ఊపిరందక గిలగిల కొట్టుకుంటున్నాను. నాకు చావంటే ఇష్టంలేదు. జీవితం చివరి వరకూ. బతకాలనుంది అయితే ఈ బతుకు నీకోసం మాత్రమే నిర్దేశించబడాలి. లేదంటే మాత్రం అది నాకక్కర్లేదు.

అరవిందా! ఇప్పటికైనా మించిపోయింది లేదు. నా కోసం నీ చేతులు ఒక్కసారి చాపితే చాలు... ఎగిరొచ్చి నీ గుండెల్లో ఇమిడిపోతాను.

నా కోసం నీ కుటుంబాన్ని నిర్లక్ష్యం చెయ్యమని నేనన్నానా? మన పెళ్లితో నీ కుటుంబం, నా కుటుంబం అవుతుందని కదూ నేనన్నది? అర్థం చేసుకోవేం! నన్ను నన్నుగానే నీకు సమర్పించుకుంటాను తప్ప... నా బాధ్యతలు నీకు చుట్టబెట్టనంటావ్. బంధం ఉన్న చోటే బాధ్యత ఉంటుంది. నాకా బంధాలు, బాధ్యతలూ కావాలి.

అరవిందా... నా కోసం నీ నిర్ణయం మార్చుకుంటావ్ కదూ! నువ్వు కాదన్నావన్న కోపంతో అబ్రాడ్ వెళ్లిపోయాను కానీ నువ్వు 'ఊ' అంటే క్షణాల్లో ఇండియా కొచ్చేస్తాను. అమెరికా జీవితం కన్నా, ఇక్కడ ఉద్యోగం కన్నా,సంపాదించే డాలర్లకన్నా, అన్నిటి కన్నా, నువ్వు నాకు ముఖ్యం. ఆలోచించు అరవిందా.

నీ వంశీ

శ్రీదేవి ఆ ఉత్తరాన్ని అప్పటికి నాలుగు సార్లు చదివింది. ఆరోజు పోస్ట్‌లో అరవింద పేర్న వచ్చిందా ఎయిర్ మెయిల్.

"ఎక్కడ్నుంచే శ్రీదేవీ? " అనడిగింది వసంత... చాలాసార్లు.

చెప్పేద్దామా వద్దా అన్న డైలమాలో ఉంది శ్రీదేవి. "ఏం లేదులే" అనేసింది ఆమె అడిగినప్పుడల్లా. నాలుగోసారి చదివాక మాత్రం 'చెప్పేస్తే పోయేదేముంది? అరవిందక్కే ఇప్పుడు తమ మనిషి కాదుగా' అనుకుంది. అలా అనుకున్నప్పుడు గుండెలో సన్నగా ఏదో జెర్క్. మనసంతా గుబులుగా అన్పించింది.

"చెప్పవే" అంది మళ్లీ వసంత పనంతా ముగించుకుని వచ్చి శ్రీదేవి పక్కన కూర్చుంటూ.

"ఇది చదువు... నీకే అర్థమవుతుంది"

వసంత ఉత్తరం అందుకుని చదువుతోంది. వసంత చదువుతున్నంతసేపూ ఆమె ముఖకవళికల్నే గమనిస్తూ కూర్చుంది శ్రీదేవి. వసంత చదవడం పూర్తిచేసి ఆశ్చర్యంగా శ్రీదేవి ముఖంలోకి చూసింది.

శ్రీదేవి అంది "నా కితడి గురించి ముందే తెలుసు. మీతో అన్లేదు కానీ!"

"అతణ్ణి చూశావా? "

"అహఁ... ఓసారి అక్క టేబుల్ డ్రాయర్‌లో ఇతడు అక్కకు రాసిన స్లిప్ చూశాను"

"కంప్యూటర్ ఇంజనీరు. పైగా అమెరికా వెళ్లిన మనిషి. ఆ భోగాలన్నీ వద్దూ. అక్కే కావాలంటున్నాడంటే... అక్క చాలా అదృష్టవంతురాలు"

"అదృష్టవంతురాలెవరూ? " నొసలు ముడేసింది శ్రీదేవి.

"అరవిందక్క" చెప్పింది వసంత.

"అరవిందక్కా? అమెవరు? ఇప్పుడున్నది మిసెస్ యామినీ శరశ్చంద్ర"

శ్రీదేవి మాటలకు వసంత చేదుమింగినట్లు పెట్టింది ముఖం. కాసేపు మౌనంగా ఉండిపోయి చెల్లెలితో అంది "నాకు నా కుటుంబం ముఖ్యం. నువ్వు కాదు అందని కదూ అతడు రాశాడు! అవును శ్రీదేవి... కుటుంబం కోసం అంతలా ప్రేమిస్తున్న వ్యక్తినే వదిలేసిన అక్క, ఇప్పుడు ముక్కూమొఖం తెలీని మనిషికోసం కుటుంబాన్నే వదిలేసిందంటే నాకెందుకో అక్కను నిజంగానే యామిని ఆత్మ పట్టేసిందేమో అన్పిస్తోంది"

నిన్నటి వరకూ 'ఒకవేళ ఏదైనా కారణం

చేత అక్క నటిస్తుందేమో' అన్న అనుమానం ఉంది వసంతలో. ఇప్పుడది తుడిచి పెట్టుకు పోయింది.

"ప్చ్... ఆ దరిద్రపు డైరీ అక్కకు దొర క్కున్నా బాగుండేది. దానివల్లే ఇది వాళ్లింటికి వెళ్లటం... ఇలా జరగటం ఇదంతా డైరీలోనే ఉంది" నిట్టూర్చింది శ్రీదేవి.

"మొన్నటిదాకా ఆత్మలూ గీత్మలూ లేవనుకు నేవాళ్లం, లీలావతిని చూసి నవ్వుకున్నవాళ్లం"

"అలా నవ్వుకోబట్టేనేమో... మన ఖర్మిలా కాలింది"

"మనకేంటే శ్రీ... అక్క ఉద్యోగం నాకొచ్చే సింది. రేపోమాపో శీను క్కూడా శరశ్చంద్ర గారు ఉద్యోగం చూస్తారు. ఇవన్నీకాక అక్క లేకపో యినా ఆమె జీతం మాత్రం మనకు ఠంచన్‌గా ముట్టచెబుతున్నారా! ఖర్మ కాలింది అక్కకే. 'నా' అనేవాళ్లకి దూరమై... తనెవరో తనకే తెలీని స్థితిలో..." వసంత గొంతు జీరబో యింది.

శ్రీదేవి క్కూడా కళ్లు చెమర్చాయి. "అయితే ఆత్మలుండటం నిజమే. పాపం లీలావతి అ మాయకురాలేనేమో!"

"అంతే అన్పిస్తోంది శ్రీదేవీ"

"ఇప్పుడీ ఉత్తరాన్ని ఏం చేద్దాం? " శ్రీదేవి అడిగింది.

"ఓ పనిచేస్తే!" వసంత ఉత్సాహంగా చూసింది. "పట్టుకెళ్లి అక్కకి చూపిద్దాం చదివి ఏం చేస్తుందో చూద్దాం"

"శరశ్చంద్ర గారేమనుకుంటారో!"

"ఏమనుకుంటారు? ముందాయ నకు విషయం చెప్పే ఆలో చిద్దాం. అక్కను చూసి కూడా చాన్నాళ్ళయింది.

"శీనుకి అమ్మ క్కూడా చెప్పి చేద్దాం" శ్రీదేవి అంది.

**ముక్కూ మొఖం తెలీని మనిషికోసం కుటుంబాన్నే వదిలేసిందంటే నాకెందుకో అక్కను నిజంగానే యామిని ఆత్మ పట్టేసిందేమో అన్పిస్తోంది**

"అక్క రియాక్షన్ చూశాక ఈ వంశీ అనే అతడికి మనం రిప్లై రాద్దాం"

"అంతంతే, అదే బెస్ట్" ఒప్పుకుంది శ్రీదేవి.

* * *

వంశీ ఉత్తరం అందిన మర్నాడు సాయం కాలం అయిదు గంటలకి శ్రీదేవి, వసంత ఆ ఉత్తరం పట్టుకుని శరశ్చంద్ర ఇంటికెళ్లారు.

ఆరోజు ఆయనకు లెటర్ చూపించి విషయం వివరించి" "మా అక్కకు చూపించ మంటారా? " అనడిగారు.

"నిరభ్యంతరంగా చూపించండి. ఇది చూశా కైనా ఆమె మామూలు మనిషైతే సంతోషించే వాళ్లలో నేను మొదటివాణ్ణి అవుతాను" అన్నా డాయన.

"ఏంటి శరత్. ఇంకా అలాగే కూర్చున్నావ్. తమరు ఫ్రీ అయ్యేదే ఆదివారం. దట్ టూ ఓన్లీ ఈవెనింగ్ సెషన్. పిక్చర్‌కి ప్లాన్ చేసు కున్నాం. మరిచిపోయావా? " అంటూ మెట్లు దిగుతున్న అరవిందకేసి ఆశ్చర్యంగా చూశారు వసంతా, శ్రీదేవి.

అరవింద... అంత మామూలుగా, అచ్చం తనే యామినైనట్టూ ఆయనతో అంత గారాంగా మాట్లాడ్డం ఏమిటో ఎబ్బెట్టుగా, ఇబ్బందిగా అన్పించింది వాళ్లకి.

అరవింద నేరుగా హాల్లోకి వచ్చి వాళ్లిద్దర్నీ అప్పుడే గమనించినట్టు చూసింది.

ఆమె చూసిన చూపులో 'అక్క' కనబడ లేదు. 'యామిని' సాక్షాత్కరించినట్టనిపించ డంతో ఇద్దరూ చప్పున లేచి విష్ చేశారు.

"పర్లేదు, కూర్చోండి. ఏంటీ విషయం? " శరశ్చంద్ర కూర్చున్న సోఫాలోనే ఆయన పక్కన కూర్చుని ఠీవిగా చూసింది.

శ్రీదేవికి 'విషయం' చెప్పడానికి ధైర్యం చాల్లేదు. వసంతకేసి పాలుపోనట్టు చూసింది. వసంత 'నువ్వే చెప్పు' అన్నట్టు సైగ చేసింది. ఆ ఇద్దరి అవస్థ అర్థం చేసుకున్నట్టుగా శర శ్చంద్ర అన్నాడు అరవిందతో "వీళ్లిద్దరూ నీకు గుర్తున్నారా యామినీ? "

"ఎందుకు గుర్తులేరు. నన్నే వాళ్లక్కయ్యను కుని నానా హంగామా చేసిన చెల్లాయిలు కదూ!" నవ్వుతూ ఆయనతో అని వసంతకేసి

చూసింది "మీ అక్కయ్య కనబడిందా? "

వసంత చప్పున లేదన్నట్టు తలాడించింది. శ్రీదేవి అంది "ఓ విషయంలో మీ సలహా తీసుకుందామని వచ్చామండీ"

"సలహాలివ్వటం ప్రాణాంతకం" జోక్ చేసింది అరవింద.

శ్రీదేవి బిక్కముఖం వేసేసరికి మళ్లీ తనే "జస్ట్ జోక్. నీ ప్రాబ్లం ఏమిటో చెప్పమ్మా" అంది దయగా.

"అది కాదండీ... మా అక్కయ్యకు అమెరికా నుండి ఓ ఉత్తరం వచ్చింది. మా అక్క లేదుకదండీ. అందుకని మేమది చదవాల్సి వచ్చింది. అక్క తరఫున రిప్లై ఇవ్వాలి కదా. ఎలా ఇస్తే బాగుంటుందోనని!"

"అది మీరే ఆలోచించుకుంటే సబబుగా ఉంటుందేమో! ఎవరిదో పరాయివాళ్ల ఉత్తరం చదివి నేను సలహా ఇవ్వటం అంత బాగుండదు. కనీసం మా వారికొచ్చిన ఉత్తరాలు కూడా అనుమతి లేకుండా చదివే అలవాటు నాకు లేదు"

"ఇది చదవటానికి మా అనుమతి ఇస్తున్నాం కదండీ. ఎంత పరాయి వాళ్లమైనా మీ సలహా కోరి వచ్చాంగా" షార్ప్‌గా చూసింది శ్రీదేవి 'పరాయి' అన్న పదాన్ని నొక్కి పలుకుతూ.

వెంటనే శరశ్చంద్ర అందుకున్నాడు "పాపం... వాళ్ల ఆలనా పాలనా చూసుకునే అక్కయ్య మిస్సయి వాళ్లు బాధల్లో ఉన్నారు. ఆమె రూపురేఖలు నీలో చూసుకుని నువ్వే 'అక్క' అన్నంత అభిమానంగా వచ్చారు. చిన్న పిల్లలు జస్ట్ చదివి సలహా ఇస్తే ఏం పోతుంది యామినీ? "

అరవింద అయిష్టంగానే ఉత్తరం అందుకుంది. అయిదు నిముషాల్లో ఆమూలాగ్రం చదివి అంది "పాపం... అతడెవరోగాని వర్రీయింగ్ ఎలాట్ ఫర్ యువర్ సిస్టర్... బట్ షిగాట్ లాస్ట్. ఎనీవే, ఉన్నదున్నట్టు రాయడం మంచిది"

"ఉన్నదున్నట్టు అంటే..." అడిగింది వసంత.

"అదే... మీ అక్కయ్య అరవింద తప్పిపోయిన వైనం రాస్తే అతడి లైఫ్ అతను సెట్ చేసుకుంటాడు. కనబడని మనిషి కోసం అతణ్ణి ఇంకా వెయిటింగ్‌లో పెట్టడం అనవసరం"

మధురం కాఫీ కప్పులున్న ట్రే తెచ్చిపెట్టింది. శ్రీదేవికి కాఫీ తాగాలని కూడా అన్పించలేదు. కప్పు చేతిలో పట్టుకుని అలాగే ఉండిపోయింది, అరవిందకేసి కన్నార్పకుండా చూస్తూ.

శ్రీదేవికి ఆశ్చర్యంగా ఉంది. ఆ లెటర్ చదువుతున్నంత సేపూ ఆమె అరవింద ముఖ కవళికల్ని పట్టిపట్టి చూస్తోంది. ఏ మార్పూ లేదు. జస్ట్... సానుభూతి మాత్రం కనబడింది.

'రియల్లీ... షి ఈజ్ పొసెస్డ్ బై సమ్ స్పిరిట్ దటీజ్ యామినీస్' అనుకుంది.

అరవిందగా చూపాల్సిన ఎక్స్‌ప్రెషన్సేం ఆమెలో లేవు. యామినిలో ఉండే డిగ్నిటీ, గ్రిప్ తప్ప. ఇతరుల పట్ల జాలితో ఎవరైనా ఎలా స్పందిస్తారో అచ్చం అలాగే స్పందించిందామె.

"మీ అక్కయ్యను వెదకటంలో, నా వంతు సాయం చేస్తాలే" శ్రీదేవి అవుటాఫ్ మూడ్‌లో ఉండటం చూసి ఊరడించింది అరవింద.

"ఖచ్చితంగా అలాగే రాయమంటారా? " అడిగింది వసంత, ఇంకా ఆశ చావక.

"రాసేస్తేనే మంచిది. లేదనుకోండి పాపం. అతడు విక్టిమ్ అవుతాడు. ఎంతో పైకి రావాల్సిన వ్యక్తి. ఈమె ధ్యాసలో పడి నాశనమైపోతాడు. నిజం రాశారనుకోండి, భరించలేక నాల్రోజులు ఏడుస్తాడు. ఆనక లైఫ్‌తో రాజీపడతాడు"

"ఒకవేళ... మేమతనికి అలా రాసేశాక మా అక్కయ్య కనబడితే? " వసంత అంది.

"ఓ.c... అదీ పాయింటే. నేను లాజికల్‌గా మాత్రమే ఆలోచస్తున్నాను. అదీ అతడి వైపు నుంచీ. ఐయామ్ సారీ... అందుకే అన్నా సలహాలివ్వటం ప్రాణాంతకం అని" నవ్విందామె. నవ్వి మళ్లీ అంది

"కాస్త లోతుగా ఆలోచించి మీరే ఓ నిర్ణయానికి రండి"

ఇద్దరు లేచారు వెళ్లొస్తామని. గుమ్మం దాటుతున్నప్పుడు వినపడిందామె గొంతు. శరశ్చంద్రతో అంటోంది "పూర్ గాల్స్... వాళ్లకి మనం కాస్త సపోర్టివ్వాలి శరత్, అన్ని విషయాల్లో ముఖ్యంగా ఆర్థికంగా"

అక్కడ్నించి వచ్చేశాక తర్జన భర్జనలు పడి... 'అరవింద యామినిగా' మారటం అన్న నిజాన్ని వంశీకి రాస్తూ కూర్చుంది శ్రీదేవి. మధ్యలో ఆపి "ఏమో, అక్క యామినిగా మారటం అన్న వింత ఎంత మామూలుగా జరిగిందో అంతే మామూలుగా ఉన్నట్టుండి అక్క తనకు తాను అరవిందగా ఐడెంటిఫై చేసుకుంటుందేమో! ఎవరు చూడొచ్చారు!" శ్రీదేవి అంది.

"అయితే ఇప్పుడేం చేస్తానంటావ్?"

"అక్క... స్వయంగా రాసినట్టు రాస్తాను"

"అక్క రైటింగ్ అతడికి తెలుసుంటుందిగా"

"టైప్ చేయించి అక్క సంతకాన్ని ఫోర్జరీ చేస్తా"

"ఏం రాస్తావ్? అమెరికా నుండి వచ్చేయ్. నిన్ను పెళ్లాడతాను అని రాస్తావా?"

"అలా రాస్తే... అతనొచ్చేస్తాడు. ఇక్కడ అక్కా దక్కక అటు అమెరికాలో జాబ్ పోగొట్టుకుని రెంటికీ చెడ్డ రేవడు అవుతాడు. ఆవిడన్నట్టు అతన్ని విక్టిమ్ చెయ్యడం బాగోదు" శ్రీదేవి అంది.

"ఆవిడా?" ఎవరావిడ అన్నట్టు చూసింది వసంత.

"ఆవిడేలే... యామినీ శరశ్చంద్ర. ఎందుకో ఆకారం 'అక్క'లా ఉన్నా మానసికంగా ఆమె దూరంగానే అన్పిస్తోంది నాకు".

శ్రీదేవి అప్పటికి రాయడం ఆపేసింది. ఆ రాత్రి పడుకున్నా నిద్రపట్టలేదు ఇద్దరికీ.

"శ్రీనూ ఇచ్చిన సలహా నాకు నచ్చింది" అంది అర్ధరాత్రివేళ వసంత.

"అలాగే రాయమంటావా అయితే?" శ్రీదేవి పక్కమీంచి లేచి కూర్చుంది.

"ఊc" అంది వసంత.

శ్రీదేవి అప్పటికప్పుడే రాయడానికి ఉపక్రమించటం చూసి వసంత అంది "రేపు రాయొచ్చులే పడుకోవే".

"నాకు నిద్రపట్టటంలేదు. రాసేస్తాలే"

శ్రీదేవి మొదలెట్టింది-అచ్చం అరవింద రాసినట్లుగానే.

వసంతకు ఉద్యోగం వచ్చిందనీ, శీనుకి కూడా చూస్తున్నామనీ, త్వరలోనే తన బాధ్యతలు తీరతాయనీ, అప్పటి వరకు ఓపిక పట్టమనీ రాసి చదవమని వసంతకి ఇచ్చింది.




కాలం తెచ్చే మార్పులూ చేసే మహిమలూ అన్నీ ఇన్నీ కావు అన్నదానికి నిదర్శనం అరవింద జీవితం.

ఓ వసంతం చిగురించి చూస్తుండగానే గ్రీష్మమై మండిపోయి, వర్షంలో కరిగిపోయి, వెన్నెల పూలను విరగబూసి... చలికి రెక్కలు ముడిచి ఉడిగిపోయి... మళ్లీ వసంతమై చిగుళ్ళేసి...

ఆరారు రుతువులూ గడచిపోయేలోగా అరవిందనందరూ మరచిపోయారు. ఆమె ఇప్పుడు యామినిగానే గుర్తించబడుతోంది.

"యామినీ... నా స్లైట్ ఎక్కడ? యామినీ బీరువాలోంచి ఓ పదివేల క్యాష్ తీసివ్వు. యామినీ... హెడ్డేగ్గా ఉంది కాస్త కాఫీ ఇవ్వు. యామినీ సాయంత్రం... ఆ అనాథ శరణాలయం యానివర్సరీకి వెళ్లాలి గుర్తుందా? యామినీ... మా చెల్లాయ్ కూతుర్ని అదే... మన మేనకోడల్ని ఇక్కడొదుల్తుందట...నీ ఇష్టం, చెప్పు

యామినీ... యామినీ... యామినీ... శరశ్చంద్ర పూర్తిగా ఆమె మీద డిపెండ్ అయిపో

తున్నాడు. ఆమెను అరవిందగా ఐడెంటిఫై చెయ్యడం... ఎప్పుడో మానేశాడు.

"శరత్... మరీ పేషెంట్స్‌కే అంకితమై పోతున్నావ్. టేక్ కేర్ ఆఫ్ యువర్ హెల్త్... శరత్... మన డ్రైవర్ కూతురు పుష్పవతయ్యిందట. ఓ గొలుసు చేయిద్దామా? శరత్... మరీ స్ట్రెయిన్ అవ్వకు...చూడూ ఎంత అలసటగా ఉన్నావో... ఝండూబామ్ రాయనా? శరత్...ఏంటీ అన్నం తిన్లేదట? నువ్వు తినకుంటే నేనూ తినను. శరత్... ఎందుకమ్మా అలా ఉన్నావ్. ఎనీ ప్రాబ్లమ్? అయ్యో షర్ట్ బటన్ ఊడిందే. స్టిచెస్ వేస్తానాగు"...

శరత్... శరత్... శరత్.

అతడి జీవన వృక్షానికి అరవింద లతలా అల్లుకుపోతోంది.

ఆ రోజు ఉదయాన్నే తులసమ్మ వచ్చింది.

"పిల్లాడికి అమ్మాయి నచ్చింది యామినమ్మా కానీ..."

నసిగిందామె.

"కానీ... కట్నం అడుగుతున్నాడు. అంతేనా?" నవ్వింది యామిని.

తులసమ్మ తలూపింది అవునన్నట్టూ.

"ఎంత?"

"వాళ్లు ఒకటి అంటున్నారు. మేం యాభై వేలకు అడుగుతున్నాం. డెబ్బై... డెబ్బై అయిదైతే కుదిరి పోయేట్టుంది?"

"అంత బేరాలెందుకు? లక్షా ఇస్తామని చెప్పండి. అత్తింట్లో మీ పిల్ల గౌరవంగా ఉంటుంది"

"అంత డబ్బు..." ఆమె బేలగా అరవింద వైపు చూసింది.

"ఓ లక్ష కట్నం కిందా, ఓ లక్ష ఖర్చులకీ... సరిపోతాయా?"

తులసమ్మ మాటలు పట్టించుకోకుండా అంది అరవింద.

తులసమ్మ కళ్లలో నక్షత్రాలు మెరిసి... అవి కన్నీళ్లుగా చెక్కిళ్ల మీదకు జారాయి. అంతు తెలీని ఆనందంలో ఒళ్ళు మరిచిపోయి అనేసింది. "అమ్మా... అరవిందా... నీదెంత మంచి మనసు తల్లీ"

## హాస్యం పరమౌషధం



నవ్వడం ఒక భోగం, నవ్వించడం ఒక యోగం, నవ్వలేక పోవడం ఒక రోగం.

హాస్యం మనిషిని కడుపుబ్బ నవ్విస్తుంది. మన లోపలి వ్యాధుల్ని నయం చేస్తుంది. కామెడీ సినిమాలు చూస్తే గుండె జబ్బులు తగ్గుతాయని పరిశోధించి నిరూపించారు మేరీల్యాండ్ యూనివర్శిటీ పరిశోధకులు. కామెడీ సినిమాలు చూడటం వల్ల మెదడు విశ్రాంతి పొంది వత్తిడిని పెంచే రసాయనాలు యాంటిసాల్, ఎడ్రినాల్ ఉత్పత్తిని తగ్గించి రక్తప్రసరణ పెంచుతుంది. సినిమాలే కాదు, నవ్వు పుట్టించే జోక్స్, కథలు కూడా వత్తిడిని తగ్గిస్తాయి. మేరీ ల్యాండ్ యూనివర్శిటీ పరిశోధకులు పలువురు హృద్రోగులకి కామెడీ సినిమాలు చూపించి, వాళ్ళలో ఉన్న వత్తిడి తగ్గేలా చేశారు. కడుపుబ్బ నవ్వించే హాస్యరస భరిత చిత్రాలు నేడు సి.డి.ల రూపంలో, వెబ్ సైట్లలోనూ లభ్యమవుతున్నాయి. విదేశాల్లో వీటికిపుడు డిమాండ్ రోజు రోజుకీ పెరిగిపోతోంది. అందుకే... మనవాళ్ళు 'లాఫింగ్ క్లబ్బు'లంటూ మౌన చక్రవర్తుల్ని సైతం... పగలబడి నవ్వించే ప్రయత్నం చేస్తున్నారు.

చార్లీ చాప్లిన్, లారెల్ హార్డీ, లేటెస్ట్‌గా మిస్టర్ బీన్... వంటి వాళ్ళు నిత్యం మనకి ఏదో ఒక టి.వి. ఛానెల్లో దర్శన మిస్తుంటారు. ఇక మన చిత్రాల్లోని హాస్యంలో చవక బారుతనం ఒక పాలు ఎక్కువే అయినా చేసేదేముంది...గుడ్డిలో మెల్ల అని సరిపెట్టుకుంటూనైనా ఆ హాస్యాన్ని ఆస్వాదించండి, ఆలస్యం చేయకండి. కామెడీ ఖరీదైపోతుంది.

అరవింద నవ్వింది. "అదో ఆ బంధమే నండీ నన్ను కట్టి పడేసింది. పోయిన మీ బిడ్డను నాలో చూసుకుంటున్నారు. అందుకే నేమో... మీ కుటుంబాన్ని చూస్తుంటే నాకు చాలా ఆత్మీయంగా అన్పిస్తుంది. నగలూ నాణాల గురించి మీరేం వర్రీ కాకండి. అవన్నీ నేను చేయిస్తాను"

"నువ్వు మనిషివి కాదమ్మా. మా పాలిట దేవతవు"

"అంత మాటనకండి. కోట్ల రూపాయ లకు నేనూ ఆయనా మాత్రమే వార సులం. మేం పోయాకా మా ప్రాపర్టీని అనుభవించేది ఎవరో మాకు తెలీదు. అఫ్‌కోర్స్ మా ఆస్తుల్ని అనాథలకూ, పేద సాదలకూ మా తదనంతరం ధారాదత్తం చేద్దామన్న నిర్ణయం మేమెప్పుడో తీసుకున్నామను కోండి. అందుకే ఉన్నప్పుడే నలుగురి ఇళ్లలో దీపాలు పెట్టి ఆనందపు వెలు గుల్ని పంచుకోవాలను కుంటున్నాం. అంతే గాని మీరంతగా పొగ డాల్సినంత గొప్పవాళ్లం కాము"

అక్కడే కూర్చుని ఈ సంభాషణంతా వింటున్న శ్వేతకి ఒళ్లు మండిపోయింది. ఆ అమ్మాయి రమామణి. కూతురు. ఓ రెండు నెల్లపాటు అన్నయ్య దగ్గరే ఉండిపోయి అరవిం దను దొంగను పట్టినట్లు పట్టాలని శతవిధాల ప్రయత్నించి విఫలురాలై వెళ్లిపోయిన రమా మణి అవసరం లేకపోయినా కూతుర్ని మేన మామ దగ్గర అట్టి పెట్టేసింది. ఇక్కడే ఉండి చదువుకొంటోం దా పిల్ల. అది చూసి మరి కొందరు బంధువులు వాళ్ల తాలూకు మను షుల్ని అక్కడ వదలాలని చూశారు కానీ శర శ్చంద్ర ఒప్పుకోలేదు.

శ్వేత మనసులో లెక్కలేసింది "కట్నం లక్షా... ఖర్చుకి లక్షా... పైన జ్యూవెలరీ... బాప్‌రే" గుండెలు బాదుకుంటూ శరశ్చంద్ర గదిలోకెళ్లిందా అమ్మాయి.

శరశ్చంద్ర తన గదికి అటాచ్డ్‌గా ఉన్న బాత్‌రూమ్‌లో స్నానం చేసి అప్పుడే బయటికి వచ్చాడు.



"చూడండి మామయ్యా... ఆ అరవింద ఎవరో తులసమ్మని ఓ ముసలావిడొస్తే ఆవిడకి లక్షల రూపా

యలు ఇస్తానని వాగ్దానాలు చేస్తోంది!"

"ఆ ముసలావిడ ఎవరో కాదమ్మా... మీ అత్తయ్యకు కన్నతల్లి. ఆమె కాలం కలిసి రాక... కన్నబిడ్డ దూరమైంది. ఇలాగైనా తల్లి రుణం తీర్చుకోనీ"

"ఏమిటి ఋణం తీర్చుకునేది? నీ డబ్బంతా వాళ్లకు దోచి పెట్టడమా? "

"నా డబ్బా... అత్తయ్య డబ్బా అని వేర్పాటేముంది శ్వేతా? "

"అత్తయ్యా... అత్తయ్యా అని పదే పదే అనకు మామయ్యా. నాకేంటో ఎబ్బెట్టుగా ఉంది"

"ఇతరులకెలా ఉన్నా నాకిబ్బంది లేదు. ఆమెలో యామిని ఆత్మ ఉన్నంత కాలం ఆమె అరవింద కాదు"

"అత్తయ్య ఆత్మ ఆ మహాతల్లిని విడిచి పెట్టేలోగా మీ ఆస్తి హారతి కర్పూరం అయ్యేట్టుంది"

"అంతకన్నా కావలసిందేముంది శ్వేతా! నా ఆస్తి పేదసాదలకుపయోగపడుతూ దేవుడి ముందు వెలిగించిన హారతి కర్పూరంలా కరిగిపోవటం నేను అదృష్టంగా భావిస్తాను"

"అయితే ఇక మాకు మిగిలేది చిప్పేనన్న మాట"

శరశ్చంద్ర నవ్వాడు. "నీకెందుకు శ్వేతా! నీకు లేనిదేమిటి? మీ నాన్నకు ఒక్కగానొక్క కూతురివి. ఆయన ఆస్తిపాస్తులన్నీ నీవేగా".

శ్వేత ముఖం మాడ్చుకొని వెళ్లిపోయింది. అప్పుడే గదిలోకి వస్తున్న అరవింద విసురుగా దాటిపోతున్న శ్వేతను నవ్వుతూ చూసి శరశ్చంద్ర దగ్గరకు వచ్చింది.

"ఆ తులసమ్మ వచ్చింది శరత్. మొన్న నువ్వు సజెస్ట్ చేసిన సంబంధం సెటిల్ చేసుకుందామంటోంది. ఖర్చు దాదాపు..."

"నాకు చెప్పకు, నీ యిష్టం ఆ సెక్షన్ నీది. ప్రస్తుతం నాకు వేడి వేడి కాఫీ కావాలి"

అరవింద నవ్వుతూ కిందకు దిగొచ్చి కాఫీ పట్టుకెళ్లింది.

ఎంతమంది పనివాళ్లున్నా శరశ్చంద్రకు స్వయంగా కాఫీ ఇవ్వటం యామిని అలవాటు.

"సరే... నువ్ కాఫీ తాగేసి కిందకురా. నేనావిడతో మాట్లాడుతుంటాను"

"ఆగాగు" శరశ్చంద్ర కప్పులోని కాఫీని సాసర్‌లోకి పోసి ఆమెకిచ్చాడు.

అరవింద ఆయన కళ్లలోకి ప్రేమగా చూసి కాఫీ తాగేసి వెళ్లిపోయింది, తులసమ్మతో మాట్లాడ్డానికి.



* * *

అరవింద, శరశ్చంద్రా వసంత పెళ్లిలో పీటల మీద కూర్చుని కన్యాదానం చేస్తుంటే తులసమ్మ కళ్ల వెంట ఆనందభాష్పాలు రాలాయిగానీ, శ్రీదేవికి మాత్రం మనసు చేదుగా అన్పించింది.

వంశీని తనెప్పుడూ చూడకపోయినా అర

వింద పక్కన శరశ్చంద్ర ప్లేస్‌లో అతణ్ణి ఊహించుకోడానికి శతవిధాలా ప్రయత్నిం చింది.

పాపం... ఏం చేస్తున్నాడో! ప్రాణాలన్నీ అక్క మీద నిలుపుకుని మెలకువలో సైతం కలలు కంటూ ఎంతగా ఎదురు చూస్తున్నాడో అక్కతో జీవితాన్ని పంచుకునే క్షణాల కోసం! ఆ క్షణాలెప్పుడో చేజారి పోయాయని తెలుసు కుంటే అప్పుడతడి మానసిక పరిస్థితి ఎలా ఉంటుంది?

తనిప్పటికీ అక్క రాసినట్టూ ఉత్తరాలు రాస్తూనే ఉంది. నా ప్రాణం నువ్వూ నీ ప్రాణం నేనూ... నువ్వు బెంగపెట్టుకోకు. ఇప్పుడప్పుడే రావద్దూ... భవిష్యత్ పాడు చేసుకోకు. అమెరికా ఛాన్స్ అందరికీ రాదు, నీ కోసం నేనెంత కాలమైనా ఇలాగే ఎదురు చూస్తుంటా...' అంటూ మనసుకు ఏది తోస్తే అది రాసి అతణ్ణి సముదాయిస్తోంది. అతణ్ణి చిన్నపిల్లాడ్ని చేసి తాయిలం ఆశ చూపి స్తోంది. రేపు నిజం తెలుసుకుంటే గుండెలు పగిలేలా ఏడుస్తాడేమో!

అరవింద మారుతుందన్న ఆశ ఏ కోశానా కనబడ్డం లేదు. మరీ పెళ్లి పీటలు మీద అచ్చు భార్యాభర్తల్లా కూర్చుని కన్యాదానం చేస్తున్న ఆ జంటని చూస్తుంటే వంశీకి తనలా ఉత్తరాలు రాసి అన్యాయం చేస్తోందేమో అన్పి స్తోంది.

అక్క చెప్పినట్టూ ఉన్నదున్నట్టు రాసేసి ఉంటే బాగుండేదేమో!

కానీ తను అనుకున్నది మరొకటి. ఎప్పటి కైనా అక్క తనను యామిని అన్న భ్రమ లోంచి బయట పడుతుందేమో అన్న ఆశతో అతణ్ణి ఆశపెడుతోంది.

పెళ్లవగానే అరవింద శరశ్చంద్రతో పాటు కారెక్కి వెళ్లిపోతుంటే ఆ దృశ్యాన్ని చిత్రంగా చూస్తుండిపోయింది శ్రీదేవి.

"ఓ రకంగా అదృష్టవంతులే తులసమ్మా నీ బిడ్డలు. ఆ యామినెవరో గాని... ఏ జన్మ లోనో నీకు ఋణపడి ఉంది. ఇట్లా నీ బిడ్డ ద్వారా ఆ ఋణం తీర్చుకుంటోంది" ఎవరో అంటున్నారు తులసమ్మతో.

ఆ ఎవరోనే ఇంతక్రితం "అత్మా గీత్మా... అని తులసమ్మ కూతురు బ్రహ్మాండంగా స్టంట్ చేస్తోంది. ఆ డాక్టర్ని వెర్రి నాగన్నని చేసి వెంట తిప్పుకుంటోంది" అని చాటుగా అనడం వింది శ్రీదేవి.

ఎందుకో అరవింద మీద ఆకారణంగా కోపం వస్తోంది శ్రీదేవికి. అరవింద అరవిం దగానే ఉండి తమకసలు పెళ్లిళ్లే చెయ్యలేకపో యినా బాగుండేదేమో అన్పిస్తోంది.

అరవిందలో యామిని దూరడమేంటి? శర శ్చంద్ర భార్యగా ముద్ర పడటమేంటి? ఆయన డబ్బుని తమ కోసం ఖర్చు పెట్టడం ఏంటి? అందరూ నోటితో పొగుడుతూ నొసటితో వెక్కిరించడమేమిటో...అనుకుంది.

వసంత కాపురానికి వెళ్లిపోయింది.

కొన్ని రోజులకు వంశీ దగ్గర్నుండి మరో ఉ త్తరం వచ్చింది. అది చదివాక శ్రీదేవి ఓ నిర్ణ యానికొచ్చింది.

ఆ నిర్ణయాన్ని అమలు చేసేముందు ఒక్క సారి... అరవిందను కలవాలనుకుంది.

* * *

డైమండ్ సెట్ అలంకరించుకుని అద్దం ముందు కూర్చుని ఉంది శ్వేత.

రమామణి ఆమె వెనకే నిలబడి అద్దంలో కనబడుతున్న కూతురి ప్రతిబింబాన్ని మురిసి పోతూ చూస్తోంది. వసంత పెళ్లికి అరవింద జరుపుతున్న వైనం ఉత్తరంలో శ్వేత ప్రస్తావిం చగానే విషయాలు ఆకళింపు చేసుకోవడానికి పరిగెత్తుకొచ్చిందావిడ.

"అదెవత్తో... దాని పెళ్లి పుణ్యమాని మంచి గిఫ్ట్ కొట్టేశావ్" మెచ్చుకుంది కూతుర్ని.

"నిన్న మరో దానికి టెండర్ పెట్టా. నాకు స్పెషల్‌గా ఓ టయోటా కొనిమ్మని మామ య్యనడిగాను. దాన్నడిగి చెబుతానన్నాడు"

"ఏంటటా దాన్నడిగేదీ? నీ మేనమామ ఆస్తి... నీక్కాక ఎవరి కటా? ఎన్నాళ్లు సాగు తుందా దయ్యం నాటకం. ఈ ఇంట్లో నువ్వట్లా చూస్తుండు. రేపో మాపో మీ

మామయ్యకు తెలీకుండా పోలీసుల్ని రంగం లోకి దింపుతా"

"అమ్మా... యామినమ్మగారి కోసం, ఆ అమ్మాయొచ్చింది. అయ్యగారూ అమ్మగారూ ఇంట్లో లేరు మరి తమరేమైనా మాట్లాడ తారా? " జోగయ్య వచ్చి అడిగాడు రమామ ణిని.

శరశ్చంద్ర క్లినిక్కెళ్లాడు. అరవింద అంధుల పాఠశాల్లో వార్షికోత్సవం జరుగుతుంటే వెళ్లింది.

"ఆ అమ్మాయా? ఎవరా అమ్మాయి? " దీర్ఘం తీసింది రమామణి.

"అదే నమ్మా... అరవింద మ్మగారి చెల్లెలు"

"ఒహోఁ... అదా" అంటూనే గది బయటకొచ్చింది రమా మణి. ఆమె వెనకాలే... నగల్ని అలాగే ధరించి ఒక్కో మెట్టూ దిగుతోంది శ్వేత దర్పంగా.




"ఏమ్మా ఇట్లా వచ్చావ్? నీక్కూడా పెళ్లి సంబంధం సెటి లైందా తల్లీ! ఏ మాత్రం పట్టుకెళదా మని వచ్చావు!"

శ్రీదేవికి తాను నిలుచున్న చోట భూమి రెండుగా చీలిపోయి తనందులో కూరుకుపోతే బాగుండునన్పించింది.

శ్రీదేవి ఆమెకు సమాధానం ఇవ్వకుండా పక్కనే నిలబడి తనకేసి జాలిగా చూస్తున్న జోగయ్యతో అంది.

"నేనొచ్చింది ఈ అమ్మగారి కోసం కాదు తాతా. యామినమ్మగారి కోసం"

"యామినా? ఆమెక్కడుందీ? ఎప్పుడో పోయిందిగా. ఉండేది మా వదినలా నటిస్తూ మీకు దోచిపెడుతున్న మీ అక్క"

"మాటలు తిన్నగా రానీండి" శ్రీదేవి ఉక్రో షంగా అంది.

"అవతలి వాళ్ల చేతలు తిన్నగా లేనపుడు మాకు మాటలు మాత్రం మామూలుగా ఎందుకొస్తాయ్? చెప్పు నీకేం కావాలి? నేనే పడేస్తాను" తనే ఆ ఇంటికి అధికారిణి అన్నంత ధీమాగా అడిగింది శ్వేత.

ఇంతలో చెవిలో మారుతీ ఎస్టీమ్ హార్న్ వినబడింది.

"అదుగో అమ్మగారొచ్చేశారు" ఉత్సాహంగా అన్నాడు జోగయ్య.

డ్రైవర్ పోర్టికోలో కారాపగానే అందులోంచి దిగింది అరవింద.

లోపలికొస్తూ హాల్లో ఉన్న శ్రీదేవిని చూసి

"బాగున్నావా? " అంది పలకరింపుగా.

అరవింద నవ్వుతుంటే శ్రీదేవి లోప ల్లోపల కుతకుత లాడిపోయింది.

ఎన్ని మాటలన్పించుకుంది తను ఇప్పటిదాకా! అక్కవల్లేగా!

"ఏంటి నిలబడే ఉన్నావ్? కూర్చో"

అరవింద అలా అన్నప్పుడు గాని శ్రీదేవి గమనించలేదు. తనని వాళ్లు కనీసం కూర్చోమని కూడా చెప్పలేదని.

"ఎలా వుంది మీ అక్కయ్యా? అత్తారింట్లో అడ్జెస్ట్ అయిందా? "

"ఆఁ..." పొడిగా అంది శ్రీదేవి.

"పని మీద వచ్చినట్టున్నావే! డబ్బేమైనా కావాలా? "

శ్వేత రమామణి ముఖంలోకి చూసి గుంభ నంగా నవ్వింది. అది గమనించిన శ్రీదేవికి ప్రాణం చచ్చిపోయింది.

"డబ్బు కోసం కాదు. అంతకు మించిన ఓ ముఖ్య విషయాన్ని మీ సలహా తీసుకుని సెటిల్ చెయ్యడానికి వచ్చాను"

"ఏంటమ్మా అది? "

"మా అక్క అరవిందను వంశీ అనే ఓ వ్యక్తి ప్రేమిస్తున్నాడని నేనిదివరలో ఓ సారి చెప్పాను. గుర్తుందా? "

"ఆఁ... ఆఁ... ఉంది"

"అప్పుడతడికి మీరు మా అక్క గురించి ఉన్న విషయం ఉన్నట్లు రాయమని చెప్పారు"

"యాఁ... అది కూడా గుర్తుంది"

"కానీ... నేనలా రాయలేదు. మా అక్కే రాస్తున్నట్లు ఉత్తరాలు రాశాను. అమెరికా నుండి తొందరపడి రావద్దనీ, ఎన్ని ఒడిదుడుకులెదురైనా తను అతడికోసం నిరీక్షిస్తుంటుందని రాశాను. అలాగెందుకు రాశానంటే ఎప్పటికైనా మా అక్క మాకు దక్కుతుందేమోనన్న ఆశతో. కానీ ఇప్పుడో చిక్కొచ్చిపడింది. అతడు వచ్చే వారంలో ఇండియాకొస్తున్నాడు. కేవలం మా అక్కకోసం నేనతడికి ఏం సమాధానం చెప్పాలి? "

"అందుకే నేను ముందుగానే నిజం రాసెయ్యమన్నాను. జరిగిందేదో జరిగింది. వెంటనే అతడికో ఉత్తరం రాసిపడెయ్, జరిగిన విషయాన్ని వివరిస్తూ. తీరా అతడు వచ్చాక ముఖాన ఇబ్బంది పడుతూ చెప్పే కంటే ఇదే ఉత్తమం. ఇంకో బెనిఫిట్ ఏంటంటే... ఆ ఉత్తరం చూసుకుని అతడు ఇండియా రావడం మానెయ్యొచ్చు కూడా" నిర్వికారంగా చెప్పింది అరవింద.

"ఇంకోలా చేస్తే..." అడిగింది శ్రీదేవి అరవింద కళ్లలోకి షార్ప్‌గా చూస్తూ.

అరవిందలో ఏ తొట్రుపాటూ లేదు. "చెప్పు" అంది "అతణ్ణి రానిస్తాను. మా అక్క దగ్గరకు తీసికెళ్తాను. విషయం అతడే తేల్చుకుంటాడు"

అరవింద ఆశ్చర్యంతో నోరు తెరిచింది. "కనపడని అరవింద దగ్గరికి నువ్వతణ్ణి ఎలా తీసుకెళ్తావ్? "

"ఎదురుగా కనబడుతూనే ఉందిగా" ఉక్రోషంగా అంది శ్రీదేవి.

"ఎదురుగానా? " అయోమయంగా అడిగింది అరవింద " నువ్వు యామినీ శరశ్చంద్రవా? అరవిందవు కదూ? ఏం సాధించాలని ఇలా చేస్తున్నావ్? రేపు అమెరికా నుండి వంశీ వస్తే అతని ముందు కూడా ఇలాగే నటిస్తావా? నీ ప్రాణానికి ప్రాణమైన అతణ్ణి 'ఎవరు నువ్వు? ' అని ప్రశ్నిస్తావా? " శ్రీదేవి ఆపుకోలేక అడిగేసింది.

"వంశీ ఎవరూ? అరవిందెవరూ? మీ అక్క కనబడక నీకు మతిపోయినట్టుంది" అదే స్థాయిలో అరిచినట్లు అంది యామిని.

ఏ డబ్బడగడానికో వచ్చిందనుకున్న శ్రీదేవి ఇలా రియాక్ట్ కావడంతో మెరిసే కళ్లతో చూస్తున్నారు శ్వేతా, రమామణి.

శ్రీదేవి అరవింద కళ్లలోకి లోతుగా చూసి పేలవంగా నవ్వింది. "నువ్వు అరవిందవు కావనీ గుండెల మీద చెయ్యి వేసుకుని చెప్పు!"

"కాను... కాను... కాను..." తీవ్రంగా చలించింది అరవింద కంఠం.

శ్రీదేవికి ఏడుపు తన్నుకొచ్చింది. అది కొత్త ప్రదేశమని కూడా చూడకుండా భోరుమని ఏడ్చేసింది, ముఖానికి చేతులు అడ్డుపెట్టుకుని.

"అమ్మగారూ!" అని వెర్రి కేక వేసిన జోగయ్య గొంతు విని ముఖానికి అడ్డుగా ఉన్న చేతుల్ని చప్పున తొలగించింది శ్రీదేవి.

అరవింద నేల మీద కుప్పకూలిపోయి ఉంది. జోగయ్య కంగారుగా వెళ్లి గ్లాసుతో నీళ్లు తెచ్చి ఆమె ముఖాన చిలకరించాడు.

మెల్లగా కళ్లు విప్పింది అరవింద.

ఆమె చూపులు చుట్టూ నిలబడి తనకేసే యాంగ్జయిటీగా చూస్తున్న శ్రీదేవినీ, రమామణినీ, శ్వేతనీ, జోగయ్యనీ మెల్లగా తడిమాయి.

తిరిగి కళ్లు మూసుకుంది అరవింద.

శ్రీదేవి కంగారు పడుతుంటే జోగయ్య 'భయం లేదన్నట్టు' సైగ చేశాడు.

ఓ రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచాక వినబడిందో స్వరం.

"చూడు శ్రీదేవీ..."

శ్రీదేవి భృకుటి ముడిచి అరవిందకేసి చూసింది. ఆమె పెదవి విప్పలేదు. అసలు ఆమెలో ఎలాంటి చలనం లేదు.

మరి మరి తననలా పిలిచిందెవరు? మళ్లీ వినబడిందా స్వరం. "నువ్వూ... ఈ రమామణి, శ్వేతా అనుకుంటున్నట్టు నేను అరవిందను కాను. మిసెస్ యామినీ శరశ్చంద్రను. భౌతికంగా ఈ శరీరం మీ అక్కదే కావచ్చు కానీ మానసికంగా నేను యామినిని.

నా ఆయువు తీరినా నాకింకా శరశ్చం

ద్రను వదిలి పోవాలని లేదు. ఆయన ద్వారా నేను చేయాల్సిన ఎన్నో పనులు ఇంకా అసంపూర్తిగా ఉన్నాయి. అవి పూర్త య్యేంతవరకు నేనీ యింట్లోంచి కదలను.

ఒకరికి సహాయ పడటం అనేది నా నైజం. ఆశ్రితులను ఆదుకోవడం అన్నది నా కిష్టమైన విషయం. ఈ విషయంలో నాకు తన పర భేదం లేదు. మీ అక్క దేహాన్ని నేను ఆవహించి ఉన్నాను కనుక నా వల్ల మీ అక్క మీకు దూరమైంది కనుక మీ మీద కాస్త ఎక్కువ శ్రద్ధ చూపిస్తున్నానే కాని మరొకటి కాదు. అనవసరంగా ఆలోచించి మనసు పాడు చేసుకోకు. నేననుకున్న పనులు సాధించాకా నా శరత్ నా కోసం దుఃఖించని మనో నిబ్బరం పొందాడని అనుకున్నాకా నేను వెళ్లిపోతాను. అంతవ రకూ అరవింద అరవింద కాదు. మిసెస్ యామినీ శరశ్చంద్ర"

గాల్లోంచి తేలివస్తున్నట్టున్న ఆ మాటల్ని బిర్రు బిగుసుకుపోయి విన్నారందరూ.

శ్రీదేవి అచేతనంగా పడి వున్న అరవింద కేసి కన్నార్పకుండా చూస్తోంది.

"నో... నువ్వు మా అక్కవు కావు. యామి నివే" ఒళ్లు జలదరిస్తుండగా మౌనంగా అను కుందామె.

11



అక్కడ పాశ్చాత్య సంగీతం మంద్రస్థా యిలో విన్పిస్తోంది. మల్లెలు తెంపి నేలంతా వెదజల్లినట్టు విరగకాస్తోంది వెన్నెల. గార్డెన్ లోని చెట్లలో రెమ్మ రెమ్మకూ అమర్చిన విద్యు ద్దీపాలు ఎర్రగా, పచ్చగా, నీలంగా మెరిసి పోతూ డిజైన్ ఫ్లవర్స్‌లా అన్పిస్తున్నాయి.

ఆ గార్డెన్‌లో అక్కడొకటీ, అక్కడొకటిగా అరేంజ్ చేసిన గుండ్రటి డైనింగ్ టేబుల్స్ అతిథులతో కళకళలాడుతున్నాయి. మెల్లగా చిట్ చాట్ చేసుకుంటూ, స్వీట్ స్మైల్స్ ఎక్స్ ఛేంజ్ చేసుకుంటూ, సర్వ్‌చేసిన ఖరీదైన డిన్న ర్‌ని ఆరగిస్తున్నారు వాళ్లు.

గార్డెన్ ఎంట్రన్స్‌లో యామినీ శరశ్చంద్రల ఇరవై మూడో వెడ్డింగ్ యానివర్సరీని రెప్ర జెంట్ చేస్తూ అరేంజ్ చేసిన ఎలక్ట్రిక్ బల్బుల ఆర్చ్‌కి అటూ ఇటూ నిలబడి, ఒకరొకరుగా ఇంకా వస్తోన్న గెస్టుల్ని విష్ చేస్తూ ఆహ్వాని స్తున్నారు. శరశ్చంద్రా, అరవిందలు. అరవింద పక్కనే నిలబడి అతిథుల మీద అత్తరు చల్లు తోంది అశ్విని.

వరసగా పార్క్ చేసి ఉన్న కార్ల వెనక బుల్లె ట్‌ని ఆపి లోపలికొచ్చాడు ఓ యువకుడు. డెనిమ్ జీన్స్‌లోకి వైట్ కలర్ షర్ట్ టక్ చేసి ఉన్నాడతను. నేరుగా గార్డెన్ ఎంట్రన్స్ దగ్గర కొచ్చి అరవింద వంకే కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డాడు.

"హెలో" అంది అరవింద. అతడికంటే ముందు నడుస్తూ వచ్చిన ఒక వ్యక్తిని విష్ చేస్తూ. అతడో గిఫ్ట్ ఆమెకిచ్చి శుభాకాంక్షలు చెప్పి లోపలికి వెళ్లగానే ఆమె ఆ యువకుడి కేసి చూసి ముందు వ్యక్తిని విష్‌చేసిన స్టైయి ల్లోనే "హెలో" అంది.

ఆ యువకుడు డీప్‌గా ఆమె ముఖంలోకి చూశాడు. అతడికి కావలసిన ఎక్స్‌ప్రెషన్ ఆమె ముఖంలో కనబడలేదు.

దేనికోసమో స్టడీ చేస్తున్నట్టుగా ఆమెనే చూస్తూ "మెనీ... మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ద డే" అన్నాడు వెంటతెచ్చిన ఫ్లవర్ బొకేని ఆమె కిస్తూ.

అరవింద కేజువల్‌గా దాన్నందుకుని పక్కన పెట్టేసింది.

"రండి... రండి" అత్తరు చిలకరించబోతూ ఆనందంగా అంది అశ్విని.

అతడో చిరునవ్వును ఆమెకు సమాధానంగా ఇచ్చి శరశ్చంద్ర కేసి క్రీగంట చూశాడు " అరౌండ్ ఫిఫ్టీ బట్ లుకింగ్ హి ఈజ్ ఇన్ హిజ్ ఫార్టీస్" అనుకున్నాడు.

తరవాత చేయి చాపి శరశ్చంద్రతో కరచాలనం చేశాడు. అరవింద బంధువో, తెలిసిన వ్యక్తో అయ్యుంటాడని శరశ్చంద్ర అనుకున్నాడు.

అరవింద అతణ్ణి తనకు పరిచయం చేస్తుందేమో అని కాస్త వెయిట్ చేశాడాయన.

అలాంటిదేం జరగలేదు.

అతడు ఓ కన్ను అరవింద మీదేసి అశ్వనితో మాట్లాడుతున్నాడు. అశ్వని చాలా ఎగ్జయిటింగ్‌గా కబుర్లు చెబుతోంది.

"ఎవరు అరవిందా?"

అరవింద తెలీదన్నట్టు భుజాలు ష్రగ్ చెయ్యడం, పైగా "నీ తాలూకా అనుకున్నా శరత్. నీకూ తెలీదా?" అని ఆశ్చర్యపోవడం అన్నీ గమనిస్తున్నాడా యువకుడు.

ఓ రెండు నిముషాలు అతడితో హస్కు వేశాక అశ్వని శరశ్చంద్రకూ అరవిందకూ అతణ్ణి పరిచయం చేసింది "ఇతను వంశీ. స్టేట్స్‌లో కంప్యూటర్ ఇంజనీర్‌గా చేస్తున్నారు"

"గ్లాడ్ టు మీట్ యు యంగ్‌మేన్" శరశ్చంద్ర కరచాలనం కోసం చేయి చాచాడు.

"ఇందాకోసారి అయింది" నవ్వింది అరవింద జోవియల్‌గా. శరశ్చంద్ర చేతిని వెనక్కి తీసుకోబోతుంటే, వంశీ ఫ్రెండ్లీగా అందుకుని షేక్ చేశాడు.

"ఐయామ్ శరశ్చంద్ర... కార్డియాలజిస్ట్" చెప్పాడు అతడి చేతిని స్నేహంగా నొక్కి వదులుతూ.

"ఈవిడ..." అశ్వని ఓసారి అరవింద కేసి చూసి వంశీతో అంది "మిసెస్ యామినీ శరశ్చంద్ర"

అరవింద అతి మామూలుగా తను యామినే అన్నంత సహజంగా చేతులు జోడించి 'నమస్తే' అంటుంటే ప్రపంచంలో ఎనిమిదో వింతను చూస్తున్నట్టుగా ఉండిపోయాడు వంశీ, కనీసం ప్రతి నమస్కారం చేయటం కూడా మరిచిపోయి.

అశ్వని "రండి" అంటూ అతణ్ణి తీసికెళ్లి ఖాళీగా ఉన్న ఓ టేబుల్ దగ్గర చైర్ ఆఫర్ చేసింది.

"నీకూ నాకూ కూడా తెలీని ఈ అతిథిని" అరవింద అర్థోక్తితో ఆపి శరశ్చంద్రకేసి చూసింది.

"నీ ఫ్రెండ్ ఇన్వయిట్ చేసుంటుందిలే" అశ్వని కేసి చూస్తూ అన్నాడు.

అరవింద ఇక అంతటితో ఆ ప్రస్తావన ఆపేసింది. మరో ఇద్దరు గెస్టులు రావడంతో వంశీకి ఎదురుగా ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చుని బాతాఖానీ వేస్తున్న అశ్వని ఆ ఇద్దరు గెస్టుల్ని చూసి అక్కడికొచ్చింది, సెంట్ స్ప్రే చెయ్యడానికి. ఆ పనయ్యాక అంది అరవిందతో "మా మేనమామ కూతురికి చూసింది ఇతణ్ణే. ముందు పెళ్లి చేసి ఇతణ్ణి అమెరికా పంపాలనీ, అమ్మాయినీ నిదానంగా పంపొచ్చని డిసైడ్ చేసుకున్నారు మామయ్య వాళ్లు. కానీ వాళ్లిద్దరూ పర్సనల్‌గా మాట్లాడుకున్నాక మా తనూజ అతడు అమెరికా వెళ్లివచ్చాకే పెళ్లని మొండికేసింది. ముందు కాదన్నా వంశీ కూడా అదే సజెస్ట్ చెయ్యడంతో మా మామయ్య ఒప్పుకున్నాడు. ఇంకో సంవత్సరం ఉంటాడితను స్టేట్స్‌లో, రాగానే మేరేజ్". ఈ లోపు మా తనూజ హౌస్ సర్జన్సీ కూడా అయిపోతుంది. హౌ ఈజ్ హి? వెరీ చార్మింగ్ ఫిజిక్ యు నో?"

"యు ఆర్ రైట్. హేండ్ సమ్ గై" ఒప్పుకుంది అరవింద, ఓ చూపు అతడికేసి విసిరి.

"మా తనూజా అంతే. తిలోత్తమలా ఉంటుంది. ఇద్దరి కిద్దరూ... మేడ్ ఫర్ ఈచ్ అదర్‌లా ఉంటారు" అశ్వని మురిసిపోతూ చెప్పింది.

"అయితే... పెళ్ళి కాకుండానే అల్లుడుగార్ని మామగారు అమెరికా పంపారంటే వాళ్లతడి మీద చాలా హోప్స్ పెట్టుకున్నారన్నమాటే. ఒకవేళ తను స్టేట్స్ నుండి వచ్చాక మీ అమ్మాయిని చేసుకోను పొమ్మంటే?"

"ఛ... హి ఈజ్ నాట్ దట్ టైప్. జెంటిల్‌మేన్"

"ఏంటో... సర్టిఫికెట్టు?"

"ఊరికినే నేనతణ్ణి సర్టిఫై చెయ్యటం లేదు.

ఒక విషయాన్ని ఇన్‌స్టన్స్‌గా తీసుకునే అంటున్నా"

"ఏంటా విషయం?" అన్నట్టు చూసింది అరవింద. "అతడు స్టేట్స్‌కి వెళ్లటానికి అయిన ఖర్చంతా అతడే భరించాడు. మా మామయ్యని స్పెండ్ చెయ్యనీలేదు. కాకపోతే మా తనూజ బ్రదర్ ఆల్రెడీ స్టేట్స్‌లో ఉన్నాడు. కాబట్టి ఇతన్ని స్పాన్సర్ చేశాడు. అదొక్కటే మా వాళ్ళు ఇతడికి చేసిన హెల్ప్. ఇప్పుడు చెప్పు. అయాచితంగా వచ్చే ట్రావెలింగ్ ఎక్స్‌పెన్సెస్‌ని అతడు వదులుకోవటం ఏంటం

ద డిన్నర్"

"ఇట్సాల్ రైట్. వెళ్ళొస్తాను. అన్నట్టు వర్మ గారు రాలేదా పార్టీకి?"

"ఆయనకి ఫీవర్. రాలేకపోయారు" చెప్పింది అశ్వని.

"ఆయన్ని రేపు మీటవుతానని చెప్పండి" వంశీ చెప్పాడు.

తరవాత అతడు శరశ్చంద్ర వైపు నడిచి వెళ్లొస్తానని చెప్పి వెళ్లిపోతుంటే అరవింద హడావుడిగా అతణ్ణి క్రాస్ చేసి అంది "తెలిసి నేను తప్పు చెయ్యలేదు. ఒకవేళ తెలీక చేశా

## దోమాయణం

'ఈ యేడు వానలు బాగా కురిసి దోమలెక్కువై పశువుల్ని తినేసి మనుషుల మీదికి వచ్చాయి. ఈ దోమలు తినెయ్యకుండా మిగిలివుంటే ఈసారి మీ ఉత్తరానికి జవాబు వస్తుంది. రాకపోతే ఇకముందు మీ సందేహాలని దోమల నడగవలిసిందే. వాటి కడుపులు నన్ను మరిచిపోయినా వాటిల్లోని ఈశ్వరుడు మీకు జవాబు ఇస్తాడు..'

మిత్రుడికి రాసిన ఒక ఉత్తరంలో చలం రువ్విన నవ్వుల పువ్వులివి.



టావ్. మామయ్య రిక్వెస్ట్ చేసినా పెళ్ళయ్యాక మీ ఇష్టం వచ్చింది ఇవ్వండి. అప్పుడు తీసుకుంటానన్నాడు. వెరీ రేర్ పర్సనాల్టీ"

అరవింద ఏదో అనబోతుండగా వంశీ వచ్చాడు. శరశ్చంద్ర గార్డెన్ లోపలికి వెళ్లి అతిథులకి అన్నీ అందుతున్నాయా లేదా అని చెక్ చేసుకుంటున్నాడు.

"అదేంటి...! మీరొచ్చి పది నిముషాలు కాలేదు. అప్పుడే డిన్నర్ అయిపోయిందా?" ఆశ్చర్యపోయింది అరవింద.

"మీరు నన్ను రిసీవ్ చేసుకున్న తీరు నాకు నచ్చలేదు మేడమ్. అందుకే ఆకలి చచ్చిపోయింది. ఏం తినాలనిపించలేదు" అరవిందని ఎక్స్‌రే తీస్తున్నట్టుగా చూస్తున్నాడు వంశీ.

అరవింద, అశ్వనీ ముఖాముఖాలు చూసుకున్నారు.

అశ్వని ముందుగా తేరుకుని అంది "ఆమె తరఫున నేను సారీ చెబుతున్నా. ప్లీజ్ హేవ్

నేమో తెలీదు. ఎనీవే ఐయామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ... ప్లీజ్ హేవ్ ద డిన్నర్".

"నో... థేంక్స్" నిష్కర్షగా చెప్పి వెళ్ళిపోయాడు వంశీ.

అరవింద నొచ్చుకోవటం చూసి అశ్వని అంది. "ఐ యామ్ సారీ యామినీ... అతణ్ణి అనవసరంగా ఇన్వైట్ చేసి నిన్ను నొప్పించాను. ఒట్టి లూజులా ఉన్నాడు"

"ఇందాకే కదా జంటిల్‌మేన్ అని పొగిడావ్" నవ్వింది సన్నగా అరవింద.

"ఈ విషయంలో మాత్రం కాదు" అశ్వని చిరాగ్గా అంది.

"టేకిటీజీ... బైదిబై... ఇతణ్ణి ఇన్వైట్ చేసింది నువ్వన్నమాట?"

"ఆఁ... నేనే. వస్తుంటే దార్లో బుల్లెట్ మీద ఎదురయ్యాడు. అమెరికాలో ఉండాల్సిన వ్యక్తి సడన్‌గా ఇక్కడ రోడ్ మీద ప్రత్యక్షమయ్యేసరికి ఆశ్చర్యపోయి తారాపాను. అవీ ఇవీ

మాట్లాడాక ఎక్కడకని అడిగాడు. మీ వెడ్డింగ్ డే గురించి చెప్పాను. ఓc... శరశ్చంద్ర అంటే కార్డియాలజిస్ట్ కదూ అన్నాడు. 'మీకెలా తెలుసు?' అని అన్నాను. 'డాక్టర్లు అందరికీ తెలిసే ఉంటార్లే' అని నవ్వాడు. రండి... పరి చయం చేస్తాను అన్నా ఫార్మల్‌గా. 'మీరు వెళ్లండి. నేను ఫంక్షన్ టయానికి వస్తాను' అన్నాడు. అన్నట్టే వచ్చేశాడు మహానుభా వుడు. నేనింకా రాడేమో అనుకున్నా"

అశ్వని చెప్పేది వింటున్న అరవిందని అల్లంత దూరంలో నిలుచుని ఉన్న శరశ్చంద్ర పిలిచాడు.

* * *

"నిన్నేమిటీ... మీరు ఉన్నట్టుండి సీరియస్ అయిపోయారు? పార్టీ మధ్యలో మీరలా వెళ్ల డంతో యామినిగారు చాలా బాధ పడ్డారు"

"ఎవరూ? ఎవరు బాధ పడ్డారు?" వంశీ ఇంట్రెస్టింగా చూశాడు అశ్వని వైపు.

వర్మను కలిసి మాట్లాడ్డానికి వచ్చాడతను. ముగ్గురూ హాల్లో కూర్చుని ఉన్నారు.

"ఆవిడేనండీ... మిసెస్ యామినీ శర శ్చంద్ర" చెప్పింది అశ్వని.

"మిసెస్ యామినీ శరశ్చంద్ర..." ఆ పేరును రిపీట్ చేస్తూ గమ్మత్తుగా నవ్వాడు వంశీ. "యాజ్ ఫర్ మై నాలెడ్జ్ షి ఈజ్ మిస్ అరవింద... బట్ నాట్ మిసెస్ యామినీ శరశ్చంద్ర".

అరవింద అతడికి ముందే తెలుసని అశ్వని కర్థమైంది.

"ఆమె మీకెలా తెలుసు?" ఆసక్తిగా అడి గింది. వంశీ సమాధానం చెప్పలేదు ఆమె ప్రశ్నకు.

"ఆమెను మీరంతా యామిని అని ఎందుకు పిలుస్తున్నారు? శరశ్చంద్ర మిసెస్ యాక్సిడెం ట్‌లో పోయాక ఆయన ఈమెను పెళ్ళి చేసు కున్నాడా? భార్య మీది ప్రేమతో ఆమెను మరిచిపోలేక అరవిందనే యామినీ అని పిలు చుకుంటున్నాడా?"

"నో... శరశ్చంద్ర అరవిందను పెళ్ళాడ లేదు. ఆమెను మేమంతా యామినిగా ఎందుకు గుర్తించాల్సి వస్తుందంటే..."

వంశీ మధ్యలో అందుకున్నాడు. "నాకు తెలుసు యామిని ఆత్మ అరవిందలో ఉంది"

'ఇతనికి కథంతా తెలిసినట్టే ఉందే' అను కుంది అశ్వని.

"ఎడ్యుకేటెడ్ అయిఉండీ మీరిలాంటివి ఎలా నమ్ముతున్నారు?" అతనడిగాడు.

అశ్వని కంటే ముందుగా వర్మ రియాక్ట య్యాడు "ఎడ్యుకేషన్‌కి అందని విషయాలు కొన్నుంటాయ్ వంశీ"

వెంటనే అశ్వని అందుకుంది. ముందు మేమూ లాజికల్‌గా ఆలోచించి ఈ వింతను కొట్టిపారేశాం. కానీ జరిగే సంఘటనలు ఆమెను యామినిగానే ప్రూవ్ చేశాయి. సో... ఇప్పుడా అమ్మాయిని అరవిందగా మర్చిపోయి యామినీ అని పిలిచే స్థాయికి వచ్చాం"

"అంటే... ఆమెలో యామిని ఆత్మ ఉందని మీరు గట్టిగా నమ్ముతున్నారు"

"కొన్నాళ్లాగితే నువ్వూ నమ్ముతావ్" అన్నాడు వర్మ.

"అది మాత్రం జరగని పని" డిటర్మయిం డ్‌గా చెప్పాడు వంశీ.

"మేమంతా ముందలా అన్నవాళ్లమే" అంది అశ్వని. వంశీ కామెంట్ చెయ్యలేదు. కామ్‌గా ఏదో ఆలోచిస్తున్నట్టుగా ఉండిపోయాడు.

"అవును... ఆ అమ్మాయి మీకెలా పరి చయం?" ఇంతక్రితం అడిగిన ప్రశ్న మళ్లీ అడిగింది అశ్వని.

వంశీ అశ్వనికేసి కొంచెం ఇబ్బందిగా చూసి ఏదో చెప్పబోయాడు. మళ్లీ అంతలోనే ఆగి పోయి కాసేపు సందిగ్ధావస్థలో పడ్డట్టు తలొం చుకుని కూర్చుండిపోయాడు. ఆమె ఎలా తెలుసో చెప్పటానికి అతనంతగా సంకోచిం చడం చిత్రమన్పించింది అశ్వనికీ, వర్మకి.

"అరవిందెవరో చెప్పే ముందు నేను మీకో విషయం చెప్పాలి" వంశీ అన్నాడు తలెత్తి.

"చెప్పు" వర్మ సిగార్ పొగల మధ్య నుండి అతడికేసి చూశాడు.

"ఇది మీ మనసులోనే ఉంచుకుని సమయం వచ్చినప్పుడు మాత్రమే బయట

పెడతామని నాకు మాటివ్వండి"

వర్మ భుజాలు ష్రగ్ చేసి "ఓ.కె. మై బోయ్ కమాన్ స్పీకవుట్" అన్నాడు.

అరవింద అతనికెలా తెలుసో చెప్పడానికి ఈ గొడవంతా ఎందుకో అర్థంకాక అయోమయంగా చూస్తోందతణ్ణి అశ్వని.

"నేనిప్పుడు చెప్పబోయేది మీ తనూజకు

అశ్వనీ, వర్మా ఇద్దరూ తుళ్ళిపడ్డారు.

"మీరు చెప్పేది..." అశ్వని వాక్యం పూర్తి చెయ్యలేకపోయింది.

"అక్షరాలా నిజం. ఆ వ్యక్తి కులం, సోషల్ స్టేటస్ విషయాల్లో బేక్ వర్డ్ కావడం వల్ల తన తండ్రి ఆ వివాహానికి ఒప్పుకోడని కూడా చెప్పుకొచ్చింది. ఆ విషయంలో తనకు నన్ను హెల్ప్ చెయ్యమని



సంబంధించిన సీక్రెట్".

"అప్రస్తుతంగా తనూజ పేరు అతడి నోటంట విన్న అశ్వని, వర్మల కనుబొమలు ముడివడ్డాయి. తనూజతో నా పెళ్లి చూపులు జరిగినప్పుడు మేమిద్దరం పర్సనల్‌గా మాట్లాడుకున్నాం. గుర్తుందా? "

"ఆఁ..." అంది అశ్వని.

"అప్పుడు చెప్పిందా అమ్మాయి. తనో వ్యక్తిని గాఢంగా ప్రేమిస్తున్నాననీ, నాతో పెళ్లి తనకిష్టం లేదనీ"

కూడా అడిగింది. ఈ పెళ్లికి నేను అంగీకరించినట్టు నటిస్తే తన తండ్రి తనకిక సంబంధాలు చూడడనీ, నిశ్చింతగా తను హౌస్ సర్జెన్సీ పూర్తి చేసుకుని, తనకంటూ సొసైటీలో ఓ పొజిషన్ కల్పించుకుని, ఇంట్లో వాళ్ల నెదిరించైనా సరే... అతణ్ణి పెళ్లాడతానని చెప్పింది. నాకెందుకో తనకు సహాయం చేయాలనిపించింది. అందుకే తను నచ్చినట్టు చెప్పాను. మీ అందరితో నా ఫారిన్ ట్రిప్ తరువాతే పెళ్లని, తను మొండి కేసినపుడు

నేను సపోర్ట్ చెయ్యడానికీ కారణం అదే"

"ఆమె ప్రపోజల్ని అంత తేలిగ్గా ఒప్పుకున్నా వంటే నమ్మశక్యంగా లేదు. అసలు తనూజా అంత ధైర్యంగా ముక్కు ముఖం తెలీని నీతో అలాంటి ఒప్పందం కుదుర్చుకుందంటే జస్ట్... ఐ కాన్ట్ డైజెస్టిట్"

"దానిక్కారణం నేనే. పర్సనల్‌గా మాట్లాడు కునే నెపంతో నేను అరవిందతో నా ప్రేమ గురించి చెప్పాను. తల్లిదండ్రుల బలవంతం మీద ఈ పెళ్లిచూపుల కొచ్చాననీ, నన్ను క్షమించమనీ అడిగాను. దానికావిడ బాధపడా ల్సింది పోయి సంతోషపడింది. తరువాత తన ప్రాబ్లమ్ చెప్పింది. నాకప్పట్లో అర్జంట్‌గా స్టేట్స్‌కి వెళ్లిపోవాలన్న ఆలోచన ఉంది. పైగా నాలాగే ఓ ప్రేమికురాలామె. నేను కాక ఇంకె వరు అర్థం చేసుకుంటారామెను.? ఆదుకుం టారామెను అనుకున్నా. అందుకే ఆమె ప్రపో జల్‌కి సంతోషంగా ఒప్పుకున్నా"

వంశీతో అరవిందకు ఉందంటున్న అను బంధం కన్నా తనూజ ధైర్యమే ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది అశ్వినికి...

"ఎంత ధైర్యం తనూజకు? " అంది అప్రయ త్నంగా.

"నిజమైన ప్రేమికులకి ధైర్యం ఎక్కువేలే" వర్మ అన్నాడామెతో.

అంతా విన్నాక తనను మెడ పట్టుకుని బయటకు గెంటుతాడేమో అనుకుంటున్న వంశీకి వర్మ అలా కితాబివ్వటం ఆనందాన్ని చ్చింది.

సరే, మా తనూజ సంగతలా ఉంచు. ఈ అరవింద నీ లవ్ అన్నమాట. అవునూ, ఆమెని ప్రేమిస్తున్న దశలో ఆమెనొదిలేసి స్టేట్స్ కెళ్లిపోవాలన్న ఆలోచన నీకెందుకొ చ్చింది? " అడిగాడు వర్మ.

వంశీ ముఖం ఉన్నట్టుండి దిగులుగా అయి పోయింది. "అరవింద నా ప్రేమను యాక్సెప్ట్ చెయ్యలేదు"

"ఓహో... వన్‌వే లవ్వా? "

"అబ్బే... అదేం కాదు. ఇద్దరం పరస్పరం గాఢంగానే ప్రేమించుకున్నాం. అరవిందకు కుటుంబ బాధ్యతలు ఎక్కువ. అందుకని నన్ను వెయిట్ చెయ్యమని అడిగేది. నేను కొన్నాళ్లు కాదనలేదు. కానీ ఆ తరవాత పెళ్లి చేసుకుందాం. నీ బాధ్యతల్ని ఇద్దరం పంచు కుందాం అని నచ్చచెప్పటానికి ప్రయత్నించే వాణ్ణి. ఆమె దానికి ససేమిరా అనేది. తనా బాధ్యతలేవీ నాకు పంచివ్వటానికి ఇష్టపడ లేదు. ఉన్నట్టుండి ఓ రోజు నా కోసం వెయిట్ చెయ్యొద్దు నీ దారి నువ్వు చూసుకో అంది. నేనూ ఆవేశంలో అదే మేలన్నాను. ఆ ఫ్రస్టేషన్‌లోనే మీ తనూజను కలిశాను. ఆమె ప్రపోజల్‌కి ఒప్పుకున్నాను. కొన్నాళ్లు దూరం గా వెళ్లిపోతే అరవింద మనసు మార్చుకుం టుందనుకున్నాను. కానీ..." అతను బాధగా కణతలు రాసుకున్నాడు.

"ఐ... పిటీ యు" వర్మ అన్నాడు.

వంశీ కొనసాగించాడు, "అక్కణ్ణించి అర వింద పేర్న ఉత్తరాలు రాశాను, మనసు మార్చుకోమని. ఆమె నుంచి గ్రీన్ సిగ్నల్ ఇస్తూ చాలా ఉత్తరాలు వచ్చాయి. బట్ మొన్నటికి మొన్న తెలిసింది. అవన్నీ ఆమె చెల్లెలు శ్రీదేవి రాసినవని"

"ఆ విషయం నీకెలా తెలిసింది? "

"శ్రీదేవే రాసింది. చివరి ఉత్తరంలో జరుగు తున్న విషయాలన్నీ రాసి, ఇక మా అక్క మీద ఆశలొదులుకోండి. అమెరికాలోనే ఎవర్నె యినా చేసుకుని సెటిలైపోండని రాసిందా అమ్మాయి. గుండె పగిలిపోయి పరుగెత్తుకొచ్చే శాను. ముందుగా శ్రీదేవిని కలిసి జరిగిన విషయం పూర్తిగా తెలుసుకునే నేను పార్టీకి వచ్చాను"

"ఇవన్నీ వింటుంటే నాకోటి అన్పిస్తోంది. కుటుంబ బాధ్యతలన్నీ ఆమెవే అన్నావ్ కదా! సో... ఎకనామికల్ సపోర్ట్ కోసం"

వర్మ మాటల్ని మధ్యలో తుంచేస్తూ అన్నాడు వంశీ "మీరో విషయం మరిచిపోతు న్నారు. ఆమె అలాంటి వ్యక్తయితే ఆ సపో ర్టని నా నుండే పొంది ఉండేది. షి హిజ్ నాటాఫ్ దట్ టైప్"

అతడి ఆర్గ్యుమెంట్ నిజమే అన్పించింది

వర్మకి. "అన్నీ చూస్తూ అలా అంటారేంటండీ. అరవింద ఒళ్లు విరుచుకు పడిపోవటం ఆమెలో నుంచి యామిని ఆత్మ మాట్లాడటం లాంటివి చూసి కూడా ఆమెది నటన అనటం చిత్రంగా ఉంది" అంది అశ్వని.

అరవిందను యామిని ఆత్మ ఆవహించడం అన్న అద్భుతాన్ని ఆయనలా కొట్టిపారెయ్యడం ఆమెకు నచ్చలేదు.

"మరి ఇలా ఎందుకు జరిగిందంటావ్? " వర్మ వంశీనే ప్రశ్నించాడు.

వంశీ నిట్టూర్చాడు "అదే అర్థం కావడం లేదు. అది తెల్సుకుందుకే నా ప్రయత్నం"

"ఇండియాలో ఎన్నాళ్లుంటావ్? "

"నా అరవింద మామూలు మనిషయ్యేవ రకూ, అవసరమైతే ఇక్కడే ఉండిపోడాని క్కూడా సిద్ధమే"

"ఓ.కె గో అహెడ్ ఏదైనా సాయం కావా లంటే... నేనున్నానని మర్చిపోకు"

వర్మ అంత జనరస్‌గా అంటుంటే వంశీకి ఆశ్చర్యంగా ఉంది.

"నాకూ, మీ తనూజకూ పెళ్లి జరగదు. సో నేను మీకేమీ కాను" వంశీ అన్నాడు.

"వివాహబంధం వల్లనో, రక్త సంబంధం వల్లనో ఏర్పడేదే బంధం కాదు. ఒకరికొకరం నచ్చినప్పుడు ఏర్పడే బంధం మరోటుంది అది స్నేహం" చెప్పాడాయన.

వంశీ లేచి ఆయనతో కరచాలనం చేశాడు.




"నెత్తిన పెద్దమ్మ కూర్చుందేమిటే నీకు? నా తల్లి కదూ! అతీగతికే లేనివాళ్లం, కాదంటే ఎలాగే శ్రీదేవి"

తులసమ్మ బతిమిలాడుతుంటే శ్రీదేవి అంతెత్తున ఎగిరిపడింది "నేను వసంతను కాదు గంగిరెద్దులా అన్నిటికీ తలూపటానికి. నాకంటూ ఓ వ్యక్తిత్వం ఏడ్చిందంటే అర్థం చేసుకోరేం? "

"వ్యక్తిత్వం గాడిద గుడ్డూ. ఆవిడ మంచి మనసుతో నీ పెళ్లి చేస్తానంటుంటే కాదనడం ఏంటి? తల పొగరు కాదంటే!" శీను కసురు కున్నాడు.

తులసమ్మ ఏదో అనటానికి నోరు తెరిచేటం తలో బైక్ గుమ్మంలో ఆగిన సౌండ్ వినబ డింది.

ముగ్గురూ గప్‌చిప్‌గా అయిపోయారు. లోపలికి రాబోయి కాస్త సందేహంగా తలుప వతలే నిలబడ్డ వంశీని శీను ముఖమంతా నవ్వు పులుముకుని "రండి...రండి" అని లోప లికి ఆహ్వానించాడు.

శ్రీదేవి మూలనున్న కుర్చీని కాస్త ముందుకు జరిపింది. వంశీ శ్రీదేవిని కలవటా నికి ఆ ఇంటికి వచ్చినప్పుడు ఆ కుటుంబం లోని అందరితో పరిచయం అయిందతనికి.

శ్రీదేవి గబగబ లోపలికెళ్లి గ్లాసునిండా మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది. అతడు తాగి గ్లాస్ కిందపెడతుంటే తులసమ్మ అడిగింది".

"ఏం నాయనా కలిశావా మా అరవిం దను? "

వంశీ ఒక్కక్షణం ఆమెకేసి చూసి చెప్పాడు "ఆమె నేను ప్రేమించిన మీ అరవింద కాదండీ"

శ్రీదేవికి అర్థమైంది. అరవింద అతణ్ణి గుర్తు పట్టలేదని "నిజంగానే మా అక్కకేదో అయిం దన్పిస్తోందండీ" దిగులుగా అందామె.

అతడేం మాట్లాడలేదు. తులసమ్మ కళ్లు తుడుచుకుని అంది "మరేలే నాయనా. ఇక దానిమీద ఆశలు పెట్టుకోవడం మా వెర్రి తనం"

"ఉదయం అక్కయ్య మా అమ్మను పిలిపిం చిందండీ" శీను అన్నాడు.

"అవున్నాయనా. మా శ్రీదేవికేదో సంబం ధం చూసిందట. కట్నకానుకలన్నీ తను చూసుకుంటాననీ... పిల్లా పిల్లాడూ చూసు కుని ఒకర్నొకరు నచ్చితే ఆ పుణ్యకార్యం కాస్తా

జరిపిస్తాననీ చెప్పుకొచ్చింది. ఏంటో భగవంతుడి మాయ. మనిషిని మాకు దూరం చేసినా మా మీద దానికి ఆ భ్రమను అట్లాగే ఉంచాడు" నిట్టూర్చిందామె.

వంశీ శ్రీదేవి వంక చూశాడు. శ్రీదేవికి అతడి ముందు తన అంతరంగం విప్పటం ఇష్టంలేక ఊరుకుంది.

ఆ కొత్త వ్యక్తి ముందు తన తల్లి అలా మాట్లాడ్డం నచ్చని శ్రీదేవి ఆమెవైపు కొరకొర చూసింది.

"ఇట్స్ నాట్ వైజ్" చెప్పాడు వంశీ శ్రీదేవితో. ఆమె ఏదో అనబోయేంతలో మళ్లీ తనే "ఎంత కాదనుకున్నా ఆమె మీ అక్కయ్య. ఖచ్చితంగా ఆమె బాధపడుతుంది. ఇక అమ్మ. పెద్దావిడ... ముందే దెబ్బతిని ఉన్నారు. మీ పెళ్లి కోసం మీరు బెంగపడకపోవచ్చు కానీ ఆవిడ... ప్రాణాలన్నీ మీ భవిష్యత్తు మీదే. ఆవిడ దిగులు పడిపోతారు. ఇక శ్రీనివాస్ విషయానికొచ్చినా, అతడు జీవితకాలమంతా కష్టపడి కూడబెట్టినా మీ పెళ్లి జరిపించేసరికి అతడు జీవితాన్ని కోల్పోతాడు. మీ కుటుంబ సభ్యుల బాధ మీ బాధేగా. అయాచితంగా వచ్చే సహాయాన్ని అందుకోవటంలో తప్పు లేదు."

వంశీ చెప్పింది విన్నది గాని... శ్రీదేవి సమాధానం మాత్రం ఇవ్వలేదు. కాఫీ తెస్తానంటూ లోపలికి వెళ్లిపోయింది.

ఎంతసేపూ తమ గొడవేనా... అతడి గొడవ కాస్తయినా వినాలి కదా అనుకున్నాడు శీను. అందుకే టాపిక్ మారుస్తూ అడిగాడు "అక్కయ్య అస్సలు గుర్తుపట్టలేదా?"

"ప్చ్" పెదవి విరిచాడు వంశీ.

"శరశ్చంద్రగారితో మాట్లాడారా?"

"జస్ట్ ఫార్మల్‌గా మాట్లాడాను. రేపు ఉదయం కలవాలనుకుంటున్నా"

"ఉదయమైతే ఇంటి దగ్గర తొమ్మిది లోపు వెళితే దొరుకుతారు. తరువాత కలవాలంటే క్లినిక్‌లోనే" వంశీ తలూపాడు.

శ్రీదేవి కాఫీ తెచ్చింది. సిప్ చేస్తూ అడిగాడు వంశీ "అవునూ శరశ్చంద్రగారు అరవింద విషయంలో సైకియాట్రిస్ట్‌ని కన్సల్ట్ చేయలేదా?"

"తెలీదండీ" చెప్పింది శ్రీదేవి.

"యామినిగారి పేరెంట్స్ స్టేట్స్‌లో ఉన్నారని విన్నా. వాళ్లు అరవిందను చూట్టానికి ఎప్పుడూ రాలేదా?"

"నిన్న వెడ్డింగ్ యానివర్సరీకి అటెండ్ అయ్యార్ట" శ్రీదేవి అంది.

"ఉదయం నే వెళ్లినప్పుడు ఇంట్లోనే ఉన్నారుగా"

"వాళ్లూ నమ్ముతున్నారా అరవిందను? ఐ మీన్ ఆమె యామినేనని"

"సంవత్సరం పాటు దాన్ని అర్థంలేని విషయంగా కొట్టి పారేశారు. కనీసం వచ్చి చూసి వెళ్లమని శరశ్చంద్రగారు రాసినా అవసరంలేదు. ఆ మనిషెవరో చీట్... వెంటనే పోలీసులకు అప్పగించండి అన్నారట. కానీ శరశ్చంద్రగారు అక్కను యామినిగానే భావించడం వల్ల వాళ్లకేదో సర్దిచెబుతూ రాసేవారు. కానీ వెడ్డింగ్ యానివర్సరీ ఇన్విటేషన్ అందగానే మాత్రం ఇదేదో మరీ శృతి మించుతున్నట్టుందని, విషయం డైరెక్ట్‌గా డీల్ చెయ్యాలని అంత దూరం నుండి వచ్చార్ట. తీరా వచ్చాక అక్కయ్య చకచక అమెరికాలో తను పుట్టి పెరిగిన ప్రదేశాల గురించీ, చదివిన స్కూల్, కాలేజ్ గురించీ పొల్లు పోకుండా చెప్పేసరికి వాళ్లూ పూర్తిగా ఆమెను యామినే అని నమ్మేస్తున్నారు. తను పుట్టిందగ్గర్నుండి శరశ్చంద్రతో వివాహమై ఇండియా వచ్చేవరకూ జరిగిన ఎన్నో సంఘటనల్ని, అనుభవాల్నీ వివరంగా చెప్పి వాళ్లను ఆశ్చర్యంలో ముంచెత్తేసిందట అక్కయ్య" చెప్పింది శ్రీదేవి.

"మరే బాబూ... పొద్దున్న ఆ జోగయ్య ఆవింత చెబుతుంటే నా నోరు తెరుచుకుపోయింది. నిజంగా ఈ బిడ్డ వాళ్ల బిడ్డేనేమో... అని కూడా అన్పించిందయ్యా ఆ క్షణం" తులసమ్మ కళ్లలో తడి మెరిసింది.

ముందు అరవిందను అనుమానించిన వాళ్లంతా ఆమెను కలిశాక యామినిగా గుర్తి

# అదే... ఆరోగ్య రహస్యమట



సెక్స్ వల్ల ఆరోగ్యపరమైన లాభాలు ఉన్నాయా? ఏమిటంటే ఈ చొప్పదంటు ప్రశ్న అనేయడానికి తొందర పడకండి. నిజమే. సెక్స్ వల్ల ఎన్నో లాభాలున్నాయి. రొమాన్స్‌తో మీ రోగాన్ని తగ్గించుకోవచ్చు ఆశ్చర్యపోకండి మరి. ఇదేం కొత్త విషయం కాదు. కాని సరికొత్తగా వైద్యపరంగా రుజువయింది. శృంగారం మానసికోల్లాసం కలిగిస్తుంది. సెక్స్ శారీరక ఆరోగ్యాన్నిస్తుంది. మన పూర్వీకులకు ఈ విషయం మహా భేషుగ్గా తెలుసు కాబట్టే ప్రాచీన గ్రంథాలలో, ప్రబంధాలలో, శిల్పకళలో ఈ అంశాలకు అమిత ప్రాధాన్యమిచ్చారు. ఇక ఆధునికత విషయానికి వస్తే... సెక్స్‌కు ఉండే చికిత్సా విలువలు పెళ్లయిన వారిలో గుండెజబ్బులు రాకుండా కాపాడ్తాయి. సంతృప్తికరమైన సెక్సు అన్ని విధాల శరీరాన్ని, మనసునీ ఆరోగ్యంగా ఉంచడంలో ముఖ్యపాత్ర పోషిస్తుందని వైద్య పరిశోధనల పరంగా నిరూపితమయింది. మీరు రొమాంటిక్ మూడ్‌లోకి వెళ్లాలంటే పరిశోధకులు ఓ చిట్కా చెబుతున్నారు. అదేమిటంటే రొమాంటిక్ డిన్నర్‌లో మీ భాగస్వామికి రెడ్ వైన్ ఆఫర్ చెయ్యడం. రెడ్ వైన్‌లో ఉండే రిస్వెర్‌ట్రాల్ అనే యాంటీ ఆక్సిడెంట్ రక్తంలో ఉండే మంచి కొవ్వును పెంచుతుంది. ఫ్లెవనాయిడ్స్ ధమనులు విచ్ఛిత్తి కాకుండా కాపాడుతాయి. మిమ్మల్ని అసలైన శృంగారపు మూడ్‌లోకి తీసుకెళ్తాయట.

స్తూపోవడం వంశీకి అద్భుతంలా అన్పించ లేదు. గుండెను పిండే బాధలా తోచింది. తల దించుకుని కాలి బొటన వేలు నేలకేసి రాస్తూ ఉండిపోయాడు చాలా సేపు.

ఆ బాధ నుంచి బయటపడుతూ "అర వింద అలా మారడానికి ముందు ఆమె సైకలాజికల్ పొజిషన్ ఎలా ఉండేది?" అని అడిగాడు.

"నార్మలే" శీను చెప్పాడు.

"బాగా గుర్తు చేసుకోండి"

రెండు క్షణాలయ్యాక శ్రీదేవి, "అక్కను యామిని ఆత్మ ఆవహించడానికి పది పది హేను రోజుల ముందు ఓ రోజంతా గదిలో తలుపు మూసుకుని గడిపిందండి" అని చెప్పింది.

"అవునండీ కరెక్టే" శీనుక్కూడా గుర్తొచ్చిందా విషయం.

"ఎందుకే నా తల్లీ అట్లా ఉన్నావ్ అని గడ్డం పుచ్చుకు బతిమిలాడినా చెప్పలేదయ్యా నా బిడ్డ. అవాళంతా అన్నం కూడా ముట్ట లేదు పిచ్చితల్లి" తులసమ్మ చెప్పింది.

వెంటనే గుర్తుకొచ్చింది వంశీకి. తను స్టేట్స్‌కి వెళ్లగానే ఇండియాలో ఉన్న తన ఫ్రెండ్ శ్రీకర్ నుండి వచ్చిన ఉత్తరంలో ఉన్న విషయం.

"నువ్వు స్టేట్స్‌కి వెళ్లిన తెల్లవారే విషయం అరవిందకు చెప్పా వంశీ. వార్త వినగానే ఆమె బాగా అప్‌సెట్ అయిందిరా. టు బి ఫ్రాంక్... కళ్లు తిరిగి పడిపోబోయింది. తర వాత ఇంకా ప్రశ్నలూ వెయ్యకుండా మౌనంగా ఉండిపోయింది. నేను కల్పించుకుని నీ గురించిన వివరాలు చెప్పబోతే చప్పున చెవులు మూసుకుని "నో... థేంక్స్. నాకు వినాలని లేదు. దయచేసి ఇక్కణ్ణించి వెళ్లిపోండి' అంది. సరే ఆమెతో నాకెందుకులే అని నోర్మూసుకుని వెళ్లిపోయాను" అని రాశాడు వాడు.

"చూడండి శ్రీదేవి... మీ అక్కయ్య అలా మూడీగా ఉన్న రోజు తారీఖు ఎంతో గుర్తుందా? గుర్తుతెచ్చుకోవడానికి ప్రయత్నిం

చండి. ప్లీజ్" అన్నాడు వంశీ.

నిస్సహాయంగా చూసింది శ్రీదేవి "సంవత్సరం క్రితం మాటండీ. ఎలా గుర్తుంటుంది?"

"పోనీ నెల చెప్పగలరా? కొంచెం... కొంచెం ట్రై చేయండి"

"మా అక్కను యామిని ఆత్మ పోయిన జూలై పన్నెండో తేదీన ఆవహించింది. అంతకు పదిపదిహేను రోజుల క్రితం అక్క అలా డిస్పిరిట్ అయిపోయింది. అంటే దాదాపు జూన్ ఆఖరి తేదీల్లో అది జరిగి ఉంటుంది"

తను అమెరికా వెళ్లిపోయింది జూన్ ఇరవై తొమ్మిదో తారీఖున. శ్రీకర్ ఆమెకు చెప్పింది ఆ మరుసటి రోజున. ఇట్ మీన్స్.. ఖచ్చితంగా ఆమె మూడ్ అవుట్ అయిన రోజు జూలై ఒకటి అయివుంటుంది. తను వెళ్లిపోయాడన్న వార్త ఆమెను తీవ్రమైన ఫ్రస్టేషన్‌కి గురిచేసి ఉంటుంది.

"ఆ ఒక్క రోజేనా? తరువాత మామూలుగానే ఉన్నదా?"

"మామూలుగా...నే ఉంది. మధ్యలో ఓసారి విజయనగరం వెళ్లొచ్చింది"

"విజయనగరమా? అక్కడెవరున్నారు?"

"భానురేఖ అని అక్కయ్య ఫ్రెండ్"

"ఐసీ...ఆవిడా!తనుండేది ఇక్కడే కదూ!"

"ఆ మధ్య వాళ్ల చిన్నన్నయ్య ఆమెనూ తల్లినీ అక్కడికి తీసికెళ్లిపోయారు"

"అక్కడెన్నాళ్లుంది అరవింద?"

"మూడు రోజులనుకుంటా"

"అక్కణ్ణుంచి వచ్చాక ఆమె బిహేవియర్‌లో ఏదైనా మార్పు కనబడిందా?"

తులసమ్మ కల్పించుకుంది. "ఎప్పటికన్నా హుషారుగా కనబడింది బాబూ పోనీలే బిడ్డ ఆనందంగా ఉంది అంతే చాలనుకున్నా"

"తరువాత ఆమె ఎక్కడికీ వెళ్లలేదా?"

"ఊహుఁ... కేవలం ఆఫీసూ, ఇల్లూ అంతే" శ్రీదేవి చెప్పింది.

"ఓసారి మాత్రం శరశ్చంద్రగారింటికి వెళ్లింది. అయితే ఆ రోజు మామూలుగానే వచ్చేసింది. ఆ తరువాత నాలుగైదు రోజులు గ్యాప్ ఇచ్చి మళ్లీ వెళ్లింది. ఇక అంతే. అక్క మమ్మల్ని మర్చిపోయింది" శ్రీదేవి కళ్లలో నీళ్లు తిరిగాయి.

"అసలా శరశ్చంద్ర గారింటికి మీ అక్కయ్య ఎందుకు వెళ్లాల్సివచ్చింది?"

శీనూ, శ్రీదేవి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు, చెప్పాలా వద్దా అన్నట్టు.

"ఐ మీన్... ఆయనకూ, అరవిందకూ ఎలా పరిచయం? జస్ట్.. ఓ డాక్టర్‌గా అనుకున్నా ఆమె క్లినిక్కి వెళ్లాలిగాని ఒకటికి రెండుసార్లు ఇంటికి వెళ్లాల్సిన అవసరం ఏముంది?"

మళ్లీ ముఖాముఖాలు చూసుకుంటున్న శ్రీదేవీ శీనులతో అన్నాడతను "నా ప్రశ్నకు తప్పుగా అర్థం చేసుకోవద్దు. కొన్ని నిజాలు తెలిస్తే అరవింద మళ్ళీ మామూలు మనిషౌతుందన్న ఆశ నాది"

ఇక అతని దగ్గర నిజం దాచడం భావ్యం కాదనిపించింది శీనుకి. అందులోనూ అతడు అరవిందకు కావలసిన మనిషి. చెప్పడంలో నష్టం లేదని కూడా అన్పించింది. అందుకే అన్నాడు "అక్కకు ఓ రోజు దార్లో ఓ లెదర్ హేండ్‌బాగ్ దొరికిందండీ. అందులో కాస్త డబ్బుతోపాటు ఓ డైరీ కూడా ఉంది. అడ్రస్ వెరిఫై చేస్తే అది శరశ్చంద్రగారి మిసెస్ యామిని గారిదని తేలింది. ఆమె సొసైటీ లేడీ అని మంచి హెల్పింగ్ నేచర్డ్ అనీ అక్క ఫ్రెండ్ అక్కకు చెప్పిందట. ఆవిణ్ణోసారి చూడాలన్న ఆశతో ఆ మరునాడనుకుంటా... సరిగ్గా గుర్తులేదు. అక్క ఆ బ్యాగ్ అందజెయ్యడానికి తన ఫ్రెండ్ భానురేఖతో కలిసి వెళ్లింది. వీళ్ళు వెళ్ళిన రోజే యామినిగారు యాక్సిడెంట్‌లో చనిపోయారు. ఆ గందరగోళంలో అదివ్వడం ఇష్టం లేక అక్కయ్య వెనక్కొచ్చేసింది. తరవాత ఒకటి రెండుసార్లు నాతో దాన్ని శరశ్చంద్రగారి క్లినిక్కి ఇచ్చి పంపింది. భార్య పోయిన దుఃఖంలో డాక్టర్‌గారు క్లినిక్కి రావడమే మానేశారని తెలిసింది. ఇక ఆ డైరీ గురించి కొన్నాళ్లు ఎవరమూ పట్టించుకోలేదు. ఆ తరువాత

అక్క రెండుసార్లు స్వయంగా వాళ్ళింటికి వెళ్లింది. రెండోసారి వెళ్లినప్పుడు ఈ వింత జరిగింది" శీను ఆగాడు.

వంశీ కళ్లు మెరిశాయి. "అయితే మీ అక్కయ్య ఎప్పుడో ఆ డైరీని పూర్తిగా చదివేసి ఉంటుంది. అన్నట్టు మొదటిసారిగా ఆమె శరశ్చంద్ర గారింటికి వెళ్ళినప్పుడు... యామిని గారి డెడ్ బాడీని చూసిందటనా? "

"ఆఁ... బాగా దగ్గరగా చూసిందట"

"సో... అనుకోకుండా డైరీ దొరకటం... ఆ డైరీ సొంతదారు చాలా మంచి మనిషని తెలియడం, ఆవిణ్ణి చూడాలన్న కోరికతో అరవింద అక్కడికి వెళ్లడం... ఆవిడ ఆ రోజే రోడ్ యాక్సిడెంట్‌లో పోవడం... ది సీజ్ ఆల్ యాక్సిడెంటల్ బట్ ఆ సంఘటన అరవింద మెదడుని ఆమెకు తెలీకుండానే టచ్ చేసి ఉంటుంది. షి టుక్ హర్ డెత్ టు ద హార్ట్. ఆ సమయంలోనే నేను స్టేట్స్‌కి వెళ్ళానన్న వార్త తెలియడం ఆమెను బాగా డిస్టబ్ చేసి ఉంటుంది. ఆ డిప్రెషన్‌లో ఆమె ఆ డైరీని చదివి ఉంటుంది. అరవిందగా ఆ ఫ్రస్టేషన్‌ని భరించలేక యామినిలా ఫాంటసీలోకి వెళ్ళిపోయి డైరీలో చదివిన విషయాల్ని వల్లెవేస్తూ అందర్నీ ఈమె 'యామినే' అని నమ్మేలా చేస్తోంది. ఇట్స్ ఎ కైండాఫ్ మెంటల్ డిజార్డర్".

శీను పెదవి విరిచాడు. 'అతి దగ్గరి వాళ్ళూ... అన్నీ నువ్వే అనుకున్న వాళ్ళూ చనిపోతే మీరు చెప్పినట్టూ అవతలివాళ్ల మరణం మన గుండెను తాకి షాక్కి గురిచేస్తుందిగాని కనీసం యామినిగారెవరో కూడా అక్కకు తెలియదు. అలాంటిది ఆమె చావుని అంత డీప్‌గా ఎందుకు తీసుకుంటుంది? "

"అలా కాదంటే... ఇంకో రీజనింగ్ చెప్పుకోవచ్చు జస్ట్ తనలా నటిస్తూ ఉండి ఉండవచ్చు"

**ది సీజ్ ఆల్ యాక్సిడెంటల్ బట్ ఆ సంఘటన అరవింద మెదడుని ఆమెకు తెలీకుండానే టచ్ చేసి ఉంటుంది. షి టుక్ హర్ డెత్ టు ద హార్ట్. ఆ సమయంలోనే నేను స్టేట్స్‌కి వెళ్ళానన్న వార్త తెలియడంతో బాగా డిస్టబ్ అయింటుంది.**

"అంత అవసరం మా అక్కకేముంది? " రోషంగా అంది శ్రీదేవి.

"మీ కుటుంబానికి ఎకనామికల్ సపోర్ట్ ఇవ్వాలన్న ఉద్దేశం కావచ్చు"

ఒళ్లు మండిపోయింది శ్రీదేవికి "అదే... అదేనండీ నేనిందాకట్నుండీ మొత్తుకునేది. అలా అనుకుంటారనే ఈ పెళ్ళీ పెటాకులూ నా కొద్దనేది. జనం కూడా మీ అంత వరస్ట్‌గానే ఆలోచిస్తున్నారు. అలా అనే నేనూ అనుకుని అక్కను హర్ట్ చేశాను. అది భరించలేక అక్క పడిపోతే యామిని ఆత్మ నాకు బుద్ధి చెప్పింది"

"ఐ యామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ" వంశీ సిన్సియర్‌గా అన్నాడు అనాలోచితంగా తనన్న మాటకు నొచ్చుకుంటూ...

శ్రీదేవి ఆపలేదు. "ఇలా అపార్థం చేసుకుని అక్కను ఏ ఫ్రాడ్ కిందో జమకట్టి పోలీసులకి అప్పగిస్తారన్న భయంతో నేనండీ ఈ డైరీ గురించి మేమెవ్వరికీ చెప్పలేదు. దయచేసి మీరీ విషయం ఎక్కడా నోరు జారకండి. మా అక్కను మనసారా ప్రేమించిన వ్యక్తిగా ఆమెకు ఈ ఒక్క సాయం చేయండి చాలు".

అప్రతిభుడై చూశాడు వంశీ. ఎలాగో గొంతు పెగుల్చుకుని అన్నాడు "నన్ను మీరు పూర్తిగా మిస్సండర్‌స్టాండింగ్ చేసుకున్నారు."

శ్రీదేవి అతడి వంక చూసింది కాని ఏం మాట్లాడలేదు.

"అరవింద ఇలా కావటానికి ఇది కారణమై ఉంటుందేమో అన్న కోణంలోంచే నేను మాట్లాడుతున్నానుగాని, ఆమెని ఫ్రాడ్ గా రుజువు చేయాలని కాదు. నా తపన ఆమెను మామూలు మనిషిగా మార్చి నా మనిషిగా చేసుకోవాలని. దట్సాల్"




## కాపురం... పండంటి కాపురం!

నిత్య కలహాల కాపురం - కలతలు లేని పండంటి సంసార సూత్రం అంటూ ఆ వృద్ధ దంపతులు ఢంకా బజాయించి మరీ డ్యూయెట్ పాడుకుంటున్నారు. అదేంటీ అంటే అదంతే అంటున్నారు. ఎలా సాధ్యం అని ప్రశ్నిస్తే మా సంసారం చూస్తే తెలియడంలా అని జవాబిస్తున్నారు. బ్రిటన్ హోల్ మొత్తంలో సుదీర్ఘ వైవాహిక బంధంలో పెనవేసుకుపోయి పరవశించిపోతున్న జంట వాళ్లేనట. ఫ్రాంక్, అనితా మిల్ఫోర్ట్ అనే ఈ వృద్ధ దంపతులు 78వ వివాహ వార్షికోత్సవాన్ని ఈ మధ్య ఆనందంగా జరుపుకున్నారు. అది బ్రిటిష్ రికార్డు. మీ దాంపత్య విజయ రహస్యం ఏమిటీ అని ఆరా తీసిన వాళ్లకి ప్రతిరోజూ వాదించుకోవడమే అని బదులిస్తున్నారు. ఫ్రాంక్ వయసు 98 సంవత్సరాలు. డాక్ కార్మికుడిగా పనిచేసి రిటైరయ్యాడు. అనిత వయసు 97 సంవత్సరాలు. మేం ప్రతిరోజూ కళ్లలో కళ్లు పెట్టి పరవశిస్తూ కూర్చోం. ప్రతి రోజూ చిన్నదో పెద్దదో దేనికో ఒకదానికి వాదులాడుకుంటూనే ఉంటాం. అయితే మాత్రమేం. మేమిద్దరం ఒకరి కొకరం ఎప్పుడూ తోడూ నీడగా ఉంటాం అని చెబుతున్నాడు ఫ్రాంక్. ప్రస్తుతం వాళ్లు ఎనభై ఏళ్ల వైవాహిక బంధపు రికార్డు సాధించడం మీద దృష్టి నిలిపారు. బ్రిటన్లో అదే సుదీర్ఘ వైవాహిక రికార్డు కానుందట. ఆ రికార్డును సాధించి తీరతాం అని అనిత ధీమా వ్యక్తం చేస్తోంది. అంతేకాదు, ఈ రోజుల్లో పెళ్లిళ్లు-ఎందుకు పెటాకులవుతున్నాయో అర్థం కావడం లేదంటూ ఆశ్చర్యం ప్రకటిస్తోంది కూడా. ఈ వృద్ధ దంపతులు 1928 మే 26న వివాహం చేసుకున్నారట.

## రుమేనియా హరిశ్చంద్రుడు!

అలనాడెప్పుడో హరిశ్చంద్రుడు అప్పు తీర్చలేక ఆలిని తాకట్టు పెట్టేశాడు. ఆ తర్వాత జూదంలో ధర్మజుడు భార్యను పణంగా పెట్టి ఓడిపోయాడు. అలనాటి ఆ పురాణ గాథలకు తీసిపోని సంఘటనలు ఈ కలియుగంలోనూ అడపా దడపా వినిపిస్తూనే ఉన్నాయి. రుమేనియాలో ఒక ప్రబుద్ధుడు ఇప్పుడు అదే పని చేశాడు. అప్పులు తీర్చలేక రుణదాతకు భార్యను అప్పగించేశాడు. టిఘిసు నౌ అనే ప్రాంతానికి చెందిన ఇమిల్ లాంకు అనే వ్యక్తి 72 ఏళ్ల జోజెఫ్ జస్టిన్లో స్టీకి 1800 పౌండ్లు బాకీ ఉన్నాడు. ఆ బాకీ వసూలు కోసం వచ్చిన జోజెఫ్కు లాంకు తన భార్య డానియెలాను అప్పగించి చేతులు దులుపుకున్నాడు. బాకీ తీర్చడానికి "నా దగ్గర డబ్బులు లేవన్నాడు. బాకీ తీర్చలేకపోతే నీ భార్యను తీసికెళతానన్నాడు జోజెఫ్. కాదంటే అతడేం



చేస్తాడోనని భయపడ్డాను. అందుకే నా భార్య అతడితో కలిసి జీవించడానికి ఒప్పందం కుదుర్చుకున్నాను' అని తన చేతకాని తనాన్ని ఘనంగా చాటుకుంటున్నాడు. అయితే అతడి తెలివిమాలిన ఒప్పందం మాత్రం డానియెలాకు వరంగానే మారింది. 'ఇంతకు మునుపు ఇంటెడు చాకిరీ చేయాల్సివచ్చేది. ముగ్గురు పిల్లల్ని నేనే సాకవలసి వచ్చేది. ఇమిల్ ఏ పనీ చేసేవాడు కాదు. ఇప్పుడు జోజెఫ్ ఇంట్లో నాకు అతిథి దర్జా లభిస్తోంది. పిసరంత కష్టపడాల్సిన పని ఉండడంలేదు అంటూ సంతోషపడిపోతోంది.

## నిఖార్సైన నేస్తం!

నీ మేలు మరువను నేస్తం - నీలోన ప్రాణజ్యోతినై వెలుగుతా సతతం అంటూ అతగాడు చేసిన త్యాగం అబ్బురం, అపురూపం! అడుగుకో అరడజను స్వార్థబుద్ధులు ఎదురయ్యే ఈ ధూర్త లోకంలో అలాంటి వాళ్లుండడం అబ్బురం కాకపోతే మరేమిటి అనిపిస్తుంది.- ఈ ఉదంతం చదివితే. రెంజో పివిక్ బోస్నియాలోని బొసాన్స్కి బ్రాడ్ పట్టణవాసి. అతగాడు పరవళ్లు తొక్కుతున్న బోస్నా నదిలో పడిపోయి ఆపన్నహస్తం కోసం అల్లాడుతుంటే ఆ దారిన పోయే అహ్మెట్ అదులోవిక్ చూశాడు. తన ప్రాణాన్ని సైతం లెక్క చెయ్యక అమాంతం నదిలోకి దూకి రెంజోను రక్షించాడు. ఇది జరిగింది రెండు దశాబ్దాల క్రితం. అప్పటి నుంచి ఇద్దరూ మంచి మిత్రులయ్యారు. కాలక్రమంలో అదులోవిక్ కెనడాకు వలస వెళ్లాడు. అతడు మూత్రపిండాల సమస్యతో బాధపడుతున్నాడని రెంజోకు తెలిసింది. వెంటనే అతడు రెక్కలు కట్టుకుని ఒట్టావాలో వాలి మిత్రుడికోసం తన మూత్రపిండం దానం చేయడానికి సిద్ధపడ్డాడు. వైద్యులు పరీక్షలు నిర్వహించి అతడి మూత్రపిండం అదులోవిక్‌కు అమర్చడంవల్ల ఎలాంటి సమస్యలు ఉండవని నిర్ధారించుకున్నాక ఆ పని కానిచ్చేశారు. ఇరవై ఏళ్లక్రితం నా ప్రాణాలు కాపాడిన మిత్రుడి రుణాన్ని ఎట్టకేలకు తీర్చుకున్నానంటూ రెంజో సంతోషపడుతున్నాడు. రెంజోకు భార్యా, పిల్లలు ఉన్నారు. అతడు తన మూత్రపిండాన్ని త్యాగం చేయడం నాకిష్టం లేదు. కానీ ఎంతో పట్టుపట్టి నన్ను ఒప్పించాడు. ఇప్పుడు మా ఇద్దరిదీ రక్త సంబంధం అని అదులోవిక్ కృతజ్ఞతా పూర్వకంగా పేర్కొంటున్నాడు.



ఆతడి చివరి మాటలతో శ్రీదేవి నొచ్చుకుంది. తను అలా అనకుండా ఉండాల్సింది అనుకుంటూ. "సారీ" అంది తల దించుకుని.

శీను కల్పించుకుంటూ "పోనీ... అక్క డైరీలో చదివిన విషయాల్నే వల్లేవేస్తోందనుకుందాం. మరి యామినీ పేరెంట్స్‌తో తన బాల్యాన్ని గురించి అంత వివరంగా ఎలా చెప్పగలుగుతుంది? శరశ్చంద్ర హయ్యర్ స్టడీస్‌కి స్టేట్స్‌కి వెళ్ళినప్పుడు అక్కడే పుట్టి పెరిగిన ప్రవాస భారతీయుల అమ్మాయి యామిని ఆయన్ని ప్రేమించిందట. శరశ్చంద్రకు ఆమెతోపాటూ స్టేట్స్‌లోనే ఉండిపోయే ఉద్దేశం లేకపోవడంతో ఆయన కోసం అమెరికాను వదులుకుని ఇండియా వచ్చేసిందట. ఆ పీరియడ్‌లో జరిగిన చిన్న చిన్న సంఘటనల్ని కూడా పూసగుచ్చినట్టు చెబుతోందట". అన్నాడు.

వంశీకి తన రీజనింగ్‌లోని లోపం స్పష్టంగా అర్థమైంది.

మరి అరవిందను... నిజంగానే యామిని ఆత్మ...

'నో'... తల విదిలించుకున్నాడతను.

వెంటనే లేచి నిలబడి "నేనోసారి అరవిందను కలిశాకా మళ్ళీ ఇక్కడికొస్తాను" అని బయటకు నడిచాడు.

డైరీ విషయం లీక్ చెయ్యొద్దని శ్రీదేవి మరోసారి అతణ్ణి కోరింది. అతడు అలాగే అని వెళ్ళిపోయాడు.




ఉదయం ఆరయ్యి కాకుండానే వచ్చిన అశ్వనిని చూసి ఆశ్చర్యపోయింది రోమా ఆనంద్.

ఆమె యామిని తల్లి. అసలు పేరు రమాదేవి గాని ఆనందరావుని పెళ్ళాడి అమెరికా వెళ్లిపోగానే రమా అన్న పదాన్ని అక్కడి యాస రొమాగా మార్చింది.

"హాయ్ అశ్వనీ... ఏంటి ఇంత ఉదయాన్నే" అనడిగింది.

అదే ఆశ్చర్యాన్ని ధ్వనింపచేస్తూ "అదేంటో ఆంటీ నిద్ర లేవగానే యామినిని చూడాలన్పించింది, వచ్చేశా"

"బేబీ ఇంకా నిద్ర లేచినట్టు లేదు. లేపనా? " అడిగిందావిడ.

"అక్కర్లేదాంటీ. నే లేపుతాను" అశ్వని మెట్లెక్కి అరవింద గది వైపు వెళ్లింది.

శరశ్చంద్ర గదికి పక్కదే అరవింద గది. వెళ్లి మెల్లగా వేళ్లతో కొట్టింది తలుపు మీద. ఓ నిముషం చూసి తలుపింకా తెరుచుకోకపోవడంతో మళ్లీ తట్టబోయింది గాని అరవింద అప్పటికే లేచొచ్చి తలుపు తెరిచింది. కళ్లు నులుముకుంటూ అశ్వనికేసి చూసింది 'అరె... ఇంత ఉదయాన్నే వాట్ ఎ సర్‌ప్రైజ్!' అన్న భావం కళ్లలో కదులుతుండగా "గుడ్ మార్నింగ్ అనీ" అంది అశ్వనిని లోపలికి రానిస్తూ.

అశ్వని వచ్చి ఆమె బెడ్ మీద కూర్చుంది. అరవింద ఒళ్లు విరుచుకుని ఆమెకెదురుగా తనూ కూర్చుంది. విషయం ఏంటన్నట్టు చూస్తూ "తెల్లవారుఝామున నీ మీదో పీడకలొచ్చింది యానీ. నిన్ను వెంటనే చూడాలన్పించింది. ఆగలేక పరుగెత్తుకొచ్చేశా. హమ్మయ్య... ఇప్పటికి నా మనసు కుదుటపడింది" ఓసారి రిలాక్స్‌డ్‌గా కళ్లు మూసి తెరిచి మళ్లీ అంది, "బంగారంలాంటో... వెండిలాంటో నా నిద్ర పాడు చేసింది అని తిట్టుకోవు కదా!"

"తిట్టుకునేలోపు నువ్వొచ్చిన కారణం చెప్పేశావ్‌గా! క్షమించానుగాని... ఆ కలేంటో చెప్పు"

"అబ్బా నిద్ర లేవగానే ఆ వెధవ గోలెందుగ్గాని ముందు నువ్వు బ్రష్ చేసుకు రాపో. తరువాత తీరిగ్గా చెబుతా"

అరవింద ఆ రూమ్‌కి అటాచ్డ్‌గా ఉన్న బాత్‌రూమ్‌లోకి వెళ్లగానే పిల్లిలా నెమ్మదిగా లేచింది అశ్వని. తలుపువైపు చూసి ఎవరూ రావడం లేదని నిర్ధారణ చేసుకుని మెల్లగా

వార్డ్ రోబ్ వైపు నడిచింది.

ఎ.సి. వర్క్ చేస్తున్నా కూడా అశ్వని నుదుటన చెమటలు పడుతున్నాయి. ఊపిరి బిగబట్టి గబగబ వార్డ్‌రోబ్‌లోని చీరెల్ని అటు ఇటూ కదుపుతూ వెదకసాగింది.

చకచక కదులుతున్న ఆమె వేళ్లకు కావలసిన వస్తువింకా తగల్లేదు.

"యామిని బతికున్నప్పుడు తనకది ఇక్కడే పెట్టటం అలవాటు. అరవింద గాని దాన్ని ఇంకో చోట..."అనుకుంటూ చేయి ఇంకాస్త లోపలికి పోనిచ్చింది. ఈ సారి ఆమె చేతి వేళ్లకు వెంటనే తగిలిందది.

"ఐయామ్ లక్కీ ఇన్ డీడ్'! అనుకుంది. కళ్లు మెరుస్తుండగా దాన్నందుకుని తన హేండ్ బ్యాగ్‌లో వేసుకుంది.

మరో అయిదు నిమిషాల్లో ఉడుకులాం పరిమళాలు వెదజల్లుతున్న కురుల్ని టర్కీ టవల్‌తో రబ్ చేసుకుంటూ వచ్చింది అరవింద.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. మాటల మధ్యలో "మీ పేరెంట్స్ ఇంకా ఎన్నాళ్లుంటారిక్కడ? "అని అడిగింది అశ్వని.

"ఓ నెల్రోజులుండొచ్చు. ఏం? "

"ఏం లేదు... మా యింటికి డిన్నర్‌కి ఆహ్వానిద్దామని. పద. వాళ్లని ఇన్వైట్ చేసి నే వెళ్తాను" అంటూ లేచింది అశ్వని.

ఇద్దరూ కిందికి దిగారు.

అశ్వని కాఫీ తాగుతూ రామా ఆనంద్‌తో రమామణితో కాసేపు మాట్లాడి, ఆమెనూ, ఆమె భర్తనూ తమ ఇంటికి డిన్నర్‌కి ఆహ్వానించింది. కర్టెసీ కోసం రమామణిని కూడా ఆహ్వానించింది.

ఆసరికి శరశ్చంద్ర కూడా లేచి స్నానం కానిచ్చి కిందికొచ్చాడు. ఆయన్ని పలకరించి టిఫిన్ చెయ్యమని అందరూ బతిమాలుతున్నా వినకుండా బయట పడింది అశ్వని.

"కల చెప్పకుండానే వెళ్ళిపోతున్నావ్" అరవింద అంది.

"వద్దులే యామీ... పాడు కల... చెప్పాల్సిన అవసరం ఏముంది? నిన్ను చూశాకా నాకా టెన్షన్ పోయింది"

కాస్త దూరం పోయాక హేండ్ బ్యాగ్ ఓపన్ చేసి యామిని రూమ్‌లో తను కొట్టేసిన వస్తువుకేసి తృప్తిగా చూసుకుంది.

* * *

శ్రీదేవి ఇంటి నుండి వచ్చాక శరశ్చంద్రను క్లినిక్‌లో కలిశాడు వంశీ. తనకు అరవింద ప్రవర్తన మీద అనుమానం ఉందనీ... ఒక్కసారి యామినిగారి డైరీని తనకిస్తే అందులో విషయాలను చదివి అరవింద నటనకు అది బేస్ అవునా కాదా తేల్చేస్తాననీ చెప్పాడు.

శరశ్చంద్ర ఆ ప్రపోజల్‌ని అంగీకరించలేదు. "నా భార్య డైరీని ఎవరికో ఇచ్చి చదువుకోమనేంత విశాల హృదయం నాకు లేదు" అన్నాడు. పైగా "అరవింద... యామినిగా బిహేవ్ చెయ్యటం మొదలెట్టిన కొత్తల్లోనే నేనా డైరీలో రాయబడిన సంఘటనల్నీ ఆమె ఏకరువు పెట్టే సంఘటనల్ని బేరీజు వేసి చూశాను. అప్పుడే ఆమె చెప్పే విశేషాలు కేవలం డైరీకే పరిమితం కాదని అర్థమైంది నాకు. డైరీలో మెన్షన్ చెయ్యని, ఎన్నో ఇన్సిడెంట్స్‌ని ఆమె అనుభవించినంత మామూలుగా చెప్పేస్తుంది. చివరికి అమెరికాలో గడిపిన తన బాల్యాన్ని సైతం. సో... మై బోయ్... డైరీ చదవాలన్న ఆలోచన మానెయ్" అని కూడా అన్నాడు.

వంశీ ఇక ఆయనతో ఆ విషయం పొడిగించడం అనవసరం అనుకుని లేచి వచ్చేశాడు.

ఓ రోజంతా తీవ్రంగా ఆలోచనలో మునిగిపోయాడు.

అరవిందను తికమక పెట్టి క్లూ లాగాలంటే తనకు యామిని గురించిన పర్సనల్ విషయాలు, కనీసం కొన్ని తెలియడం అవసరం. ఈ విషయమేదో త్వరగా తేలాలి. తనకు మంజూరయిన సెలవు అయిపోవస్తోంది. వర్మ... ఎంత కాలం ఉంటావ్ ఇండియాలో అన్నప్పుడు అరవింద మామూలు మనిషయ్యే వరకూ ఎంత కాలమైనా సరే అన్నాడే కాని, అది కుదరదని తనకు స్పష్టంగా తెలుసు. తనేం అమెరికాకి టూరిస్ట్ గానో, బంధువుల్ని కలుసుకోడానికో వెళ్ళలేదు. వీసా ప్రకారం

టైమున్నా ముందుగా గుడ్‌బై చెప్పి అమెరికన్ భూభాగాన్ని వదిలి వచ్చెయ్యడానికి.

తనెళ్లింది ఎంప్లాయ్‌మెంట్ కోసం. అగ్రిమెంట్‌కి కట్టుబడి పని చెయ్యాల్సిందే! సో... ఇక్కడి ఈ లైఫ్ అండ్ డెత్ సమస్య. ఎంత త్వరగా క్లియరైతే అంత మంచిది.

తనేం చేయాలి?

సతమతమైపోతున్న వంశీ వర్మ ఇంటికి వెళ్ళి తన ఆలోచన గురించి చెప్పాడు. అప్పుడే అశ్వని చెప్పిన మాటలు ఊరట కలిగించాయి. యామిని తనకు బాగా క్లోజ్ కాబట్టి ఏదో ఒక ఉపాయంతో డైరీ తెచ్చిస్తానని చెప్పింది. మాట తప్పకుండా అలాగే చేసింది.

ప్రస్తుతం యామిని డైరీ వంశీ చేతుల్లో ఉంది. గది తలుపులు బిగించుకుని దాన్ని ఆసాంతం చదువుతున్నాడతను-తల్లి భోజనానికి పిలిచినా పట్టించుకోకుండా.

కొన్ని పేజీలు చదువుతున్నప్పుడు మాత్రం అతడు చాలా తప్పు చేస్తున్నవాడిలా గిల్టీగా ఫీలయ్యాడు- కొన్ని కొన్ని రాతలు పూర్తిగా వ్యక్తిగతమైనవి కావడంతో.

శరశ్చంద్ర డైరీని తనకివ్వడానికి ఎందుకు నిరాకరించాడో అప్పుడర్థమైందతడికి !

అయినా చదవక తప్పదు.

తన పంచప్రాణాలూ తనకు దక్కాలంటే తన కలల తోట విరగబూయాలంటే, తను దాన్ని చదవాల్సిందే.

ఆ తప్పుని తప్పనిసరిగా చెయ్యాల్సిందే.

ఆ రోజు సాయంత్రం వరకూ ఆ డైరీని చదువుతూనే ఉన్నాడు. చదవాడనేకన్నా కంఠతా పట్టేశాడని చెప్పొచ్చు

మలి సంధ్య ఆకాశానికి అద్దిన ఆరెంజ్ రంగుల్ని మునిమాపొచ్చి మింగేశాక, అతడు గది తలుపుల్ని తెరుచుకుని బయటకొచ్చాడు.

"భోంచెయ్యవా వంశీ? " అని తల్లి నిలదీస్తున్నా విన్పించుకోకుండా "ఇప్పుడే వస్తా" అంటూ బుల్లెట్ మీద బయలుదేరాడు.

ఇరవై నిముషాల అనంతరం అశ్వని ఇంటి ముందు బైక్ ఆపి డైరీని ఆమెకు అందజేశాడు.

"ప్లీజ్... ఇది మళ్లీ..."

"యధాస్థానంలో పెట్టే పూచీ నాది. యూ డోంట్ వర్రీ" నవ్వింది అశ్వని.

"అదివ్వాళే జరగాలి. అరవింద దీన్ని మిస్సింగ్‌ని నోటీస్ చెయ్యలేనంత త్వరగా"

"డెఫినిట్లీ. ఇప్పుడే వెళ్తాను" ఆమె భరోసా ఇచ్చింది.

"డైరీ చదివావ్ కదా! ఇప్పుడే మన్పిస్తోంది" వర్మ అడిగాడు.

"ఆమె నటనకు ఇదొక్కటే ఆధారం కాదు అని అర్థమైంది" చెప్పాడు వంశీ.

"యు మీన్..."

"ఐ మీన్... ఈ డైరీ యామిని శరశ్చంద్రతో వివాహం జరిగాక రాసుకున్నది. అదీ ఆమె అలవాటుగా రోజూ రాయలేదు దీన్ని. ఎప్పుడైనా... హార్ట్ టచింగ్ ఇన్సిడెంట్ ఎదురైనప్పుడు మాత్రమే దాన్ని డైరీలో రాసుకుంది. ఇందులో ఆమె బాల్యాన్ని గురించిన ప్రస్తావనే లేదు"

"అంటే... అరవింద... యామిని బాల్యంలోని సంఘటనల్ని అలవోకగా ఏకరువు పెడుతోందంటే... ఆమెలో యామిని ఆత్మ ఉన్నట్టేగా? " అశ్వని కళ్ళు వెడల్పు చేసి అబ్బురంగా చూసింది వంశీకేసి.

"నో" తనకు తెలీకుండానే పెద్దగా అనేశాడు వంశీ. అంతలోనే సర్దుకుని "సారీ. ఎటువంటి పరిస్థితుల్లో కూడా నేనా నిర్ణయానికి రాను. ఒకవేళ నిజంగానే యామిని ఆత్మ అరవిందలో ఉన్నా కూడా నేనామెను అరవిందగానే యాక్సెప్ట్ చేస్తాను. ఎందుకంటే ఆమె, ఆమె... నా ప్రాణం" రెండు చేతులతో ముఖాన్ని కప్పుకున్నాడతడు. వర్మ వంశీ భుజం తట్టాడు.

"డోంట్ గెట్ ఎగ్జయిటెడ్. ఐ హోప్ యూకెన్ సాల్వ్ దిస్ మిస్టరీ"

## 14

"మీరు అశ్వని బంధువు కదూ!"

"గుర్తు పట్టారే? "

"ఎలా మర్చిపోతాను? నా ఆతిథ్యం బాగా లేదని నా ముఖాన్నే ఫ్రాంక్‌గా గుడ్ బై... చెప్పి వెళ్ళిన వ్యక్తిని! ఆ రోజు పార్టీ మధ్యలో

వెళ్ళిపోయారెందుకు? "
"మీకిలా గుర్తుండి పోవడానికి!"
అరవింద అర్థం కానట్టు వంశీ ముఖం లోకి చూసింది. "యు మీన్..."
"ఏం లేదు. కామ్‌గా డిన్నర్ తీసుకుని థేంక్స్ చెప్పి వెళ్లిపోతే అందరిలో నేనూ ఒకణ్ణి అయ్యుండేవాడిని. తీసుకోకుండా అలిగిపోయాను కాబట్టి మీరింత ప్రత్యేకంగా జ్ఞాపకం పెట్టుకున్నారు"
తల కాస్త పైకెత్తి కళ్లు మూసుకుని గలగల నవ్వేసింది అరవింద.
తన అరవింద ఎప్పుడూ ఇలా నవ్వదు. ప్రభాత కాంతి పడి నిశ్శబ్దంగా రేకులు విప్పుతున్న పువ్వులా నవ్వుతుంది.
"మీరు భలే గమ్మత్తుగా మాట్లాడతారే!" ఆమె ఇంకా నవ్వుతోంది.
ఎన్నో ఏళ్ళుగా తనకు తెలిసిన అరవింద తనెవరో తెలీనట్టూ, అసలూ తనకీ ఆమెకూ ఏ బంధమూ లేనట్టూ, అతి మామూలుగా ముఖంలో ఏ తొట్రుపాటూ లేకుండా కేవలం ఓ కొత్త వ్యక్తితో మాట్లాడుతున్నట్లుగా మాత్రమే అలా ఎలా నటించగలుగుతోంది?
అరవింద నవ్వడం ఆపింది. "చెప్పండి... ఏంటిలా వచ్చారు? మళ్లీ నాకు గుర్తుండిపోయే పనేదైనా చెయ్యాలనా? "
నీతో గడిపిన ఎన్నో క్షణాలు నాలో తీపి గుర్తులుగా మిగిలిపోయాయి. అలాంటి అన్ని గుర్తులూ నిర్దాక్షిణ్యంగా చెరిపేసుకుని ఇంత నిర్వేదంగా ఉన్న నీకు... గుర్తుండిపోయే పని నేనేం చెయ్యగలను.
అతడి మనసు మూలిగింది. "ది సీజ్ మై మదర్ మిసెస్ రోమా ఆనంద్"
వంశీ నమస్కరించాడు.
"పాపం తులసమ్మగారు నీకేమీ కారా? " వంశీ మనసు ప్రశ్న.
"ఆయన మా నాన్నగారు... మిష్టర్ ఆనంద రావ్... ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్"



"నైస్ మీటింగ్" ఆయన చెయ్యి చాపాడు.

ఆ చేతిని అందుకుని కరచాలనం చేశాడు వంశీ.

"మీరు? " ఆనందరావ్ అర్థోక్తిలో ఆగాడు.

"కంప్యూటర్ ఇంజనీర్ని. ఉద్యోగరీత్యా సియాటిల్‌లో ఉంటున్నా"

"వాట్... స్టేట్స్‌లో...!"

"అవునండీ... ఇండియాలో ఓ ముఖ్యమైన పనుండి, ఓ నెల రోజులు సెలవు పెట్టి వచ్చాను. బైదిబై... మీరు స్టేట్స్‌లో సెటిల య్యారని విన్నాను!"

"యాఁ మేముండేది న్యూయార్క్‌లో. నెక్స్ట్ వీక్ వెళ్లిపోతున్నాం. నువ్వక్కడికొచ్చాక... లెటజ్ మీట్ దేర్"

ఆయనలా అంటుంటే ఆయన భార్య కూడా అతణ్ణి ఆహ్వానించింది. తరువాత ఇద్దరూ బంధువు లెవర్నో కలవాలని వెళ్లిపోయారు.

"నాకు ఒకటే బెంగండీ. అక్కడ వీళ్లెలా ఉంటున్నారో అని. అన్నయ్య ఉద్యోగరీత్యా ఎంపోరియంలో ఉంటున్నాడు. వీకెండ్స్‌లో కలుస్తుంటారనుకోండి. ఎంతయినా వాడి ఫ్యామిలీ వాడిది"

"మీ ఫ్యామిలీ మీదైనట్టు" అతడన్నాడు.

"అబ్బో చురక అంటిస్తున్నారే!" అరవింద నవ్వింది. "మా వారి కోసం అమెరికా లైఫ్ నీ...అమ్మా నాన్నల్నీ... వదిలేసి వచ్చేశాను"

"ఇండియా కోసం కాదన్నమాట"

"ఇండియాలోని ఒక మనసు కోసం"

"మొత్తానికి గొప్ప త్యాగమే చేశారు. ఓసారి అమెరికా లైఫ్‌కి అలవాటు పడితే... ఇక్కడ బతకటం కష్టమే. కానీ మీలా కొందరు ఎందుకు వచ్చేస్తుంటారంటే... అందమైన జీవి తంకన్నా అనుబంధం గొప్పది కనుక"

"మీ ఫిలాసఫీ బాగుంది" ఆమె నవ్వి మళ్లీ అంది.

"అప్పుడప్పుడూ వెళ్ళి కాస్త మా పేరెంట్స్‌ని పలకరిస్తూండండి"

"తప్పకుండా. న్యూయార్క్‌కీ... సియాటిల్ చాలా దగ్గరే కదండీ"

"సారీ..." చప్పున అంది అరవింద. "ఏదో ఆ రెండూ పక్కపక్క నున్నట్టూ చెప్పే స్తున్నా. మీరుండేది న్యూయార్క్‌కి టూ డిస్టంట్ ప్లేస్‌లో. ఐ అండర్ స్టుడ్ యువ ర్ ప్రాబ్లమ్"

"ఎంతండీ... వెయ్యి కిలో మీటర్లేగా? " వంశీ కావాలని అన్నాడు.

"మీరు అమెరికాకి కొత్త కదూ! తెలిసుం డదు. అబౌట్ థ్రీ థౌజండ్ కిలోమీటర్స్ ఉంటుందండీ"

"అయితే ఏమిటండీ? వేర్ దేరీజ ఏ విల్ దేరీజ ఏ వే. మీటయ్యే పూచీ నాది. ప్రామిస్"

"థేంక్యూ వెరీమచ్" కృతజ్ఞతగా చూసిం దామె.

"మీ బాల్యమంతా అక్కడే గడిచిందాండీ? " అతనడిగాడు.

"అసలు నేను పుట్టిందే అమెరికాలో. అయితే నాకు పదేళ్ళు వచ్చేదాకా... మేము ఫిలడెల్ఫియాలో ఉన్నాం. మా ఫాదర్ అక్కడ జాబ్ చేసే వారప్పుడు"

"ఫిలడెల్ఫియానా? అక్కడెక్కడండీ? "

"ఈస్ట్ ఫాల్స్ అనే చోట. ఏం... ఎందు కలా అడిగారు? "

"నా ఫియాన్సీ అన్నయ్య ఉండేది ఫిలడెల్ఫి యాలోనే. దట్ టూ మీరున్నచోటే. ఈస్ట్ ఫాల్స్‌లో. అతనే నాకు స్పాన్సర్ లెటర్ ఇచ్చి నేనక్కడికి వెళ్లటానికి హెల్ప్ చేశాడు"

"ఫియాన్సీ? " ఆమె కళ్లెగరేసి నవ్వింది. "ఎప్పుడండీ మీ వివాహ మహోత్సవం? "

"వచ్చే సంవత్సరంలో ఉండొచ్చు"

"ఉండొచ్చా ఏంటి? మీరేం ఇంకా టీనేజ ర్ననుకుంటున్నారా, చేసేసుకోండి త్వరగా"

"ఇప్పుడు మీరు చెప్పారుగా... అలాగే చేసు కుంటాను" అతడు ఆమె కళ్లలోకి చూస్తూ అన్నాడు.

ఆ కళ్లలో అతనాశించిన ఏ భావం కదలా డలేదు.

"అక్కడ... సీవరల్డ్ చూశారా? " ఉన్న ట్టుండి అడిగిందామె.

వంశీ చూశాడు గానీ చూళ్లేదని అబద్ధమా డాడు. అక్కడి ఐటమ్స్‌కి ఆమె కరెక్ట్‌గా చెబు

తుందో లేదో చెక్ చేసుకోవచ్చని.

"చూడదగిన ప్లేసా అది? " అడిగాడు.

మధురం ట్రేలో కాఫీ కప్పులు తెచ్చి అక్కడ పెట్టి వెళ్ళిపోయింది. "మెల్లగా అడుగుతున్నారా? ఫెంటాస్టిక్ ప్లేస్. కాఫీ తీసుకోండి. షార్క్స్ స్టేడియం, సీలయన్ టవర్స్... షాము స్టేడియం... అట్లాంటిస్ వాటర్ స్కై షో... ఒకటా... ఎన్ని ఐటమ్స్... అన్ని ట్లోకీ... షాము స్టేడియంలో కిల్లర్ వేల్స్ చేత చేయించే ఫీట్స్ మార్వెలస్. నేనెన్నిసార్లు వెళ్లానో సీ వరల్డ్ కి!" పాత జ్ఞాపకాల్ని నెమరు వేసుకుంటున్నట్టుగా అందామె.

ఎందుకో వంశీకి నీరసంగా అన్పించింది.

నేనూ శరత్ కెనడా నయాగరా ఫాల్స్ ఏడో సారి చూసొచ్చాం"

"మొన్నీమధ్య నేనూ వెళ్లాను" చెప్పాడు వంశీ.

"వెరీ బ్యూటిఫుల్ యునో!" ఆమె ఎగ్జయిటింగ్ గా చూసింది.

"నేను దాని అందాన్ని చూడ్డానికి వెళ్లలేదు. అక్కణ్ణుంచి దూకి చావాలని వెళ్లాను" కసిగా చెప్పాడు.

"అయ్యో! అదేంటి" ఆమె జాలిగా కన్ఫ్యూజ్డ్ గా చూసింది.

"ఇక్కడ నేనో అమ్మాయిని ప్రేమించాను. ఆమె నాతో పెళ్లికి నిరాకరించింది. అసలా

## భలే జోస్యం

ఒక జ్యోతిష్కుడు ఒకాయనతో మాట్లాడుతూ, 'మహాభాగ్యం.. అమేయమైన గొప్పతనం మీ ముప్ఫై రెండో ఏట పట్టబోతున్నాయి' అన్నాడు.

దాంతో ఆ పెద్దమనిషి సంతోషంతో ఉబ్బితబ్బిబ్బవుతూ 'మరి నా ఆయుస్సు ఎంతో చెప్పారు కాదు..' అని అడిగాడు.

'ఇరవై తొమ్మిదేళ్లు'

తన ఎల్ ఐసీ మిత్రుడు చెప్పాడని చలంగారు మిత్రులకు తరచూ చెప్పే జోకు ఇది.



ఆమె చెప్పేదాంట్లో తప్పులు దొర్లుతాయేమో అన్న ఆశ... అడుగంటి పోతోంది క్షణక్షణానికీ.

"మీరుండేది సియాటిల్ లో అని కదా అన్నారు. సియాటిల్ స్పేస్ నీడిల్ చూశారా? "

"చూళ్ళేదు" వంశీ ఇదీ చూశాడు. కానీ చూళ్లేదన్నాడు.

"నేనూ శరత్ ఓ సారి న్యూయార్క్ నుంచి సియాటిల్ వెళ్ళాం. అప్పుడు ఆ టవర్ మీది రెస్టారెంట్ లో డిన్నర్ తీసుకున్నాం" ఆమె తన ఇంకో జ్ఞాపకాన్ని అతని ముందుంచింది.

"పెళ్లయి ఇక్కడికొచ్చేశాక మళ్లీ అమెరికా ఎప్పుడూ వెళ్లలేదా? మీరు!"

"చాలాసార్లు వెళ్లాం బిఫోర్ లాస్టియర్...

బాధతోనే నేను దేశం విడిచి వెళ్లిపోయాను. వెళ్లాక ఉత్తరాలు రాశాను. పోనీ మనసు మార్చుకుంటుందేమోనని! అబ్బే... ఆమె ఆడది కాదు, బండరాయి. ఏ మాత్రం మారలేదు. అందుకే విరక్తితో చావాలనుకున్నా"

"ఇందాక మీ పెళ్లన్నారు... ఫియాన్సీ అన్నారు"

"అవును నా ఫియాన్సీ కోసమే మనసు మార్చుకుని చావకుండా తిరిగొచ్చాను. ప్రేమ పందెంలో ఎలాగూ ఓడిపోయాను. కనీసం మా పెద్దవాళ్ల కోరికను మన్నించాలన్పించిందా క్షణం"

"ఐయామ్ సారీ" అందామె. "మిమ్మల్ని ప్రేమించని మనిషి వెనకబడేకన్నా, మీ మీద ఆశలు పెంచుకుంటున్న ఆ అమ్మాయిని చేసు

## ద్రవం... ద్రవం... జీవద్రవం...



భయపడకండి!... వాంతులు ఎక్కువగా అవుతున్నాయా? అయితే ద్రవ పదార్థాలు ఎక్కువగా తీసుకోండి. మీ మూత్రం ముదురు పసుపు రంగులో వస్తోందేమో పరీక్షించుకోండి. అలా వస్తే మీ శరీరానికి తగినంతగా ద్రవ పదార్థాలు అందలేదన్న మాట. వెంటనే వాటిని ఎక్కువగా తీసుకోండి. వాంతుల వలన కోల్పోయిన ద్రవాల్ని భర్తీ చెయ్యాలి. మీరు తీసుకునే ద్రవపదార్థాలు నీళ్ళు గాని, టీ గాని, పళ్ళ రసాలు గాని ఏవైనా కావొచ్చు గడగడా తాగకుండా సిప్ చేయాలి.

కొంతసేపటి తరువాత మీ మూత్రం ముదురు పసుపు నుండి రంగు తగ్గి, లేత రంగుకి వస్తే... మీరు అతిసార వ్యాధి నుండి బయటపడినట్టే.

బాగా చల్లని ద్రవాలు తీసుకుంటే కొన్ని సమయాల్లో కడుపులో షాక్ కొట్టినట్టు ఉంటుంది. తాగిన ద్రవం వెంటనే వాంతయ్యే అవకాశం ఉంటుంది. కాబట్టి కూల్ డ్రింక్స్ రూమ్ టెంపరేచర్ కొచ్చాక తాగడం మంచిది.

వాంతులవటం ఆగితే, మీరు కొంచెం ఉపశమనం పొందితే తక్కువ ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు ఉండే ఆహారం, అంటే చికెన్ నూడిల్స్, చికెన్ అండ్ రైస్ సూప్ వంటివి తీసుకోవచ్చు ఇవన్నీ చేశాక కూడా వాంతులవుతుంటే తప్పనిసరిగా వైద్యుణ్ణి సంప్ర దించమంటున్నారు చికాగో మెడికల్ సెంటర్ నిపుణులు.

కోవడం ఉత్తమం. ఆ రాక్షసి కోసం అనవసరంగా చావకుండా మంచిపని చేశారు. ఇంతకీ ఎవరా అమ్మాయ్? "

వంశీ తదేకంగా అరవింద కళ్లలోకి చూశాడు.

"చెప్పండీ... ఈ ఊరే అయితే ఓసారెళ్లి లెఫ్ట్ అండ్ రైట్ ఇచ్చొస్తాను. ఎక్కడుంటుందీ... ఏం పేరు? " ఆమె నిజంగా 'ఆ అమ్మాయి'ని కొట్టేంతగా రియక్ట్ అవుతూ అంది.

"ఇప్పుడు మీరెళ్లినా వృథా"

"ఏం? " అడిగిందామె.

"ఆమె ఓ ధనవంతుడింట్లో అతడితో కలిసి జీవిస్తోంది"

"ఇట్ మీన్స్...ఆమెకి పెళ్లాయిందా? "

"తెలీదు"

"అదేంటి? "

"ప్లీజ్... లీవ్ దట్ టాపిక్" వంశీ మునివేళ్లతో కణతల మీద రాసుకున్నాడు.

ఆమె కర్థమైంది. అతడు బాధపడుతున్నాడని అందుకే టాపిక్ మార్చి అంది "ఇంతకీ మీరు హాలీవుడ్‌లో యూనివర్సల్ స్టూడియో చూశారా లేదా? "

"ఊహుc... మీరు? "

"నా కయిదారేళ్ల వయసున్నప్పుడనుకుంటా ఓ సారి మా పేరెంట్స్ తీసికెళ్లారక్కడికి. ఇక అక్కణ్ణించి రానని మొండికేశానట!" ఆమె నవ్వింది "ఆ తరువాత ఎన్నిసార్లు చూశానో లెక్కలేదు. అది నా ఫేవరెట్ విజిటింగ్ ప్లేస్"

"ఇక వెళ్తాను" వంశీ లేవబోయాడు.

"ఇంతకీ మీరొచ్చిన పని చెప్పనే లేదు" అడిగిందామె.

"వచ్చిన పని కాలేదు" సణిగినట్టుగా అన్నాడు.

ఆమె వినపడక అడిగింది "పార్డన్ ప్లీజ్"

"మీకు సారీ చెప్పివెళ్లాలని వచ్చానంతే" అతనన్నాడు.

"ఎందుకు? " ఆమె భృకుటి ముడిచింది.

"వెడ్డింగ్ డే పార్టీలో మిమ్మల్ని హర్ట్ చేశా గా అందుకని"

"అందుకా!" అన్నట్టు నవ్విందామె.

వంశీ మరోసారి చెప్పి వెళ్లిపోయాడు.

* * *

శ్రీదేవి పెళ్లికి ఒప్పుకుంది.

అయితే అది ఓ పట్టాన కాదు. మొదట "నా బంగారు తల్లివి కదూ... కేవలం పెళ్లి చూపులే. చూశాక వద్దని చెప్పెయ్. ఎవరో ఏదో అంటారని. మనకి కావల్సిన వాళ్ల మాట పెడచెవిన పెట్టకూడదు. మనసుతో నొచ్చు కుంటారు. కనీసం వాళ్ల తృప్తికోసం అబ్బా యిని చూడమ్మా. ఆనక అంతా నీ ఇష్టం అన్నాగా" అని తులసమ్మ ఓ రోజంతా చెవి నిల్లు కట్టుకుని పోరితే ముందు అంతవరకూ ఒప్పుకుంది.

పెళ్లి చూపులయ్యాక మాత్రం పాత పాటే పాడేసింది. తులసమ్మ మళ్లీ బతిమిలాడ్డం మొదలెట్టింది. ఈసారి మాత్రం శ్రీదేవి దిగి రాలేదు. రెండురోజులు ఉదాసీనంగా గడి చాక... తులసమ్మని రమ్మని అరవింద జోగ య్యతో కబురు పంపింది.

పెళ్లి చూపులకు వచ్చిన అబ్బాయికి శ్రీదేవి నచ్చిందని ముహూర్తాలు ఎప్పుడంటూ అ డుగుతున్నారని చెప్పింది అరవింద.

కట్నం ఎక్కువేమో అంటూ తులసమ్మ ఏ దో సాకులు చెప్పబోతే విన్పించుకోలేదు.

"అంతా నేను చూసుకుంటానుగా" అంది.

"అది కాదమ్మా..." అని తులసమ్మ ఇంకా ఏదో అనబోతుంటే "మీరు అనబోయేదేమిటో మాకు తెలుసు. డబ్బివ్వటం గురించేగా. ఇంకేం చెప్పొద్దు. మీరు పెళ్లి ఏర్పాట్లలో ఉండండి." అని అప్యాయంగా ఆమె చేతులు పట్టుకుని అంది.

ఇంటికొచ్చి ఈ వార్త శ్రీదేవికి చెబితే ఆమె అగ్గిమీద గుగ్గిలమైంది. "అంతా ఆవిడిష్ట మేనా? బొమ్మల్లా ఆడిస్తోందే మనల్ని" అంటూ మండిపడింది.

"నేన్చస్తే ఈ పెళ్లి చేసుకోను" అని మొండి కేసింది.

"తొలిసారిగా వచ్చిన సంబంధం... వదులు కోకూడదమ్మా" అని తులసమ్మ బుజ్జగిం చింది.

"నువ్వు సరే అనేవరకూ నేను పచ్చిగంగ కూడా ముట్టను" అని శపథం చేసింది.

అప్పటికీ శ్రీదేవి దిగిరాకపోయేసరికి తుల సమ్మ గది తలుపులు బిగించుకుని, ఎలుకల మందు కలిపిన పాలగ్లాసు నోటి దగ్గరకు తీసుకోవడంతో దిగొచ్చి శ్రీదేవి పెళ్లికి వొప్పుకుంది.

అరవింద అన్నట్టే మరునాడే ముహూ ర్తాలు కూడా పెట్టుకున్నారు.

పెళ్లి సరిగ్గా పదిరోజులుంది.

కనీసం పెళ్లన్నా దూరంగా పెట్టుకుందా మంటే అరవింద అంగీకరించలేదు.

"దీన్నిలా జరిగిపోనివ్వండి" అంది.

ముహూర్తాలు పెట్టుకున్న రెండోరోజు వంశీ వచ్చాడు.

శ్రీదేవి లేదు. చీరలు కొనివ్వడానికి అర వింద కార్లో వచ్చి బలవంతంగా ఆమెను పికప్ చేసుకెళ్లిందని చెప్పాడు శీను.

వంశీ అనాసక్తిగా విన్నాడా విషయాన్ని.

"ఆ రోజు మా అక్కయ్యను కలిశాక వస్తా నంటూ వెళ్లారు రానేలేదిన్నాళ్లూ. అక్కను కల వలేదా? " అడిగాడు శీను.

"కలిశాను" ముక్తసరిగా అన్నాడు. ఓ నిముషం నిశ్శబ్దం తర్వాత మళ్లీ తనే "ఓ నిజం కూడా తెలుసుకున్నాను" అన్నాడు.

"ఏంటది? " శీనూలో ఆసక్తి.

"అరవిందలో యామిని ఆత్మ ఖచ్చితంగా ఉందని"

శీను నిరుత్సాహపడ్డాడు. "కనీసం మీర న్నా ఆమెను మా అక్కగా ప్రూవ్ చేస్తారను కున్నా"

వంశీ కాసేపు ఏం మాట్లాడలేదు. తుల సమ్మ కాఫీ కలిపి పట్టుకొచ్చింది. నిశ్శబ్దంగా అందుకుని దాన్ని మెల్లిగా సిప్ చేస్తూ ఉండి పోయాడు.

అతను కాఫీ తాగడం పూర్తిచేసి కప్పు కింద

పెట్టి చెప్పాడు. "నా లీవ్ కేన్సిల్ చేసుకుని మూడు నాలుగు రోజుల్లో అమెరికా వెళ్లిపోదా మనుకుంటున్నాను"

శీను ఏదో అనబోయాడుగాని గొంతుకేదో అడ్డుపడ్డట్టయి ఆగిపోయాడు.

"ఏం చేద్దాం నాయనా... పెద్ద బిడ్డ అలా కావడం మా ఖర్మ అనుకోవాలో... చిన్నవాళ్ల పెళ్లీ పేరంటం అయిపోతున్నదని సంతోషించాలో ఏమీ అర్థం కావడంలేదు" తులసమ్మ అంది.

వంశీ లేచి గుమ్మంలో కొస్తుంటే ఇంటి ముందు కారాగింది.

డోర్ తెరుచుకుని శ్రీదేవి దిగింది.

"కంగ్రాచ్యులేషన్స్... మీ పెళ్లటగా" అన్నాడు.

శ్రీదేవి కాస్త సిగ్గుపడి "థేంక్యూ" అంది.

"అరె! మీరా!" అంది అరవింద వంశీని కారు విండోలోంచి గమనించి.

"రండి డ్రాప్ చేస్తా" అంటూ ఆహ్వానించింది.

ఆ రోజు వంశీ బుల్లెట్ మీద రాలేదు. మనసు బాగోలేక హైదరాబాదు వీధులన్నీ తిరిగి తిరిగి అక్కడికొచ్చాడు.

"రండీ" మళ్ళీ పిల్చిందామె.

వంశీకి చివరి సారిగా అరవిందతో కలిసి ఆ కాసేపూ ప్రయాణించాలన్పించింది.

ఎక్కి డ్రైవర్ పక్కన కూర్చున్నాడు.

డ్రైవర్ కారు స్టార్ట్ చేస్తుంటే శ్రీదేవి అరవింద నడిగింది. "అదేంటి... ఇంట్లోకి రారా? "

"నా కోసం... శ్వేత ఎదురు చూస్తూ ఉంటుంది. ఈ రోజు తనకి పొలొరాయిడ్ కెమెరా కొనిపెడతానని మాటిచ్చాను". అంది అరవింద.

కారు కాస్త దూరం వెళ్ళాక వంశీ మూడు నాలుగు రోజుల్లో అమెరికా వెళ్లిపోవాలనుకుంటున్నట్లు చెప్పాడు.

"నెల సెలవు పెట్టానన్నారు!"

"ఉండాలన్పించడం లేదిక్కడ"

"అదే అమెరికా మహిమ. ఒకసారి అక్కడి కెళ్లిన మనిషి ఇక్కడ అడ్జస్ట్ కాలేడు. కొత్తల్లో నేనూ ఎంత అప్‌సెట్ అయ్యానో, అయితే శరత్ ప్రేమ అమెరికాని మరిపించిందను కోండి" అందామె.

వంశీ మౌనంగా ఊరుకున్నాడు.

ఆమె అతడి ఇంటి అడ్రస్ అడిగి డ్రైవర్ని అటు పోనిమ్మంది.

ఓ పింక్ కలర్ బిల్డింగ్ ముందు కారాపాడు డ్రైవర్. దిగి వినయంగా డోర్ తీసి పట్టుకున్నాడు.

'నీతో ప్రయాణం జీవితం చివరి మజిలీ వరకూ అనుకున్నా. కానీ ఇలా ఇంత అర్థాంతరంగా...'

"ఏంటాలోచిస్తున్నారు? " అడిగిందామె.

"లోపలికి వస్తారా? "

"ఇంకోసారి వస్తాలే" అని "ప్చ్... నేను చాలా అనుకున్నాను మీ ఫియాన్సీని చూడాలనీ, మిమ్మల్ని హర్ట్ చేసిన మీ ప్రేయసిని కలవాలనీ. వీలైతే ఆమె చేత మీకు అపాలజీ చెప్పించాలనీ..."అంది.

"అనుకున్నవన్నీ జరగవులెండి. కొందరి జీవితాలంతే" అతడి స్వరంలో నిస్పృహ.

"చూయింగ్ గమ్ డైలాగా? " నవ్విందామె.

కారు వెళ్లిపోతుంటే బయటికి అతడికేసి చేయి చాపి గాల్లో ఊపుతోంది అరవింద.

వంశీ అలాగే చూస్తుండిపోయాడు, వెళ్లిపోతున్న అరవిందకేసి.




మేడమీద తన గదిలో కిటికీ దగ్గర నుంచుని బయటకు చూస్తున్నాడు వంశీ. చాలా సేపు నుంచి అక్కడే... అలాగే... శిలలా నిలుచుండిపోయాడు.

అతడి మెదడు ఆలోచించి, ఆలోచించి,

తట్టుకోలేని కదలికలతో రగిలి రగిలి దాదాపు మొద్దుబారి పోయినట్లయింది.

అందరికీ వెళ్లిపోతున్నానని చెబుతున్నాడు. నిజానికి అరవింద విషయం తేల్చుకోకుండా, ఆమెను తన దాన్నిగా చేసుకోకుండా వెళ్లడం అతడికిష్టం లేదు. అలాగని ఏదీ తేలక, అన్ని ప్రయత్నాలు బెడిసి కొడుతుంటే ఇక్కడ ఉండాలన్పించని ఏదో నిరాశ, నిస్పృహ, నిర్వేదం.

ఎటూ తేల్చుకోలేని స్థితిలో కాసేపు గదిలో పచార్లు చేసి, కాసేపు మంచం మీద దొర్లి, లేచి ఏదీ దిక్కుతోచక అలా కిటికీ దగ్గర చాలా సేపు ఉండిపోయాడు, శూన్యంలోకి గుడ్ల ప్పగించి.

ఎప్పటికో ఈ స్థితి నుంచి బయట పడాల నుకుని తల గట్టిగా విదిల్చి అక్కడినుంచి కదలి ఇవతలకి వస్తూ ఆలోచనల్ని తప్పించు కోవడానికన్నట్లు బుక్ షెల్ఫ్‌లో రాక్ మీద చేతికందిన మ్యాగజైన్ తీసుకున్నాడు.

అది అమెరికా నుంచి వస్తూ ముంబయ్ విమానాశ్రయంలో చాలా టైముండడంతో టైంపాస్ కోసం కొన్న మ్యాగజైన్.

ఆలోచనల్ని బలవంతంగా బుర్రలోంచి బయటకు గెంటేసి పేజీలు తిప్పుతున్నాడు.

ఓ పేజీలో హాలీవుడ్‌లోని యూనివర్సల్ స్టూడియో కలర్ ఫొటోగ్రాఫ్ వేసుంటే ఆసక్తిగా చూశాడు.

అమెరికాలో ఈ మధ్యనే చూశాడు దాన్ని.

దాని గురించిన ఆర్టికల్ ఉందా మేగ్‌జై న్‌లో. తను ఆ స్టూడియోని సందర్శించిన ప్పుడు లోకల్ గైడ్ ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు. తెలిసిన ప్లేస్ గురించిన ఆర్టి కల్ కాబట్టి ఆసక్తిగా చదవసాగాడు.

యథాలాపంగా చదువుతున్న అతడు ఓ చోట ఆగిపోయి అక్కడున్న వాక్యాల్ని మళ్లీ చదివాడు. అతడి ముఖంలో రంగులు మారాయి. సాలోచనగా అతడి కనుబొమలు ముడుచుకున్నాయి. అప్రయత్నంగా లేచి నిల బడ్డాడు. నిలబడ్డాక తిరిగి ఆ వాక్యాల్ని మరో సారి మననం చేసుకున్నాడు.

అతడి మెదడులో ఒక్కసారిగా ఫ్లాష్ వెలి గింది. విషయాన్ని అతడు వెలుగులో స్పష్టంగా చూసేలా చేస్తోందా ఫ్లాష్.

అతడలాగే నిలబడి ఉన్నాడు. మళ్లీ మళ్లీ పదేపదే ఆ వాక్యాన్ని మననం చేసుకుంటు న్నాడు.

అతడి మనసులో నెమ్మదిగా ఓ ఆలోచన రూపు దిద్దుకుంది. అంతే, మూడు నాలుగు రోజుల్లో వెళ్లిపోవాలన్న అతడి నిర్ణయం తక్షణం మారిపోయింది.

* * *

"సెవంత్ మార్చ్ నైన్టీన్ ఫిఫ్టి ఫైవ్" చెప్పింది అశ్వని వంశీతో.

"ఆమె పంతొమ్మిది వందల యాభై అయి దులో పుడితే, అరవై ఒకటి నాటికి ఆరేళ్ల పాపై ఉంటుంది" తనలో తను అనుకుంటు న్నట్లు అన్నాడు.

అశ్వని లెక్కవేసి చెప్పింది "ఇప్పటికి ఆమె బతికి ఉంటే నలభై తొమ్మిది ఉండేవి. కానీ ఆమె అంత వయసున్న మనిషిలా అన్పిం చదు. జస్ట్ ఫార్టీల్లో ఉన్నట్లు ఉంటుంది.

ఆమె మాటల్ని అతడు విన్పించుకోలేదు "మీరు చెప్పింది కరెక్టే కదూ!"

"మీకంత డౌటయితే శరశ్చంద్ర గారికి రింగ్ చేసి కన్‌ఫర్మ్ చెయ్యమంటారా? "

"వద్దొద్దు" చెప్పాడు వంశీ.

"ఇంతకీ మీరు సస్పెన్స్ విప్పనే లేదు" ఆమె ఆసక్తిగా చూసింది అతడికేసి.

అతడు తను చదివిన మ్యాగజైన్ తెరిచి ఓ పేజీ దగ్గర ఆగి రెడ్ ఇంక్‌తో అండర్ లైన్ చేసిన భాగాన్ని చూపించాడు. ఆమె భృకుటి ముడిచి చదివింది.

"మూకీ సినిమాలు నిర్మించే రోజుల్లో ఈ స్టూడియోలోకి సందర్శకులను అనుమతించే వారు. కానీ శబ్ద చిత్రాలు వచ్చాక దాదాపు నలభై ఎనిమిదేళ్ల పాటు సందర్శన నిలిపివే శారు. తిరిగి పంతొమ్మిది వందల అరవై నాలుగు నుంచీ అనుమతిస్తున్నారు"

అశ్వనికి ఒకటి రెండుసార్లు చదివినా అందులో వింతేముందో అర్థం కాలేదు.

అయోమయంగా వంశీకేసి చూసింది.

"అరవిందతో నేను మాట్లాడ్డానికి వెళ్లిన రోజు మా మధ్య జరిగిన సంభాషణ మీకు చెప్పాను కదూ!"

"అవును చెప్పారు. దాన్ని బట్టి అరవిందలో ఖచ్చితంగా యామిని ఆత్మ ఉందని కూడా మీరో డెసిషన్ కొచ్చారు."

"బట్, ఇప్పుడా డెసిషన్ని మార్చుకుంటున్నా"

ఆమె వంశీకేసి ఆశ్చర్యంగా చూసింది.

"ఆ రోజామె యూనివర్సల్ స్టూడియో గురించి చెబుతూ తను అయిదారేళ్ల వయసులో తన పేరెంట్స్‌తో కలిసి దాన్ని విజిట్ చేసినట్టు చెప్పింది. యాభై అయిదులో పుట్టుంటే ఆమెకు అయిదారేళ్ళ వయసు అరవై... అరవై... ఒకటీ ప్రాంతాల్లో వచ్చేసి ఉండాలి. అప్పటికి ఎవరినీ స్టూడియోలోకి అనుమతించలేదని ఆ ఆర్టికల్ చెబుతోంది. సో... ఆమె చెప్పింది పచ్చి అబద్ధమని తేలిపోయింది. ఎవరో ప్లాన్డ్‌గా ఆమెచేత అమెరికా విశేషాల్ని బట్టీ పట్టించి చెప్పిస్తున్నారు. సమ్ మిస్టీరియస్ డ్రామా ఈజ్ గోయింగాన్".

అశ్వని కాసేపు ఆలోచిస్తూ ఉండిపోయింది. ఏ కామెంట్ చెయ్యకుండా.

ఆమెకు వంశీ చెప్పేది ఓ రకంగా సబబుగానే అన్పిస్తున్నా ఇంకోరకంగా అసంబద్ధంగా తోస్తోంది.

"ఏమో... ఆమె మాట వరసకు అయిదారేళ్ల వయసులో వెళ్లాను అనుండొచ్చు. ఒకవేళ ఆ వయసు పదో పదకొండో కావచ్చుగా"

"ఈ విషయం క్యాజువల్‌గా వాళ్ల పేరెంట్స్‌ని అడిగితే తెలుస్తుంది. అయినా అయిదారేళ్లకీ, పదీ పండకొండేళ్లకీ చాలా తేడా వుంది. ఆమె ఖచ్చితంగానే చెప్తుంటుంది" తనెంతో నమ్మకంతో డిటెక్ట్ చేయబోతున్న విషయాన్ని అశ్వని అలా తేల్చెయ్యడం నచ్చలేదు వంశీకి.

అతడు డిజప్పాయింట్ కావడాన్ని పసిగట్టి అందామె "మీరే రైట్ అన్పిస్తోంది. ఈ కోణం నుంచీ ప్రొసీడైతే బహుశా అసలు విషయం వెలుగు చూస్తుందేమో!" అంది.

వంశీ వెళ్లిపోయాడు.

క్లినిక్‌లో కన్సల్టింగ్ రూంలో కూర్చుని ఉన్నారు శరశ్చంద్ర, వంశీ. అప్పటికి కన్సల్టేషన్ అవర్స్ అయిపోయాయి. రాత్రి పది గంటలు కావస్తోంది.

"నీ అనుమానంలో పసలేదు. క్యాజువల్‌గా అన్న ఓ మాటని అనవసరంగా ఎనలైజ్ చేసి భూతద్దంలోంచి చూస్తున్నావేమో అన్పిస్తోంది"

శరశ్చంద్ర వైపు చురుగ్గా చూశాడు వంశీ. "ఎంత పెద్ద డిటెక్షనైనా ఓ చిన్న క్లూ ఆధారంతోనే మొదలయ్యేది"

"అఫ్‌కోర్స్. కానీ నువ్ చెప్పే విషయాన్ని నేనో క్లూగా భావించడం లేదు. డిటెక్షన్ అంత కన్నా చెయ్యబోవడం లేదు"

వంశీని శరశ్చంద్ర మాటలు కాస్త ఇరిటేట్ చేశాయి. అతడు మ్యాగ్‌జైన్‌లోని ఆర్టికల్ గురించి అశ్వనితో మాట్లాడలేక మళ్లీ ఆ మరునాడు వెళ్లి ఆ మేగ్‌జైన్ని తీసికెళ్లి అరవిందకు చూపించి ఏదో విధంగా ఆ ఆర్టికల్ చదివేలా చేసి ఆమె రియాక్షన్ గమనించమని విజ్ఞప్తి చేశాడు.

అశ్వని అరవిందతో స్టూడియో గురించి ముచ్చటిస్తున్నట్టు నటిస్తూ, ఆ మ్యాగ్‌జైన్‌లోని ఆర్టికల్‌ని ఆమె చదివేలా చేసింది.

అశ్వని ఊహించినట్టే ఆ వాక్యాల దగ్గర అరవింద భృకుటి క్షణంలో సగంసేపు ముడతపడింది. మళ్లీ మళ్లీ ఆమె ఆ వాక్యాల్ని చదువుతున్నట్టుగా అశ్వని అనుమానపడింది. వెళ్తూ వెళ్తూ వంశీ అమెరికా ప్రయాణం వాయిదా వేసుకున్నాడని క్యాజువల్‌గా చెప్పింది. ఆమె అనుమానాన్ని బలపరుస్తూ అశ్వని అటు వెళ్లగానే అరవింద వంశీకి ఫోన్ చేసింది.

"ఏంటీ అమెరికా వెళ్లలేదట! మా అశ్వని చెప్పింది" అంటూ మొదలెట్టి, అనవసరంగా యూనివర్సల్ స్టూడియో గురించిన టాపిక్ ఎత్తి ఏమిటేమిటో తలా తోక లేకుండా మాట్లాడి చివరికి, "అన్నట్టు నేను మీతో... నాకు అయిదారేళ్ల వయసప్పుడు మొదటిసారి

స్టుడియో కెళ్లినట్టు చెప్పాను కదూ! అప్పటికి పదో పదకొండో ఉంటాయిలెండి. ఎలాగూ ఇండియాలో ఉండిపోయారు. మా యింటికి డిన్నర్‌కి రాకూడదూ" అనడిగింది.

ఆ మాగజైన్ తనదేనని ఆమెకు తెలీదు. తను ఆ ఆర్టికల్ని చదివాడని కూడా అశ్వని చెప్పలేదు. అయినా తనకు ఆమె ఫోన్ చేసి ఆ విషయం కరెక్షన్ చేసుకుందంటే "ఎందుకైనా మంచిదన్న" సిద్ధాంతమే అన్పించిందతడికి.

అతడి అనుమానం మరింత దృఢమైంది. అనుమానాన్ని అరవిందనే 'యామిని' అని నమ్ముతున్న శరశ్చంద్ర ముందు ఉంచడం సబబని అశ్వని, వర్మా సలహా ఇచ్చారు. డైరెక్ట్‌గా ఆమెను నిలదీస్తే మళ్లీ విషయాల్ని మసిపూసి మారేడుకాయ చేయవచ్చుననీ, అదే ఆయనైతే ఈ ఆధారంతో నిజం బయటకు లాగడంలో వంశీకి సహకరిస్తాడనీ వర్మ అన్నాడు.




అందుకే వంశీ అరవింద దృష్టికి రాకుండా శరశ్చంద్రను క్లినిక్‌లో కలిశాడు. కానీ అంతా విన్న ఆయన వంశీ మాటల్ని కొట్టిపారేస్తూ "దీన్నో క్లూగా నేను భావించడం లేదు" అనడం అతడికి చిరాకు తెప్పించింది.

"అంటే... మీ ఉద్దేశం? "

"నా ఉద్దేశం అప్పటికి ఇప్పటికీ ఒక్కటే. ఆమెను నేను మనస్ఫూర్తిగా నా యామినిగానే నమ్ముతున్నాను. నా నమ్మకాన్ని చెదరగొట్టాలని ఇంకెప్పుడూ ప్రయత్నించకు. ఒన్ మోర్ థింగ్... నా కుటుంబ విషయాల్లో అనవసరంగా ఇంటర్‌ఫియర్ అవకు. నువ్వే కన్ఫ్యూజయ్యి ఎదుటి వాళ్లను కన్ఫ్యూజ్ చెయ్యకు. దట్సాల్ మై ఫ్రెండ్లీ సజెషన్"

వంశీ అవాక్కయిపోయాడు కాసేపు.

తరవాత తలెత్తి శరశ్చంద్ర కళ్లలోకి సూటిగా చూస్తూ అన్నాడు "ఈ డ్రామాకి అసలు సూత్రధారి ఎవరో ఇప్పుడర్థమైంది"

శరశ్చంద్ర అతడికేసి అయోమయంగా చూశాడు.

"మీరు... మీరే అరవిందను యామినిగా ప్రెజెంట్ చేస్తున్న మాయావి"

"వంశీ.."

"ఆగండి... నన్ను చెప్పనివ్వండి. మీ భార్య పోయిన కొత్తల్లో మీరు అరవిందను చూశారు. ఆమె మీద మోజు పడ్డారు. కుటుంబ బాధ్యతలతో విసిగి వేసారి ఉన్న ఆమెకు డబ్బాశ చూపెట్టి, యామినిగా మార్చేశారు"

శరశ్చంద్ర చిరునవ్వు నవ్వాడు. "నేనా అమ్మాయిని చూసింది ఒకే ఒకసారి. అదే ఆమెలో యామిని ఆత్మ ప్రవేశించాక. అంతేకాని అంతకు ముందెప్పుడూ నేనామెను చూడలేదూ, నువ్వన్న మోజేదీ ఆమె మీద నేను పెంచుకోనూ లేదు యామిని పోయిన పదోరోజు నుండీ నన్ను పెళ్లాడతామని మా బంధువుల్లో చాలామంది అమ్మాయిలు ముందుకొచ్చారు. కానీ నాకా ఆలోచనే అసహ్యంగా, అమానుషంగా అన్పించింది. అటువంటి నేను ఆడదాని మోజులో పడడమా! అబ్సర్డ్"

"అయితే ఇందులో మీ ప్రమేయమేం లేదంటారు? "

"డోంటాక్ రబ్బిష్. నువ్వూహించినట్టూ ఆమె మీద నేను మోజుపడి ఉంటే ఆమెను సలక్షణంగా పెళ్లాడి ఉండేవాణ్ణి. అంతేగాని ఇంత డ్రామా ఆడాల్సిన అవసరం నాకు లేదు"

"ఉంది, సొసైటీలో మీకు ఏకపత్నీవ్రతుడన్న పేరు కావాలి. యామిని గారిలాంటి ఉత్తమురాలు పోగానే వయసులో, హోదాలో పెద్దవాడైన శరశ్చంద్ర అతినీచంగా పరస్త్రీ వ్యామోహంలో ఇంత తేలిగ్గా పడిపో

యాడన్న అపప్రద మీకు రాకూడదు. అందుకే అరవిందను వంచించారు. ఆమె అసహాయతను అలుసుగా తీసుకున్నారు. మీ అసలు రంగు బయటపడకుండా యామి నిగార్ని జపిస్తూనే మరో స్త్రీ సాహచ ర్యంలో..."

"షటప్..." శరశ్చంద్ర కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు. ఉద్రేకంతో శరీరం కంపిస్తుండగా అన్నాడు "గెట్ లాస్ట్ ఫ్రమ్ మై సైట్... నువ్వు ప్రేమించానంటున్న మనిషి గురించి ఇంత నీచంగా మాట్లాడ్డానికి నీకు సిగ్గు లేదూ!"

వంశీ షాక్ తిన్నాడు. కాసేపు నిశ్శబ్దంగా ఉండిపోయి తరవాత అన్నాడు "సిగ్గే కాదు డాక్టర్... ఆశలూ, కోరికలూ, ఆత్మాభిమానం చివరికి నా ప్రాణం అన్నీ నాలోంచి వెళ్లిపో యాయి. ఇప్పుడిక్కడున్నది కేవలం జీవ చ్ఛవం మాత్రమే. దీనికి ఏం మాట్లాడాలో, ఏం మాట్లాడకూడదో తెలీదు. తెలిసింది ఒక్కటే అరవింద ఇక దక్కదు అన్న నిజం. ఆ నిజాన్ని తట్టుకోలేక మెదడు స్తంభిం చిపోతే వచ్చిన మాటలివి, వస్తా సర్" అంటూ బయలుదేరబోయాడు.

శరశ్చంద్ర అతడికేసి జాలిగా చూశాడు, "సృష్టిలో ఎన్నో విచిత్రాలు జరుగుతుంటాయ్. వాటిని మౌనంగా యాక్సెప్ట్ చెయ్యడం మినహా మనమేం చెయ్యలేం".

"అంటే" వంశీలోని విరక్తి శరశ్చంద్ర మాటలకు తిరిగి కోపంగా మారింది "నా అర విందను నా నుంచి మీరు లాక్కున్నా దాన్నో వింతగా భావించి చూస్తూ ఊరుకోవాలా? నా అరవిందను ఎలా దక్కించుకోవాలో నాకు బాగా తెలుసు. ఐ నో హౌ టు రూయిన్ యువర్ డర్టీ ట్రిక్" అంటూ చరచరా బయ టకు వెళ్లిపోయాడు.

వంశీ వెళ్లిపోయాక్కూడా శరశ్చంద్ర కన్స ల్టింగ్ రూమ్‌లోంచి అరగంటవరకూ బయటికి రాలేదు.

టేబుల్ మీద తలపెట్టి కళ్లు మూసుకుని ఉండిపోయాడు చాలా సేపు.




"నువ్విప్పుడా పనిచేస్తే శ్రీదేవి పెళ్లి ఆగిపో తుంది. పీటల మీద పెళ్లాగిపోతే దాని జీవితం నాశనం అవుతుంది" తులసమ్మ కళ్లలో భయం రెపరెపలాడింది.

వంశీకి ఒక్క పెట్టున నవ్వాలనిపించింది. కానీ తమాయించుకుని అడిగాడు "అరవింద మీ కూతురు కాదమ్మా? "

"అదేంటి నాయనా అట్లా అడుగుతావ్. నా తొలి చూలు బిడ్డది. నాకది కూతురే కాదు, తల్లి కూడాను. మమ్మల్నందర్నీ రెక్కల కింద పెట్టుకుని సాకుతోంది" ఆమె పవిట కొంగుతో కళ్లద్దుకుంది.

"మరి ఆమె జీవితం నాశనం అయినా ఫరవాలేదా? " తులసమ్మ తెల్లబోయింది.

వంశీ అన్నాడు "అరవింద తన ఉనికినే మర్చిపోయి తనెవరోనన్న భ్రమలో బతుకు తోంది. ఎవరో స్వార్థపరులు ఆమెనలా చేశారు. ఇప్పుడా స్వార్థపరులెవరో తెలిసింది. అది బయటపెట్టి పోలీసుల్ని రంగంలోకి దింపితే, మీ కూతురు మీకు దక్కుతుంది. కానీ మీరలా వద్దంటున్నారు"

"నేనా పనిచేస్తే ఈ కూతురి పెళ్లి ఆగిపో తుందంటున్నారు. అంటే... మీకు మీ బిడ్డను తిరిగి పొందడం ముఖ్యం కాదు. ఆమె నుండి దొరికే ధన సహాయం ముఖ్యం"

"అట్లాగని నేనన్నానా బాబూ..."

"కొన్ని విషయాలు అనకపోయినా అర్థమ వుతాయి"

తులసమ్మ ముఖం ఎర్రబడింది. "పిల్ల పెళ్లి నాలుగు రోజులుంది. అన్ని ఏర్పాట్లూ జరిగి పోయాయి. ఈ సమయంలో నువ్వా డాక్టర్ గార్ని పోలీసులకి పట్టిస్తానంటం ఏమన్నా

బాగుందా? నాదేం కన్నకడుపు కాదనుకున్నావా? అరవింద మీద ప్రేమ నాక్కాక ఇంకెవరికుంటుంది? ఈ పెళ్లి కాస్తా అయిందనిపించాక, నీ యిష్టమొచ్చినట్టు చెయ్యి"

"నా యిష్టమే కానీ మీ యిష్టమేం లేదన్న మాట!"

అతడికెందుకో తులసమ్మ కూడా స్వార్థపరురాల్లాగే కన్పిస్తోంది. విషయం చెప్పగానే ఆనందంతో పొంగిపోయి, ఆవేశంతో ఊగిపోయి తనతో చెయ్యి కలిపి శరశ్చంద్ర మీద యుద్ధం ప్రకటిస్తుందనుకున్న తులసమ్మ ఇలా అరవింద కన్నా శ్రీదేవి పెళ్లి ముఖ్యం అనటం అతడికి కొరుకుడుపడటం లేదు.

వంశీ శరశ్చంద్ర క్లినిక్ నుంచి బయటపడ్డాక నేరుగా అశ్వని ఇంటికెళ్లాడు.

జరిగింది చెప్పి శరశ్చంద్ర ప్రధాన సూత్రధారి అని అనుమానిస్తున్నానన్నాడు. వర్మ దంపతులు ఆశ్చర్యపోయారు. కొంచెం సేపు ఆలోచించి "తొందరపడొద్దు. నువ్వు కనుక్కున్న నిజానికి ఆధారం అంత పటిష్టంగా లేదు కనుక కొన్నాళ్లు ఆగు" అని వర్మ సలహా ఇచ్చాడు.

వంశీ అరవింద కోసం పడే తపన ముందు ఆయన మాటలు వర్కవుట్ కాలేదు. వర్మకేం చెప్పకుండా లేచొచ్చాడు.

ఆ రాత్రంతా అతడికి నిద్రపట్టలేదు. తనకు అరవింద కావాలి, వెంటనే. వీలైతే ఈ క్షణమే...

వాళ్లకేం తెలుస్తుంది నా బాధ. అరవింద వాళ్ళకేం కాదుగా! ఆమె తనకే సర్వస్వం అవుతుంది. తనకు అరవింద... అరవిందకు తనూ! అంతే.

అవునూ... అరవిందకు తనేకాదు అమ్మా, చెల్లెళ్లూ, తమ్ముడూ ఉన్నారుగా!

వాళ్లూ తనలాగే ఆమెను ప్రేమిస్తున్నారు. ఆమె కోసం ఏడుస్తున్నారు!

యస్... తనసలు ఈ విషయాన్ని ముందుగా వర్మ దంపతులక్కాదు, వాళ్లకు చెప్పుండాల్సింది.

తనకు కావలసినంత స్ఫూర్తి దొరికేది. తెల్లవారగానే రెడీ అయ్యాడు వంశీ శ్రీదేవి ఇంటికని. తెలిసినవాళ్లు అప్పుడే రావడంతో వాళ్లతో అన్యమనస్కంగానే ఓ గంట గడిపేసి ఇలా రెక్కలు కట్టుకువాలాడు.

ఇంట్లో తులసమ్మ తప్ప ఎవరూ లేరు.

కూతుళ్లు, కొడుకు శుభలేఖలు పంచాడానికి వెళ్లారని చెప్పింది.

వంశీ కాసేపు మౌనంగా ఉండిపోయి తులసమ్మతో విషయం చెప్పాడు.

వింటున్న తులసమ్మ ఉద్వేగానికి లోనవడం అతడు గమనించాడు. అంతా విన్నాక ఆమె కాసేపు నోటా మాట రానట్టు ఉండిపోయింది. చాలాసేపటికి తేరుకుని అతడితో "పిల్ల పెళ్లి అయ్యేదాకా గొడవలొద్దు బాబూ" అంది.

అందుకే అవాక్కయ్యాడు వంశీ. అమ్మతనంలో కూడా స్వార్థాన్ని చూశాడు.

"ఆ కూతురి బతుకు బలైపోయినా ఫరవాలేదు. ఈ కూతురి బతుకు బాగుంటే చాలు. అంతేనా మీరనేది? "

తులసమ్మకి చిరాకేసింది. 'ఏమిటీ పిల్లాడు చెబితే విన్పించుకోడు' అనుకుంది.

కాస్త విసుగు మేళవించిన స్వరంతో అంది "బతుకు బలైపోవటం లాంటి పెద్దమాటలెందుకులే నాయనా! ఇప్పుడు దానికేమైంది? కోట్ల ఆస్తికి వారసుడైన డాక్టర్‌గారికి భార్యగా చెలామణి అవుతోంది. బంగళాల్లో ఉంటూ కాలు కింద పెట్టకుండా కార్లలో తిరుగుతోంది. కొత్తల్లో ఈ అమ్మను గుర్తించలేదే అని కుమిలిపోయా గాని చూస్తుంటే బిడ్డ బతుకు బంగారుబాటలో పడిందనే అన్పిస్తోంది. ఈ తల్లి కూతురుగా అది కష్టాలు పడేకన్నా, ఆ మహానుభావుడి భార్యగా ఆ సుఖాలనుభవించడమే ఉత్తమం"

వంశీ కళ్లు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి. ఆమె చెప్పిన సరికొత్త థియరీని అతడు జీర్ణించుకోలేకపోతున్నాడు.

తులసమ్మ ఇంకా తన ధోరణిలో తను చెప్పుకుపోతోంది. "అంచేత నాయనా... దాన్నెలాగోలాగా అక్కడే బతకనీ. ఈ బిడ్డల్ని ఇట్లా బతకనీ! నీకేం... అమెరికాలో ఉద్యోగం

చేసుకుంటున్నావు. బంగారు బొమ్మలాంటి పిల్ల దొరుకుతుంది. మా అరవిందను మరిచిపో. అదృష్టమో, దురదృష్టమో స్వర్గంలో కాలు పెట్టింది. మళ్లీ ఈ నరకంలోకి లాగకు. నా బిడ్డనక్కడే సుఖపడనీ, అష్టైశ్వర్యాలూ అనుభవించనీ"

కన్నతల్లులిలాగే కోరుకుంటారు కాబోలు! నిజమే. తన తల్లి కూడా అరవిందను మర్చిపోయి తనూజను చేసుకుని అమెరికా వెళ్లమంది. తులసమ్మగారన్నట్టే అష్టైశ్వర్యాలూ అనుభవించమంది.

కానీ తన మనసు అష్టైశ్వర్యాల కన్నా, అందమైన అమెరికా జీవితం కన్నా అరవింద ప్రేమే ఎక్కువంది.

మరి అరవింద అలా ఎందుకనుకోలేదు! తనకన్నా ఆ ఐశ్వర్యమే ఎక్కువనుకుని శరశ్చంద్రతో కలిసి జీవిస్తోందెందుకు?

కాదు. అరవింద అలా ఒక్కనాటికీ అనుకోదు.

ఆమె తులసమ్మగారనుకుంటున్నట్టు ఆనందంగా జీవించడం లేదు. జీవితాన్ని నటిస్తోంది.

ఎవరి కోసమో, ఎందుకోసమో. నరకం లాంటి స్వర్గంలో సుఖాల విచ్చుకత్తుల మీద నడుస్తోంది.

తను తన అరవిందను రక్షించుకోవాలి. ఎవరి సపోర్టూ తనకు లేకపోయినా తను ఒంటరిగా పోరాడాలి.

వంశీ లేచాడు.

తులసమ్మ భయంగా చూసింది.

"ఏం నిర్ణయించుకున్నావ్ బాబూ? "

"నా నిర్ణయం మీకు చెప్పాల్సిన అవసరం ఇప్పుడు లేదనిపిస్తోంది"

తులసమ్మ హఠాత్తుగా వంశీ చేతులు పట్టుకుంది. ఆమె కళ్లలోంచి కన్నీళ్లు జలజల రాలి అతడి చేతుల మీదపడ్డాయి.

"ఈ విషయం పిల్లలకు తెలీ నీకు బాబూ. నీలాగే దుడుకుపడతారు."

అతడు ఇబ్బందిగా కదిలాడు.

ఎందుకో గానీ అతడు తులసమ్మ కేసి చూశాడు. ఆమె కళ్లలో వేడికోలు. అప్పుడతడికి అర్థవంతంగా అమ్మ మనసుకు అద్దంలా తోచిందామె.

ఏం మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

ఆ రోజు సాయంత్రం శ్రీదేవి వసంతతో కల్సి వంశీ ఇంటికి వచ్చి అతడికి శుభలేఖ ఇచ్చి పెళ్లికి తప్పకుండా రమ్మని మరీ మరీ చెప్పి వెళ్లింది.

* * *

అరవింద, శరశ్చంద్ర పీటల మీద కూర్చుని



కన్యాదానం చేస్తున్న దృశ్యాన్ని సహించలేకపోతున్నాడు వంశీ.

అతని ధమనుల్లో... సిరల్లో... ప్రవహిస్తున్న రక్తం మరిగిపోతోంది. ఆవిర్లు చిమ్ముతోంది.

తన హృదయంలో పీఠం వేసుకున్న ఒక స్త్రీ... మరో పురుషుడి పక్కన అతని భార్య స్థానంలో కూర్చోవడాన్ని అతని మెదడు స్వీకరించలేకపోతోంది. కోపం... కసి... ఉద్రేకం... నిస్సహాయత. అన్నీ అతడిలో కలగాపులగంగా.

కన్యాదాన కార్యక్రమం అయ్యాక ఇద్దరూ పీటల



మీంచి లేచారు. శరశ్చంద్ర సరిగ్గా వంశీకి ముందు వరసల్లో ఉన్న ఓ కుర్చీలో కూర్చున్నాడు. అరవిందొచ్చి ఆయన పక్కనే కూర్చుంది, ఓసారి వెనక్కు చూసి "హలో మీరా" అంది పలకరింపుగా.

వంశీ ఓ జీవం లేని నవ్వు నవ్వి ఊరుకున్నాడు. ఆమెతో మాటలు పొడిగించాలన్పించ లేదు.

అరవింద, శరశ్చంద్ర భుజాల మీదకు వంగిపోయి గుసగుసగా ఏదో అంటోంది. ఆయనేమో ముఖమంతా వెలిగించుకుని నవ్వుతున్నాడు.

వంశీకి అసహనంగా ఉంది. అక్కణ్ణుంచి లేచెళ్లి పెళ్ళి మంటపానికి కాస్త అవలగా నిలబడ్డాడు.

పట్టుచీర కట్టుకుని, తలనిండా పూలతో, చేతుల నిండా గాజులతో, అటూ ఇటూ పనుల మీద కాళ్లకి చక్రాలు కట్టుకున్నట్టు తిరుగుతున్న వసంత... అతడలా ఒంటరిగా నిలబడ్డం చూసి దగ్గరకొచ్చింది.

"ఏంటండీ ఇక్కడ నిలబడ్డారు. వచ్చి కూర్చోండి"

వంశీ వసంతకేసి నిశితంగా చూశాడు. అతడికి నోటిదాకా వచ్చేసిందామాట "అరవిందని శరశ్చంద్ర..."

"అమ్మాయ్ వసూ... ఎక్కడున్నావ్? ఆ తమలపాకులూ, వక్కలూ ఇట్లా పట్రా"

"ఆఁ వస్తున్నా...మీరెళ్లి కూర్చోండి" వసంత మళ్లీ వంశీకి చెప్పి గబగబ అక్కణ్ణుంచి వెళ్లిపోయింది.

వంశీ వెళ్లలేదుగాని, అక్కడే ఉన్న ఓ స్తంభాన్ని ఆనుకుని అరవిందకేసి చూశాడు.

మాంగల్యధారణ జరిగింది. అరవింద లేచి వధూవరుల మీద అక్షింతలు చల్లుతోంది. ఆమె పక్కనే నిలబడి అదే పనిచేస్తున్నాడు శరశ్చంద్ర.

వంశీకి ఒళ్లు మండిపోతోంది.

శ్రీదేవి, ఆమె భర్తా... మధుపర్కాల్లో మెరిసిపోతూ... అరవిందా శరశ్చంద్రల పాదాలకు వంగి నమస్కరిస్తున్నారు. అర

వింద పెద్ద ఆరిందలా దీవిస్తోంది.

భోజనాలయిన వెంటనే అరవింద శ్రీదేవి నుదుట ముద్దు పెట్టుకుని వెళ్లొస్తానని చెప్పింది.

శ్రీదేవి ఆనందంగా చెయ్యి ఊపుతోంది. అక్క దూరమైందన్న బాధలేదు. పైగా ఆనందం ఎందుకో!

తులసమ్మ వెళుతున్న అరవిందకు అడ్డం వెళ్లి చేతులు పట్టుకుని కృతజ్ఞతగా ఏదో అంటోంది.

అరవింద 'ఫర్వాలేదు' అన్నభావం వచ్చేలా నవ్వుతోంది.

"యామినీ... ఇక బయలుదేరు... నేను క్లినిక్‌కు వెళ్లాలి" అన్నాడు శరశ్చంద్ర.

యామినట... యామిని!

పరాయిస్త్రీని మాయచేసి, వశపర్చుకుని, సొంత భార్యలా ఫోజు కొడుతున్నాడు.

వంశీకి ఏడుపొస్తోంది. దాన్ని ఆపుకోవటంలో తలబద్దలవుతోంది. శరశ్చంద్ర కారు ముందుకు కదలగానే శీనూ దగ్గరకు వెళ్లి అతడి రెక్క పట్టుకుని అవతలకు లాక్కెళ్లి.

"శ్రీనూ... ప్లీజ్... ఇక ఈ విషయాన్ని నాలో నేను దాచుకోలేను. నే చెప్పేది విను. లేకుంటే... నా గుండె పగిలిపోతుంది" అన్నాడు

వంశీకేసి వింతగా చూశాడు శీను. "పదండి సర్! అలా వెళ్లి మాట్లాడుకుందాం".

ఆ పెళ్లి పందిరికి దూరంగా సందు మలుపు దగ్గర నిలబడి శీనుతో చెప్పాడు వంశీ అరవింద విషయంలో శరశ్చంద్ర మీద ఉన్న తన అనుమానాన్నీ... అది కలిగిన వైనాన్నీ.

"ఈ విషయాన్ని నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" తీవ్రంగా ఎగ్జయిట్ అయ్యాడు శీను.

అదుగో... ఆ ప్రతిస్పందనే తనక్కావాలి. తమ మనిషి పరాయిగా మారిందే... అన్న బాధలోంచి క్రోధం పుట్టాలి.

అది శీనూలో కనబడుతోంది.

వంశీకి తృప్తిగా ఉంది "అరవింద నా ప్రాణానికి ప్రాణమే కావచ్చు. కానీ లీగల్‌గా నాకామెతో రిలేషన్ లేదు. నువ్వయితే... రక్తం పంచుకు పుట్టిన తమ్ముడివి. నువ్వు గనక శరశ్చంద్ర మీద కిడ్నాపింగ్ కేస్ పెట్టావంటే... మన అరవింద మనకు దక్కుతుంది. నీకీ విషయాన్ని ఎప్పుడో చెప్పాల్సింది. మీ అమ్మగారు శ్రీదేవి పెళ్లయ్యేవరకూ ఆగమన్నారు. నాకది సబబే అన్పించింది. ఇప్పుడామె పెళ్లయిపోయింది. అందుకే చెప్తున్నా. నీ వెనక నేనుంటా శీనూ... ప్లీజ్... నే చెప్పినట్టుగా పోలీస్ రిపోర్టివ్వు"

"బతిమిలాడుతున్నారేంటండీ. అరవిందెవరు నాకు అక్క. రక్తం పంచుకు పుట్టిన అక్క. ఆమె కోసం నన్నేం చెయ్యమన్నా చేస్తాను"

"అరవిందను కిడ్నాప్ చేసి, ఆమెను హిప్నటైజ్ చేసి, తను శరశ్చంద్ర భార్య యామిని నన్న భ్రమలో బ్రతికేలా చేసి... ఇంట్లో బందీగా ఉంచుకున్నాడని రిపోర్టివ్వు. దట్సాల్. తీగ లాగితే డొంక కదులుతుంది" చెప్పాడు వంశీ.




"మీకేం భయం లేదు. నిజం చెప్పండి. ఎవరు మిమ్మల్నిలా నటించమన్నది?

అలా అడుగుతున్న ఇన్‌స్పెక్టర్ కేసి బ్లాంక్‌గా చూసింది అరవింద.

అతడు మళ్లీ అడిగాడు. "మీ నటన వెనక వున్న రహస్యం మాక్కావాలి. దెన్ ఓన్లీ వికెన్ హెల్ప్‌యు. కమాన్ స్పీకవుట్"

"మిస్టర్ ఇన్‌స్పెక్టర్! మీకు దేవుళ్లమీద నమ్మకం ఉందా?" అడిగింది అరవింద.

ఇన్‌స్పెక్టర్ తనడిగేదేమిటీ, ఆమె చెప్పేదేమిటీ అని క్షణం తెల్లబోయాడు. అంతలోనే

తేరుకుని చెప్పాడు 'ఉంది'

అయితే ఏంటి? అన్నట్టు చూశాడు.

"ఆత్మ ఎగ్జిస్టెన్స్ మీద? "

ఇన్‌స్పెక్టర్ కర్థమైంది, ఈమె అట్నుంచి నరుక్కొస్తోందని అందుకే తెలివిగా అన్నాడు.

"ఆత్మలూ గీత్మలూ లాంటి వాటి మీద నాకస్సలు నమ్మకం లేదు. మానవుల డెడ్ బాడీస్‌ని కూడా మిగతా వాటిలాగే బాక్టీరియా డికంపోజ్ చేస్తుంది. అవి మట్టిలో కలిసిపో తాయి. దట్సాల్" నిర్లక్ష్యంగా అన్నాడు.

"మీ పెద్దవాళ్లలో ఎవరైనా... ఐమీన్ తాత య్యలూ, అమ్మమ్మలూ లేదా పేరెంట్సూ... వీళ్లలో చనిపోయిన వారున్నారా? "

ఈ ప్రశ్న మరీ విడ్డూరంగా అన్పించిందతడికి, కాస్త చిరాక్కూడా కలిగింది. "మా తాతయ్యా, అమ్మమ్మా ఎప్పుడో పోయారు. మా నాన్న వైపు కూడా ఎవరూ లేరు. చెప్పా లంటే... అసలు మా నాన్నగారు కూడా ఈ మధ్యపోయారు"

"వాళ్ల కర్మకాండలవీ సక్రమంగా నిర్వహిం చారా? "

ఇన్‌స్పెక్టర్ జవాబివ్వబోయే ముందు ఓ సారి కానిస్టేబుల్ కేసి చూశాడు. అతడు నవ్వు దాచుకుంటున్నట్టుగా అనుమానం వచ్చిందతడికి.

వెంటనే అరవిందతో అన్నాడు "నేను మిమ్మల్ని ఇంటరాగేషన్ చెయ్యాల్సింది పోయి... మీరు నన్ను చేస్తున్నారు. వెరీ పెక్యూలియర్"

"ప్లీజ్ నా ప్రశ్నకి సమాధానం చెప్పండి"

"అందరి కర్మకాండలూ సలక్షణంగా చేశాను. సంవత్సరీకాలు అవీ కూడా క్రమం తప్పకుండా ఆచరిస్తున్నాను. మీకా విష యంలో డౌటేం అక్కర్లేదు"

ఆమెకేమైనా లూజేమో అన్పించిందతడికి. అలా చెప్పేటప్పుడు అతడికి నవ్వు కూడా రాబోయింది.

"ఎందుకలా చేస్తున్నారు? ఐమీన్ అవన్నీ చెయ్యకపోతే వచ్చే నష్టమేంటి? "

"వాళ్ల ఆత్మలు ఘోషిస్తాయి. పుణ్యలోకా లకు పోలేక అల్లాడతాయి"

"ఇప్పుడే కదా, మీరు ఆత్మలూ గీత్మలూ లాంటి వాటిలో మీకు నమ్మకం లేదన్నారు!"

ఇన్‌స్పెక్టర్ కాస్త షాకైనట్టు చూశాడు.

"చూడండి" అరవింద మొదలెట్టింది "నేనా డేది నాటకం కాదు. నటించాల్సిన అవసరం నాకెంత మాత్రం లేదు. నేను డాక్టర్ శర చ్చంద్ర భార్యను. ఈ విషయంలో మీకెలాంటి సందేహం అక్కర్లేదు"

ఇన్‌స్పెక్టర్‌కి చప్పున నవ్వొచ్చింది. ఓ సారి ఆమె వెనకే నిలబడి ఆత్రంగా ఆమె చెప్పేది వింటున్న ఆమె కుటుంబ సభ్యులకేసి, ఆ పక్కనే నిలబడ్డ వంశీకేసి చూశాడు. ఆనక అక్కడే కూర్చుని ఉన్న వర్మ శరశ్చంద్రలకేసి చూశాడు.

శరశ్చంద్రని... శీను ఇచ్చిన కంప్లెయింట్ ఆధారంగా ఫార్మల్‌గా అరెస్ట్ చేశాడు. వెంటనే వర్మ బెయిలిచ్చి విడిపించేశాడు.

"మీరేమంటారు డాక్టర్? " ఇన్‌స్పెక్టర్ అడి గాడు.

"ఆమె ముమ్మాటికీ నా భార్య యామినే అంటాను" చెప్పాడు కాస్త ఆవేశంగా శర శ్చంద్ర.

"నో... ఇది అరవిందా, శరశ్చంద్రా కలిసి ఆడుతున్న నాటకం. అందుకే ఒకర్నొకరు ఇలా సమర్థించుకుంటున్నారు" వంశీ ఉద్రే కంగా అన్నాడు.

అరవింద వంశీకేసి తీక్షణంగా చూసింది. అలా చూస్తుండగానే ఆమె కనురెప్పలు బరు వెక్కి మెల్లగా వాలిపోయాయి. శరీరం పట్టు దప్పినట్టై కుర్చీలోంచి ముందుకు తూలి పడ బోయింది.

చప్పున వచ్చి పట్టుకున్నారు శీనూ, వంశీ. ఆమెను కుర్చీ వెనక్కు చేరగిలబడేలా కూర్చోబె ట్టారు.

"ఆమెకు స్పృహ తప్పినట్టుంది" ఇన్‌స్పెక్టర్ అన్నాడు కాస్త కంగారుగా. వెంటనే కానిస్టే బుల్ వెళ్లి ఆ స్టేషన్‌లో ఓ మూలగా ఉన్న మట్టి కుజాలోంచి గ్లాసు నిండా నీళ్లు వంపి

పట్టుకొచ్చాడు.

అతను ఆమె ముఖాన నీళ్లు చిలకరించే ప్రయత్నం ఇంకా చెయ్యకముందే ఆమె మాట్లాడ్డం మొదలెట్టింది.

"సీ మిష్టర్ ఇన్‌స్పెక్టర్!"

ఆమె ముఖంలోకే చూస్తున్న ఇన్‌స్పెక్టర్ అదిరిపడ్డాడు. అరవింద పెదవులు కదలడం లేదు. పెదవులే కాదు. అసలామె శరీరంలోని ఏ భాగంలో చలనమే లేదు. అచేతనంగా కుర్చీలో చేరబడి ఉందామె.

ఆ మాటలు... తన టేబుల్‌మీద ప్లాస్టిక్ ఫోల్డర్‌లోంచి వినబడుతున్నట్టుగా అన్పించింద తనికి. దాని వైపే కాస్త భయంగా చూశాడు.

"భయపడకండి... నేను యామినీ శరశ్చంద్రను మాట్లాడుతున్నా" ఈసారి ఇంకోచోట నుండి వినబడిందా కంఠస్వరం.

"ఈ శరీరం మీరనుకొనే అరవిందది కావచ్చు. కానీ ఆమెను నిలువెల్లా కమ్మేసిన ఆత్మని నేను. నా జీవితంలోని కొన్ని లక్ష్యాలను నెరవేర్చుకోకుండానే అర్ధాంతరంగా పోయాను. అందుకే తిరిగి నా యింటికి వచ్చాను. ఉండటానికి నాకో దేహం కావాలి. ఈమె... మా ఇంటి హాల్లో కూర్చుని కనబడింది, తన శరీరంలోకి నేను ప్రవేశించాను. సో ఇప్పుడామె అరవింద కాదు. మిసెస్ యామినీ శరశ్చంద్ర. మిగిలిపోయిన పనులన్నీ పూర్తి చేసుకున్నాక... ఆమెను వదిలి నేవెళ్లిపోతాను. ఈలోపు మీరెన్ని ప్రయత్నాలు చేసినా వృథానే"




"ఇంకా ఎంతకాలం ఉంటావ్ తల్లీ?" తులసమ్మ అడిగింది ఆత్రంగా.

"చెప్పానుగా... పనులు పూర్తయ్యేదాకా. అదెంతకాలం పడుతుందో నేను స్పష్టంగా చెప్పలేను"

"ఆ పనులేమిటో... ఒక్కటి ఉదాహరణగా చెబుతారా?" ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

అరవింద మాట్లాడలేదు. ఆమెలో మెల్లగా కదలిక మొదలైంది. క్రమంగా కళ్లు తెరిచింది.

ఇన్‌స్పెక్టర్ శీనూతో చెప్పాడు. "చూడండి శ్రీనివాస్! మీరిచ్చిన కంప్లెయింట్‌ని బట్టి ఈమెను మేము ఫిజికల్‌గా అరవింద అనే గుర్తిస్తున్నాం. ఆమె ఏదో మానసికంగా భయంకరమైన డిస్టబెన్స్‌తో బాధపడుతోంది. సో... మీరావిణ్ణి తీసుకెళ్లవచ్చు. అవసరమైన ట్రీట్‌మెంట్ ఇప్పించొచ్చు. ఇట్సాల్ అవర్ డ్యూటీ యుకెన్ టేక్ హర్ యాజ్ హర్ బ్రదర్"

"నేను కోర్టుకి వెళతాను" శరశ్చంద్ర ఆవేశంగా అన్నాడు.

అరవింద లేచింది. "చూడండి ఇన్‌స్పెక్టర్! నేనాయన భార్యను. పోనీ నన్ను మీరు అరవిందగా భావించినా నేను మేజర్ని. సో... నా ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా నన్ను నా భర్త నుంచి వేరు చేసే హక్కు మీకు లేదు" ఖచ్చితంగా చెప్పింది ఆమె.

"అరవిందా! నువ్వూ, నేనూ ప్రేమించుకోడం కూడా అబద్ధమేనా?"

"సారీ... కేవలం అశ్విని బంధువుగా మాత్రమే మీరు నాకు తెలుసు. అంతకు మించి మీ గురించి నాకేమి తెలీదు. మనసా వాచా నేను శరశ్చంద్ర భార్యను"

వంశీకి గుండె కోసినట్టయింది. ఆమె మనసా వాచా నేను శరశ్చంద్ర భార్యను అనగానే. తెలీని ఉద్రేకంలో ఒక్కక్షణం కంట్రోల్ తప్పి అరిచాడు. "డోంటాక్ రబ్బిష్... నువ్వు అరవిందవు కావూ?"

అరవింద అతణ్ణి పైనుంచి కింది దాకా ఓ చూపు చూసింది. శరశ్చంద్ర వైపు తిరిగి "పద శరత్ వెళదాం" అంది.

ఇద్దరూ ఇన్‌స్పెక్టర్‌కి చెప్పి వెళ్ళిపోతుంటే "ఆమె మేజర్... మేమేం చెయ్యలేం" అతన

న్నాడు.

వంశీ అరవింద వైపు పరుగెత్తినట్టుగా వెళ్లి ఆమె దారికి అడ్డం నిలబడ్డాడు.

అరవింద ఒక్క క్షణం ఆగి అతడికేసి నింపాదిగా చెప్పింది, "అనవసరమైన ఆలోచనలతో మీ భవిష్యత్తు పాడుచేసుకోకండి. అమెరికా వెళ్లిపోయి మీ లైఫ్‌ని ఆనందంగా గడపండి. ఐ విష్ యు ఆల్ ది బెస్ట్"

వంశీకి కన్నీళ్లు పొంగాయి కాని వాటిని కళ్ల లోనే అదుముకున్నాడు. జేవురించిన ముఖంతో ఆమెకేసి కసిగా చూస్తూ చెప్పాడు "లెటజ్ మీట్ ఇన్ ద కోర్ట్"




"నో" కంఠనాళాలు తెగేలా అరిచింది అరవింద. మనిషి నిలువెల్లా గడగడ వణికిపోతోంది. తల్లోంచి ధారాపాతంగా కారుతున్న స్వేదం. కళ్లలోంచి ఉప్పెనలా దూకుతున్న కన్నీళ్ళతో కలిసి ఆమె గుండెల్ని తడిపేస్తోంది.

ఉద్రేకం... ఉద్వేగం... భయం ఒక్కసారి ముప్పిరిగొంటుండగా చివుక్కున లేచి కూర్చుని మోకాళ్లలో తల దూర్చి వెక్కివెక్కి ఏడ్చేసింది.

కళ్లలోని నీళ్ళన్నీ ఖర్చయిపోయాక మెల్లగా తలెత్తి పరిసరాల్ని గమనించింది.

అది తన బెడ్‌రూమ్. నైట్ బల్బ్ వెదజల్లుతున్న పలుచని కాంతికి... ఆ గదిలోని వస్తువులన్నీ అస్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎ.సి. చప్పుడు మృదువుగా చెవులను తాకుతోంది.

ప్రాణం లేచొచ్చిందామెకు.

అయితే... అయితే... తను కన్నది కలా? అబ్బ. ఎంతటి పీడకల!

...అంతవరకూ కన్నీళ్లు కురిసిన కళ్ల లోంచి రెండు ఆనందబాష్పాలు రాలిపడి ఆమె చెంపల్ని ఆర్తిగా నిమిరాయి. మంచం దిగి ఫ్రిజ్‌లోంచి మంచినీళ్ళ బాటిల్ తీసుకుని గటగటా తాగేసింది. తనకొచ్చిన కలను తల్చుకుని మళ్లీ నిలువెల్లా వణికిపోయింది.

గోడ గడియారంకేసి చూసింది. రేడియం ముళ్లు సమయం రెండు గంటలు కావస్తున్నట్టు సూచిస్తున్నాయి. మెల్లగా వెళ్లి చప్పుడు చెయ్యకుండా తలుపు తీసింది.

తన గది పక్కనే ఉన్న శరశ్చంద్ర గదికేసి రెండడుగులు వేసింది. కుడిచేతినెత్తి కాలింగ్ బెల్ నొక్కబోయి ఒక్క క్షణం నిశ్శబ్దంగా తనలో తను ఆలోచిస్తున్నట్టుగా నిలబడిపోయింది.

కొంచెం సేపటి తరవాత ఓ నిర్ణయానికి వచ్చిన దాన్లా... కాలింగ్ బెల్ స్విచ్ నొక్కింది. ఓ నిమిషం అనంతరం తలుపులు తీశాడు శరశ్చంద్ర.

తన వంక ఆశ్చర్యంగా చూస్తున్న ఆయన్ని తప్పించుకుంటూ లోపలికి వెళ్లింది అరవింద. తన గది బోల్ట్ పెట్టి శరశ్చంద్ర బెడ్ అంచుమీద కూర్చుని ఆయనకేసి చూసింది.

శరశ్చంద్ర వచ్చి మంచానికి అటు చివర కూర్చుని ఆమెకేసి పరీక్షగా చూశాడు. ఎంత సేపటికీ ఆమె పెదవి విప్పకపోవడంతో తనే అడిగాడు "ఏమైంది యామినీ... ఏంటిలా అర్ధరాత్రి వేళ?"

"మనం... భార్యాభర్తలం కదా శరత్?" అడిగిందామె కళ్లెత్తి అతడికేసి చూస్తూ.

"కాదని ఎవరన్నారు?" శరశ్చంద్ర పెదవులు నవ్వుతూ విచ్చుకున్నాయి.

"మరి... అర్ధరాత్రి వేళ... భార్య భర్త గదిలోకి రావడంలో వింతేముంది?"

"రావడంలో వింతలేదు. విడిగా పడుకోవడంలోనే ఏదో వింతుంది"

అరవింద నొచ్చుకున్నట్టు చూసింది. అలా విడిగా పడుకునే ప్రపోజల్ పెట్టింది తనే. శరశ్చంద్ర కాదనలేదు. ఎందుకని అడుగలేదు. అది ఆయన సంస్కారం కావచ్చు... సర్దుకునే స్వభావం కావచ్చు. కానీ ఇవాళొచ్చి తను ఈ విషయంలో ఆయన్ని నిలదియ్యడం తెలివి తక్కువతనం కాక మరేమిటి?

"సారీ శరత్. ఇన్నాళ్లూ చేసిన తప్పును ఇప్పుడు దిద్దుకుందామనే ఇలా వచ్చాను. ఇకమీద ఇది నీ బెడ్‌రూమ్ కాదు మనది."

శరశ్చంద్ర మాట్లాడలేదు. మౌనంగా ఆమె చెప్పేది వింటున్నాడు.

"కోర్టు నుండి సమన్ వచ్చిందిగా" ఆమె అంది.

"అవును"

"నా గురించి వాళ్లడిగితే ఏం చెబుతారు? "

"ఏం చెబుతాను? ఇప్పటివరకూ ఏం చెబుతున్నానో అదే చెబుతా"

"వాళ్లు నమ్మకపోతే? " కనుబొమలు ముడిచి చూసిందామె.

"లెట్ దెమ్ గో టు హెల్"

"దే వోంట్ గో టు హెల్. నిన్ను జైలుకి పంపుతారు. నన్ను... నాది కాని ఇంటికి వెళ్లమంటారు. ఇప్పుడు నేనేం చెయ్యాలి." ఆమె కళ్లు, మళ్లీ తడిబారాయి.

"ఛ... ఏం మాటలవి యామినీ. నిన్నూ నన్నూ విడదియ్యటం ఆ దేవుడిక్కూడా చేతకాలేదు. అందుకేగా నిన్ను మళ్లీ నా దగ్గరికి పంపించేశాడు"

"కానీ..." కళ్లనిండా నీళ్లతో ఆయనకేసి చూసింది.

"ఊఁ... కానీ..." అయోమయంగా చూశాడు శరశ్చంద్ర.

"ఈ దేహం నాది కాదు. దీనిమీద నాకు ఏ అధికారం లేదు. వాళ్లు నన్ను అరవిందవంటున్నారు. ఒకవేళ కోర్టు తీర్పు మనకు అనుకూలంగా లేకపోతే నేను నేనేం చెయ్యాలి? "

"పిచ్చి... పిచ్చి ఆలోచనలు మానేసి హాయి గా నిద్రపో యామినీ. చెప్పాగా మనల్ని విడదీసే శక్తి ఆ భగవంతుడిక్కూడా లేదని!"

"లేదు శరత్... నాకిప్పుడో పీడకల వచ్చిం ది. ఆ కల్లో... నిన్ను దోషివని జడ్జి నిందించాడు. నా ఆత్మను ఈ అరవింద శరీరంలోకి నువ్వు ఆవాహన చేశావట. క్షుద్రదేవతోపాసకుల్తో చేయి కలిపావట. అభం శుభం తెలీని అరవింద భవిష్యత్తును నాశనం చేశావట. జడ్జి నిన్ను అనరాని మాటలన్నాడు. నీకు ఐదు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధించాడు. ఇది నిజమైతే మైగాడ్!" అరవింద రెండు చేతులతో ముఖాన్ని కప్పుకుని రోదిస్తోంది.

శరశ్చంద్ర లేచొచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు. మార్దవంగా ఆమె తల నిమిరాడు. ఆమె దుఃఖం ఎక్కువైంది.

"కలలెప్పుడూ నిజంగావు" చెప్పాడతను.

"ఒకవేళ ఈ కల నిజమైతే? "

ఆయన ఒక్కక్షణం ఆలోచించి చెప్పాడు "నాకు శిక్ష పడుతుంది... అంతేగా. విడుదలై మళ్లీ నీ కోసం వస్తాను. అప్పటివరకూ నువ్వు నా కోసం నిరీక్షిస్తుంటావ్. యామై రైట్? "

ఆమె తల అడ్డంగా ఊపింది "నీకు శిక్ష పడకూడదు. నేను పడనివ్వను. అలా చేసే శక్తి నాకుంది. నువ్వు లేచి నాతో రా" అంటూ బయటకు నడిచింది.

అరవిందనే ఆశ్చర్యంగా చూస్తూ ఆమెను అనుసరించాడు శరశ్చంద్ర.

అరవింద మెట్లు దిగి నేరుగా కిచెన్‌కి కుడివైపున్న పూజ గదిలోకి దారితీసింది.

అక్కడ చాలా దేవుళ్ల పటాలున్నాయి. వాటి ముందుగా ఇటూ అటూ వున్న దీపపు సమ్మెల్లో ఓ మూలగా ఉన్న సీసాలోని నూనెని వంపిందామె. వత్తులు సరిచేసి వెలిగించింది.

ఇత్తడి పళ్లెంలో రాశి పోసి ఉన్న కుంకుమ చిటికెడు తీసి నుదుటిమీద దిద్దుకుంది.

ఆమె చర్యల్ని వెనకే నిలబడి వింతగా చూస్తున్న శరశ్చంద్ర ఆమె దేవుడి పటాల ముందు పసుపు గుడ్డలో మూటకట్టి ఉంచిన తాళిబొట్టును చేతిలోకి తీసుకోవటం గమనించి ఉలిక్కిపడ్డాడు.

అవి... యామిని మెడలో తను కట్టిన సూత్రాలు. వాటిని ఆమె గుర్తుగా... పరమ పవిత్రంగా అక్కడ దాచుకున్నాడు.

అరవింద శరశ్చంద్ర వైపు తిరిగింది.

"నా మనసూ ఆత్మ అన్నీ నీవే. కేవలం ఈ శరీరం మాత్రం మరొకరిది. అందుకే అందరూ మనల్ని విడదీయాలని చూస్తున్నారు. ఈ తాళిబొట్టు ఈ అరవింద మెడలో కట్టు శరత్.

"ఎందుకంటే... నేను ఆత్మ రూపంలోనే కాదు... దైహికంగా కూడా నీ భార్యనవుతాను. అప్పుడు ఈ చట్టం... సంఘం మనల్ని ఏం చెయ్యలేదు. ఏమంటావ్ శరత్? "

"ఆ మంగళసూత్రాల్ని యథాస్థానంలో పెట్టమంటాను"

"శరత్!"

"వాటిని ఎట్టి పరిస్థితుల్లో కూడా నీ మెడలో కట్టడానికి నేను సిద్ధంగా లేను"

అరవింద విచలితురాలై చూసింది. ఓ నిముషం మౌనం తర్వాత ఆమె పెదవి విప్పింది "ఎ... ఎందుకని? "

"ఎందుకంటే... నువ్వు నా భార్య యామిని కాదు కాబట్టి. అందరూ అంటున్నట్టూ అరవిందవే కాబట్టి"

## అందమైన అబద్ధం

'కోయిలలు మామిడి చిగుళ్లు తింటూ వుండగా చూశారా మీరు? అది కవులు కల్పించిన అందమైన బూటకమేమోనని నా అనుమానం. ఈ మధ్యనే దెబ్బ తిన్న కోయిలని పెంచా ను. అది తన రెక్కలకు బలం వచ్చిందాకా ఒక్క మామిడి చిగురు తినలేదు. పురుగుల్నే తింది' అంటూ మరో ఉత్తరంలో ఇంకో మిత్రుడిపై హాస్యం చిలకరించారు చలం.



అప్పుడు నా ఆత్మతో పాటూ ఈ దేహం కూడా నీదవుతుంది. ఇక ఏ జడ్జీ జడ్జిమెంటూ నీ నుండి నన్ను వేరుచెయ్యలేదు"

అరవింద మంగళసూత్రాల్ని ఆయన వైపు చాపింది. శరశ్చంద్ర... ఆమె ముఖంలోకే చూస్తున్నాడు.

ఆమె చాలా ఆవేశంగా మాట్లాడుతోంది. కానీ అంత ఆవేశంలోనూ నిక్కచ్చిగా ప్రవర్తిస్తోంది. ఓ రకమైన దృఢనిర్ణయం ఆమె కళ్లలో కనబడుతోంది.

"దాన్ని నీ మెడలో కట్టుకుంటే? " నింపాదిగా అడిగాడు.

"నేనే కట్టుకుంటాను. అది నువ్వు కట్టావని చెబుతాను"

"అలా ఎందుకు యామినీ? "

"శరత్! నేను... నేను నీ యామిన్ని కాదా? " దుఃఖోద్వేగంతో ఆమె శరీరం కంపించటం స్పష్టంగా కనబడింది శరశ్చంద్రకి.

"డోంట్ గెట్ ఎగ్జయిటెడ్. టేకిటీజీ అరవిందా!"

"ఏమన్నావ్ శరత్!"

శరశ్చంద్ర సూటిగా ఆమెనే చూస్తూ స్పష్టంగా చెప్పాడు "అరవింద అన్నాను"

అరవింద మంగళసూత్రాల్ని అలాగే పట్టుకుని నేలమీద కుప్పకూలినట్టుగా కూర్చుండిపోయింది.

* * *

ఆ పూజగదిలో అక్కడే ఆమె కెదురుగా

కూర్చున్నాడు శరశ్చంద్ర పద్మాసనం వేసుకుని.

అరవింద గోడకానుకుని కూర్చుని ఆయన వంకే వెర్రిదానిలా చూస్తోంది.

ఆమె కళ్లు కలవరంగా కదిలాయి. పెదవులు ఉద్వేగంతో వణికాయి. ఓ సుడిగాలిలా దుఃఖం ఆమెను చుట్టేసింది. అమాంతం మోకాళ్లలో తల దూర్చేసింది.

ఆమెను కాసేపలాగే ఏడవనిచ్చాడు. ఓ అయిదు నిముషాలు గడిచాక ఆమె దుఃఖోద్వేగం తగ్గినట్టన్పించింది. అయినా ఆమె తలెత్తి ఆయనకేసి చూసే ప్రయత్నం చెయ్యలేదు.

అలాగే నిశ్శబ్దంగా కూర్చుని ఉన్న అరవిందతో శరశ్చంద్ర చెప్పడం మొదలెట్టాడు.

"నీ రెండో చెల్లెలు శ్రీదేవి నిన్ను అరవిందవేనంటూ ఓరోజు నిలదీస్తే... నువ్వు విరుచుకుపడిపోయావ్ గుర్తుందా! అప్పుడు నీలోంచి వారంతా ఆ సంఘటనతో నువ్వు యామిని వేమోనన్న భ్రమకు లోనైతే అదే సంఘటన అప్పటివరకూ నిన్ను నా యామినిగా భావిస్తున్న నాలో ఆ నమ్మకాన్ని పోగొట్టింది"

ఆయన ఆపాడు. అరవిందేమైనా తలెత్తి తనకేసి చూసి "ఎందుకలా?" అని అడుగుతుందేమోనని.

ఆమె అటువంటి ప్రయత్నమేం చెయ్యలేదు. అలాగే మోకాళ్లను చేతుల్తో చుట్టేసి వాటిలో



యామిని ఆత్మ మాట్లాడిందని... అందరూ వింతగా చెప్పుకున్న ఆ సంఘటనతో అందరూ యామినివేనని నమ్మారు. చివరికి, నిన్ను ఎంతగానో అనుమానించిన శ్రీదేవి కూడా నువ్వు యామినివేనని నమ్మి వెళ్లిపోయింది.

కానీ అక్కడే ఓ విచిత్రం జరిగింది. అంతవరకూ నిన్ను అరవిందగా అనుమానిస్తున్న

ముఖం దాచుకుని ఉండిపోయింది.

ఆయన నిట్టూర్చి కొనసాగించాడు. "దానిక్కారణం ఒకటుంది. ఓరోజు నువ్వు... ఐ మీన్... ఆ ఇన్సిడెంట్ జరగటానికి కొంత కాలం ముందు ఆశ్రితా అనాథ శరణాలయం కన్‌స్ట్రక్షన్ కోసం ఓ రెండు లక్షల డొనేషన్ ఇచ్చే విషయం గురించి నాతో డిస్కస్

చెయ్యాలని క్లినిక్కి వచ్చావ్ గుర్తుందా!"

ఆమె అవునూ కాదూ అనలేదు.

"నువ్వొచ్చి వెయిటింగ్ హాల్లో కూర్చున్నావు. లోపల నేనో పేషెంట్‌ని చూస్తున్నాను. అప్పటికతను పద కొండో పేషెంట్. అత న్ని చూడ్డం అయ్యాక టెస్టులు చేయించుకురమ్మని చెప్పి ఎందుకో కాస్త రిఫ్రెష్ అవుదామన్పించి నా రూమ్‌లోంచి అతని వెనకే నేనూ బయటికొచ్చాను. అప్పటికి నువ్వు వచ్చినట్టు నాకు తెలీదు. నాకంటే ముందుగా బయటకు వచ్చిన ఆ పెషెంట్ నీకేసి సంభ్రమంగా చూసి "అరె! అరవిందా! ఏంటీ హాస్పిటల్‌కి వచ్చారూ? " అని పలకరించడం గమనించాను. అప్పుడే నన్ను చూసిన నువ్వు అతడి పలకరింపును పట్టించుకోకుండా తొట్రుపాటుగా లేచి నిలబడ్డావ్. అతడింకేదో అడగబోతున్నా వినిపించుకోకుండా నా దగ్గరకు వచ్చి మాట్లాడావు.

అతడు చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయాడు. ఆర్ఫనేజ్ డొనేషన్ విషయం ఫైనలైజ్ అయ్యాక... 'ఎవరతను?' అని నేనడిగినా నువ్వు మాట దాటేశావ్. నువ్వెళ్లిపోయాక, ఇసిజీ టెస్ట్ చేయించుకురావడానికని వెళ్లిన అతడు రిపోర్ట్స్‌తో వచ్చాడు. అతనికేం కంప్లయింట్ లేదు. సంతోషంగా ఫీలయ్యా డు. అప్పుడెందుకో అడగాలన్పించి అడిగాను. "ఇందాక ఒకామెను "అరవిందా!" అని పలకరించారు మీరు. ఆమె నీకు తెలుసా? " అని.

'ఆమె నా స్టూడెంట్' అన్నాడు.

అతడికేసి అయోమయంగా చూశాను. 'వృత్తిరీత్యా నేను ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో పని చేస్తున్నా ప్రవృత్తిరీత్యా వెంట్రిలాక్విస్టీని. ఎంతూజియాస్టిక్, యంగ్‌స్టర్స్ చాలామంది నా దగ్గర దాన్ని ప్రాక్టీస్ చేస్తున్నారు' అని చెప్పాడు.

"ఈమె ఎప్పట్నుంచీ మీ క్లాసులకు ఎటెండ్ అవుతోంది? " అనడిగాను.

"దాదాపు నాలుగు నెలల్నుండీ" అన్నాడు.

అంటే... నువ్వు యామినిలా నా ఇంట్లో ప్రవేశించిన రెండు నెలల తరవాత నుండీ ప్రాక్టీస్ చేస్తున్నావని అర్థమైంది.

ఒక్క క్షణం... యామిని ఎందుకిలా నాకు చెప్పకుండా ఈ పని చేస్తోంది అన్పించిన మాట నిజం. తరవాత దాన్ని పట్టించుకోలేదు. వదిలేశాను. దాదాపు నాలుగు నెలలు గడిచిపోయాయి. మీ పెద్ద చెల్లెలు పెళ్లి కూడా జరిగిపోయింది. ఆ తరవాత... ఓ రోజు నేను క్లినిక్ నుండి ఇంటికి రాగానే మీ రెండో చెల్లెలు శ్రీదేవి వచ్చిందనీ... నిన్ను 'నువ్వు అరవిందవే... యామినివి కావు' అని నిలదీసినప్పుడు నువ్వు విరుచుకుపడిపోయావనీ... నీలోంచి యామిని ఆత్మ మాట్లాడిందనీ... రమామణీ... జోగయ్య చెప్పినప్పుడు మాత్రం... చప్పున ఆ వెంట్రిలాక్విస్ట్ గుర్తుకొచ్చాడు. నువ్వు నా యామినివి కాదు అని నేను తెలుసుకున్న దురదష్టకరమైన క్షణాలవే అరవిందా".

అంతవరకూ మోకాళ్ల మీంచి కనీసం తలెత్తే ప్రయత్నం కూడా చెయ్యని అరవింద చివుక్కున తలెత్తింది.

"మరి... ఆ రోజే... నన్ను నిలదీసి... బయటికెందుకు గెంటలేదు? "

"అది నా స్వార్థం. అందులో నీ తప్పేం లేదు. నా ప్రాణానికి ప్రాణమైన నా భార్యను పోగొట్టుకుని... నేనూ చావటానికి సిద్ధంగా ఉన్న సమయంలో... నా ఇంట్లోకి... నేనే యామినినంటూ ప్రవేశించావ్. బతుకు మీద కొత్త ఆశలు కల్పించావ్. యామిని పోయాక దయ్యాలు తొక్కిన తోటలా అయింది నా ఇల్లు. బంధువులూ, దాయాదులూ, రాబందుల్లా నీకు వారసుల్లేరుగా ఆస్తిపాస్తులేం చేస్తావ్, ఎవరికిస్తావ్ అంటూ, కనీసం యామిని జ్ఞాపకాల్లోనన్నా నన్ను బతకనీకుండా డిస్టర్బ్ చేస్తున్న టైంలో నీ రాకతో మళ్లీ నా ఇంట్లో వసంతం మొదలైంది. అందరి నోళ్లూ మూతపడ్డాయ్. నువ్వొచ్చి అసంపూర్తిగా మిగిలిపోయిన యామిని కలల్ని సంపూర్తి చేస్తుంటే ఎంతో మనశ్శాంతిగా,

నిశ్చింతగా అన్పించింది నాకు.

మా బంధువుల్లో మరీ నికృష్టులు కొందరు నా వయసును కూడా చూడకుండా యామిని కర్మకాండలు ముగిసిన మరునాటి నుంచే వాళ్ల ఆడపిల్లల్ని చేసుకొమ్మని పెట్టే పోరుకు తెరవేసిందీ నువ్వే.

అందుకే అరవిందా! నువ్వు యామినివి కాదని తెలిసి తల్లడిల్లిపోయినా నిన్ను మాత్రం బయటకు పంపలేకపోయాను. నువ్వెవరివైనా సరే, నీ సమక్షం నాకు శాంతినిస్తున్నప్పుడు, నిన్నెందుకు అవమానపరచాలని అన్పించింది. అందుకే నువ్వు అరవిందవని తెలిసినా నిన్ను యామినిలాగే గుర్తిస్తున్నట్టు నటించాను"

అరవింద పవిట కొంగుతో శుభ్రంగా ముఖం తుడుచుకుంది. శరశ్చంద్రకేసి చూసి అదోలా నవ్వి, "ఇద్దరికిద్దరం గొప్ప నటులం" అంది.

"దీనివల్ల ఒకర్నొకరు వంచించుకున్నదేం లేదు. మోరోవర్... ఇద్దరం లాభపడ్డాం"

"అవును. నావల్ల మీరు మానసికమైన ప్రశాంతతను పొందితే, మీ వల్ల నేను ఆర్థికపరమైన ప్రశాంతతను పొందాను. వెరీ గ్రేట్ అండ్ పెక్యూలియర్ బిజినెస్ మనది" ఆమె ఒప్పుకుంది. మళ్లీ తనే అంది.

"ఇప్పుడు మనిద్దరికీ ఒకరి విషయం మరొకరికి స్పష్టంగా తెలిసిపోయింది. సో, ఇక కోర్టులూ, కేసులూ లాంటి తలనొప్పులేం లేకుండా నేను మా ఇంటికి వెళ్లిపోతాను"

శరశ్చంద్ర అరవిందకేసి చూశాడు. ఆమె తల దించుకుని నేలను బొటనవేలితో రాస్తోంది.

"నిన్ను వెళ్లొద్దు అని చెప్పడానికి నాకేం అధికారం ఉంది? అలాగే వెళ్లు. వెళ్లి నీ కోసం కళ్లలో వత్తులు వేసుకుని ఎదురుచూస్తున్న వంశీని పెళ్లి చేసుకో"

"అది జరగని పని" చెప్పిందామె స్థిరంగా.

"అతడు నీకోసం అలమటిస్తున్నాడు. నువ్వు లేకుండా బతకలేడు" చెప్పాడు శరశ్చంద్ర.

"కావచ్చు బట్ ఐ యామ్ హెల్ప్‌లెస్"

"ఎందుకని? "

"వంశీ నన్ను కాదని అమెరికా వెళ్లిపోయాడన్న ఫ్రస్ట్రేషన్‌లోనే నేనలా అయ్యాను. అతడి ప్రేయసిగా చచ్చిపోయి మిసెస్ యామినీ శరశ్చంద్రగా బతికాను. ఇప్పుడు మళ్లీ యామినిగా చచ్చిపోయాను. ఇక బతకదలచుకుంటే మిస్ అరవిందగానే బతుకుతానుగాని, వంశీ ప్రేయసిగానో, భార్యగానో కాదు"

"ఎందుకరవిందా అంత కఠినమైన నిర్ణయాలు తీసుకుంటావ్. నిన్ను నువ్విలా శిక్షించుకోడానికి నువ్వేం తప్పు చేశావని? " ఆయన జాలిగా చూశాడు.

"మీ భార్యగా నటించి మిమ్మల్ని మోసం చెయ్యటం ఒక తప్పు. మీ డబ్బును నా కుటుంబ శ్రేయస్సు కోసం వాడుకోవడం మరో తప్పు. ఇప్పుడు నా అసలు విషయం బయటపడగానే, మళ్లీ ఎప్పట్లా మామూలైపోయి వంశీని పెళ్లాడితే అది నేను చేయబోయే మూడో తప్పవుతుంది. చేసిన తప్పుల్నెలాగూ దిద్దుకోలేను. ఇంకో తప్పు చెయ్యడం నాకిష్టం లేదు"

శరశ్చంద్రకు ఆమె లాజిక్ నచ్చలేదు. "మరి తప్పని తెలిసీ నా భార్యగా ఎందుకు నటించావ్? అంతకన్నా, నా దగ్గరకొచ్చి ఆర్థిక సహాయం అడిగి ఉండొచ్చుగా!"

"అలా అడగటానికి నేను యాచకురాల్ని కాదు" ఆమె స్వరం కాస్త తీవ్రంగా ఉంది "మీ వల్ల నేను ఒకటి పొందేప్పుడు నా వల్ల మీరు ఇంకోటి పొందాలి. ఇట్ మీన్స్... లాభం, మ్యూచ్యువల్‌గా ఉండాలి. అలా ఉంటుందని అన్పించింది గనకనే నేనా ప్రతిపాదనకు ఒప్పుకున్నాను"

"ప్రతిపాదనకు ఒప్పుకున్నావా? " ఆశ్చర్యంగా అన్నాడు. "సో... ఈ నాటకానికి అసలు సూత్రధారులెవరో ఉన్నారన్నమాట! వాళ్లెవరు, అరవిందా? "

ఆమె పంజరంలో చిక్కుబడిన పక్షిలా ఇబ్బందిగా చూసింది.

ఆమె నా ఇబ్బంది నుండి బయటపడేస్తూ

తెరుచుకున్నాయి ఆనందరావ్, రోమా ఆనంద్ పడుకుని ఉన్న బెడ్‌రూమ్ తలుపులు.




యామిని ప్రతి యేటా తన పుట్టినరోజు నాడు వెయ్యిమందికి అన్నదానం చేస్తుంది.

ఇప్పుడూ ఆ అన్నదాన కార్యక్రమం జరుగుతోంది. కానీ, ఇది జరిగేది ఎప్పటిలా ఆమె పుట్టినరోజు సందర్భంగా కాదు, పెద్ద కర్మ సందర్భంగా.

బిల్డింగ్ ఆవరణలో, గేటు బయటా ఎక్కడ చూసినా అన్నార్తులే. పంక్తులు వెంట పంక్తులు లేస్తున్నాయి. ఎంతమంది లేచినా ఇంకా కూర్చునేవారు లెక్కకు మించినట్టుగా ఉన్నారు.

రెండో అంతస్తు బాల్కనీలో కేన్ చెయిర్‌లో కూర్చుని ఉన్నాడు శరశ్చంద్ర. రెండు అరచేతుల్లో గడ్డాన్ని అన్చి మోచేతుల్ని ఒళ్లో ఆన్చుకుని ముందుకు వంగి కింద జరుగుతున్న కార్యక్రమాన్ని చూస్తున్నాడు.

ఇదివరకైతే, ఇలాంటి సమయంలో తన పక్కన యామిని ఉండేది.

కడుపులో ఆకలి తీరగానే కళ్లలో చిందే కాంతుల్ని పైనుండి తనివితీరా చూస్తూ అప్పుడు తన గుండెలో ఊరే ఆనందపు ఊటల్ని మూటలుగా మార్చే శరశ్చంద్రలో తన అనుభూతుల్ని పంచుకుంటూ ఉండేది.

కానీ ఇప్పుడు... ఇప్పుడు...

శరశ్చంద్ర కన్నీళ్లను ఆపుకోవటానికి ప్రయత్నించడంలేదు. యధేచ్ఛగా వాటినలా జారిపోనిస్తున్నాడు.

ఎవరన్నారు? మగవాళ్లు ఏడవరని!

మనిషైతే చాలు. ఆడైనా మగైనా కన్నీళ్లకు తేడా లేదు.

"శరత్!"

శరశ్చంద్ర కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకున్నాడు.

"చావనేది ఇనెవిటబుల్. ఎవరూ తప్పించుకోలేరు. హార్ట్ స్పెషలిస్ట్‌వి నీకు నేను చెప్పాలా? "

అలా అన్నది శరశ్చంద్ర పెదనాన్న కొడుకు సంజీవరావ్. ఆయనుండేది విశాఖలో. వృత్తిరీత్యా ఇంజనీరు.

"చూడు, ఆవిడ కాలం ఆవిడ బాగానే వెళ్ల బుచ్చుకుని పోయింది. పోయినవాళ్లు తిరిగి రారు. సో, ఇక నువ్వాలోచించాల్సింది నీ భవిష్యత్ గురించి. అన్నయ్యగా నీకు నేనిచ్చే సలహా ఇది"

"యామిని చావుతో నా బతుకు చీకటైపోయింది. ఆ అంధకారంలో, భవిష్యత్‌ని ఎక్కడని వెదుక్కోను"?

"అఫ్‌కోర్స్, నౌ యు ఆర్ ఇన్ డార్క్‌నెస్. ఐ అగ్రీ విత్ యు. బట్, చీకట్లో ఉన్నప్పుడు టార్చ్ వెలిగించుకునే పాటి తెలివితేటలు లేని వాడివా నువ్వు? "

"నన్నేం చెయ్యమంటావ్? "

"నా పెద్దకొడుకు బిడ్డల్లో ఒకర్ని దత్తత తీసుకో. వాడి మీది మమకారం నిన్ను జీవితం చివరి వరకూ బతికేలా చేస్తుంది. ఇది కేవలం నా స్వార్థం కోసం చెప్పేమాట కాదు. నువ్వు డాక్టర్‌వి. నీ సేవలు ఈ సొసైటీకి ఎంతైనా అవసరం. అందుకే నువ్వు బాగుండాలి, నువ్వు బాగుండాలంటే, నీకో ఆలంబన కావాలి. ఏమంటావ్? "

శరశ్చంద్ర ఏమీ అనలేదు. కారణం ఆయనకు ఓసారి యామిని అన్న మాటలు గుర్తొచ్చాయి "శరత్ మనకు పిల్లలు లేకపోయినా ఫరవాలేదుగాని, బంధువుల్లో మాత్రం ఎవర్నీ అడాప్ట్ చేసుకోవడానికి వీల్లేదు. కావాలంటే ఏ స్ట్రీట్ చైల్డ్‌నో చేరదీద్దాం. ఏమీ లేనివాడికి ఏదో ఇవ్వటంలో ఉన్న ఆనందం అన్నీ అమరి ఉన్నవాడికి ఇంకా అమర్చటంలో రాదు. అసలది అమానుషం కూడా"

సంజీవరావ్ వెళ్లిపోయాక, శరశ్చంద్ర మేన

మామ వరసైన మరో బంధువు వచ్చాడు.

నెల్లూరు జిల్లా, ఇందుకూరుపేటలో ఉంటున్నాడతను.

"ఏంటల్లుడూ, ఇంకిట్లానే ఏడుస్తూ కూచుంటావా బతుకంతా? ఇది పని కాదయ్యా. నేనో మాట చెబుతా ఒప్పేసుకో. మా ఆఖర్ది లేదూ, నమిత. అచ్చం నీ పెళ్లాంలాగానే ఉంటుంది. దాన్ని చేస్కో. కళ్లముందు యామిన్ని చూసుకుంటున్నట్టే ఉంటది"

శరశ్చంద్రకు నమిత వయసు ఇరవై ఒకటని గుర్తొచ్చి మేనమామకేసి విచిత్రంగా చూస్తుంటే... అతనన్నాడు "నాకు వయసు పట్టింపులేం లేవల్లుడూ. నీకు ఒకటిన్నరంత వయస్సున్న మావూరి పెదరెడ్డి మూడో పెళ్లి చేసుకున్నాడు. రెండో పెళ్లాం ఇంకా బతికుండగానే. నమిత ఇట్టాంటివి అస్సలు ఆలోచించదు. కాకుంటే... పిల్లపేర్న సగం ఆస్తి రాసెయ్ పెళ్లికి ముందే"

శరశ్చంద్ర చెప్పాడు "ఈ ఆస్తిపాస్తులన్నీ యామినివే మామయ్యా. వాటి మీద నాకు ఏమాత్రం అధికారం లేదు"

ఘొల్లున నవ్వాడతని మేనమామ. "ఏం జోకు లేస్తున్నావల్లుడూ. ఎంత పల్లెటూరోణ్ణయితే మాత్రం నాకా పాటి లా తెలీదనుకున్నావా? పెళ్లాం పోయాక ఆస్తి మొగుడిది కాక మొగుడు పోయాక పెళ్లాంది కాక... ఇంకెవరిదవుద్ది? బాగా ఆలోచించు. ఇపుడిట్టా కూచోని యామిన్ని తలుచుకుని ఏడవటం బానే ఉంటది. కొన్నాళ్లు పోయాక ఒంటరితనంతో పిచ్చెత్తిపోతావ్... మగాడికి ఆడదాని అవసరం అట్టాటిది మరి! నీ మీదుండే ఇదితో చిన్నపిల్లయినా నా బిడ్డనిద్దామనుకుంటున్నా గాని మరోటి కాదు"

శరశ్చంద్ర అతడివంక అసహ్యంగా చూశాడు. ఆ సాయంత్రం శరశ్చంద్ర సొంత చెల్లెలు రమామణి "అన్నయ్యా! వదిన చీరెలూ నగలూ ఏం చేస్తావిక? నీ మేనకోడలికి పట్టుకుపోనా? " అంటుంటే మాత్రం శరశ్చంద్ర ఇక సహించలేకపోయాడు.

ఎవర్నీ తనను కలవటానికి అనుమతించవద్దని జోగయ్యకు చెప్పి తన గదిలోకి వెళ్లి తలుపులు మూసుకున్నాడు.

కూతురి కర్మకాండకి అమెరికా నుండి వచ్చిన ఆనందరావూ రోమా ఆనంద్ జరిగే విషయాల్ని నిశ్శబ్దంగా గమనిస్తున్నారు.

శరశ్చంద్ర బంధువుల్ని వారి పోకడల్ని వింతగా చూస్తున్నారు.

యామిని... శరశ్చంద్ర భార్య. తమకు ప్రియమైన కూతురు.

ఈ ఇల్లు ఆమెది. ఈ ఆస్తి ఆమెది. ఈ ఐశ్వర్యం ఆమెది. చివరికి శరశ్చంద్ర కూడా ఆమె మనిషి.

కానీ అటువంటి యామినికి తల్లిదండ్రులై ఉండి కూడా ఈ ఇంట్లో ఏ అధికారం లేనట్టొ ఓ మూలన పడిఉన్నారు.

కూతురి చావుతోపాటే అల్లుడితోటి తమ బంధం తెగిపోయిందా?

ఇక అతను తమకేం కాడా!

తమ అల్లుడికి వాళ్ల వాళ్లేదో దగ్గరైపోవాలని తపిస్తూ ఆస్తిపాస్తుల్ని కాజేయడానికి కుయుక్తిని ప్రదర్శిస్తూ ఇంకా మీరెందుకిక్కడ అన్నట్లు తమకేసి అసహనంగా చూస్తున్నారు.

యామిని ఉంటే ఇలా జరిగేదా?

ఆమె లేదు కాబట్టి ఈ ఇల్లూ ఇక్కడి మనుషులూ తమకేమీ కారా!

రొమా ఆనంద్ ఆరోజు వెక్కివెక్కి ఏడుస్తుంటే ఆనందరావ్ ఓదార్చాడు. "మన బిడ్డే ఇక్కడ లేనప్పుడు ఇక వీళ్లంతా మనకి లేనట్టే"

"శరత్ కూడానా? " అడిగిందామె

"అఫ్‌కోర్స్. అల్లుడు మరోపెళ్లి చేసుకున్నాడనుకో, ఇక ఈ ఇల్లు మనమ్మాయిది కాదు. మనం అతనికి ఏమీ కాము, దట్సాల్"

"నాకు యామినెంతో శరత్ అంతే. అతన్నెప్పుడూ నేను అల్లుడిగా చూడలేదు. కొడుకనే అనుకున్నా. అతనలా పరాయి కావటం నాకిష్టంలేదు"

ఆనందరావ్ నవ్వాడు పేలవంగా "అయితే ఏం చేస్తావ్? "

రొమా ఆనంద్ బేలగా చూసి ఊరుకుంది. కాసేపటి తరవాత అంది "అయితే మనమ్మాయితోపాటు ఈ ఇంటి రెప్యుటేషన్ కూడా పోయినట్టే. ఏ స్వార్థపరురాలో అతడికి భార్యగా వచ్చిందనుకోండి. ఇక యామిని పేరు మరుగునపడిపోయినట్టే"

"పోనీ... నువ్వూ నేనూ అడ్డుపడగలమా? "

"ఇక ఇంటికి మన రాకపోకలు కూడా ఉండవ్ కదూ? " దుఃఖాన్ని మింగుతూ అడిగింది అలా అడుగుతూ ఓసారి చుట్టూ కలయ చూసింది.

యామిని దగ్గరుండి ఇంటీరియర్ డిజైనింగ్ చేయించుకుందా ఇంటికి. ఆ ఇంట్లోని ప్రతి వస్తువూ ఆమె అభిరుచి మేరకు తేబడిందే. ప్రతి అంగుళం ఆమె ఇష్టానుసారం మలచబడిందే.

ఈ మహల్ యామినిదే. కాని ఆ మహల్లో యామినే లేదు.

ఇక ఇది ఎవరిదో!

"క్రితంసారి.... యామిని అమెరికా వచ్చినప్పుడు ఏమందో గుర్తుందా? " అడిగిందామె.

ఆనందరావ్ మాట్టాడలేదు.

ఆమె చెప్పింది "ఎందుకో మమ్మీ... ఉన్నట్టుండి ఈ మధ్య నాకెందుకో ఎక్కువకాలం బతకనేమో అన్పిస్తోంది. నేను చచ్చిపోయినట్టూ... నా యింటిని ఎవరో ఆక్రమించి... సర్వనాశనం చేస్తున్నట్టూ ఒకటే పీడకలలొస్తున్నాయ్" అని బాధపడింది. నేను అనొద్దని కసిరితే "అదికాదు మమ్మీ... ఒకవేళ ఏ కారణం చేతైనా అలా జరిగిందనుకో, నా కలలు అసంపూర్ణంగా మిగిలిపోవలసిందే కదూ! శరశ్చంద్రకు నేనంటే అమిత ప్రేమ. కానీ ఒంటరిగా నా ఆశయాన్ని అతడు సాధించలేడు. అతడి బంధువర్గమంతా సెల్ఫిష్ టైపే. ఈ మెతక మనిషిని వాళ్లెలా చీట్ చేస్తారో! అలా జరక్కుండా ఈ యామిని లేకపోయినా యామిని ఉన్నట్టుగా, అదెప్పటికీ యామిని ఇల్లుగా మిగిలిపోయేట్టుగా, చెయ్యటానికి ఏదైనా మార్గముందా? " అని అడుగుతుంటే పిచ్చివాగుడు కట్టిపెట్టమని వార్నింగిచ్చాను. కానీ కానీ... అదన్నమాట. ఇలా నిజమై కూర్చుంటుందని అనుకోలేదు"...

రొమా ఆనంద్ గుండెలు పగిలేలా ఏడ్చింది చాలా సేపు. ఆనందరావ్ ఆమె వెన్నుని ముురుతూ ఉండిపోయాడు చాలాసేపు.

ఆ తెల్లవారి శరశ్చంద్రను అతడి బంధుజనం మధ్య వదిలేసి విజయనగరంలో ఉన్న తన అక్కగారి ఇంటికి బయలు దేరింది రొమా ఆనంద్, ఆనందరావ్‌తో సహా.




గుమ్మంలో ఆటో దిగుతున్న అరవిందను చూసి భానురేఖ సంభ్రమంగా పరుగెత్తుకొచ్చింది.

అరవిందను వాటేసుకున్నంత పనిచేసి ఆమె చేతిలోని సూట్‌కేస్‌ని లాక్కెళ్లినట్టుగా తీసుకెళ్లి తన గదిలో పెట్టింది.

తనకోసం ఈ విజయనగరం వచ్చిన అరవిందనూ చూస్తుంటే ఆమెకు ఎంతో ఆనందంగా, సంతృప్తిగా, గర్వంగా ఉంది.

ఆ రాత్రి భోజనాలయ్యాక ఇద్దరూ టెర్రస్ మీద పక్కలేసుకుని పక్కపక్కనే పడుకున్నప్పుడు చెప్పింది అరవింద "వంశీ అమెరికా వెళ్లిపోయాడు. అతడి ఫ్రెండ్ శ్రీకర్ తెలుసుగా నీకు, మొన్నోరోజు కనబడి చెప్పాడు".

భానురేఖ నిట్టూర్చింది. "నువ్వేగా. నా కోసం ఆగొద్దు పెళ్లిచేసుకుని అమెరికా వెళ్లిపో అని ఉచిత సలహా పారేశావ్. బాగా బుద్ధి చెప్పాడు"

అరవింద ఆకాశంలో చందమామకేసి చూస్తూండిపోయింది. ఉన్నట్టుండీ ఆమె

# గురక పెడుతున్నారా... టెన్నిస్ బాల్ ఇవ్వండి

అతిగా నిద్రపోయే కుంభకర్ణుడి తమ్ముళ్లతో ఎవరికీ ఏ పేచీ ఉండదుగాని, చిర్రెత్తుకొచ్చేలా గురకపెట్టే గురక బాబులతోనే అసలు తంటా అంతా. పక్కవాళ్లకి నిద్రపోకుండా రఫ్ ఆడించేస్తూ తాము మాత్రం ఒళ్ళు తెలియనంత గాఢనిద్రలో కూరుకుపోయిన వాళ్లని చూస్తే ఎవరికి మాత్రం ఒళ్లు మండదు? భారీ కాయం, మద్యపానం, ధూమపానం వంటి వాటి వలన గురక ఎక్కువవుతుంది. నిద్రపోయే ముందు మద్యం సేవిస్తే గురక పెద్దగా వస్తుంది. గురక తగ్గడానికి ఏ మందులు వాడినా తాత్కాలికమే. అయితే అమెరికన్ వైద్యులు కొన్ని సలహాలిస్తున్నారు.

రాత్రిపూట ధరించే డ్రెస్‌లో టెన్నిస్ బాల్‌ను వేసుకుని పడుకుంటే, నిద్రలో అటు, ఇటు దొర్లినపుడు గాఢ నిద్ర చెదిరిపోయి మెలకువ రావడం వల్ల గురక తగ్గుతుందట. వెల్లకిలా పడుకునే వారితో గురక ఎక్కువగా ఉంటుంది. అలా పడుకునే వాళ్లు తలకింద ఎత్తు దిళ్ళు వాడకూడదు. అసలు దిళ్ళు లేకుండా నిద్రించటం ఇంకా ఉత్తమం. ఈ సలహాల్ని పాటిస్తే గురక నివారించకపోయినా, నియంత్రించ వచ్చంటున్నారు అమెరికన్ వైద్యులు. మందూ మాకులకీ లొంగని గురక ఈ సలహాలతో గప్‌చుప్పవుతుందేమో ప్రయత్నించండి.



చూపు కన్నీటి చుక్కలై రాలేసరికి కంగారుపడింది భానురేఖ.

"నేను ముందే చెప్పాకదే అరూ! వంశీ లాంటి వ్యక్తిని వదులుకోకూ అని. ఇప్పుడేడ్చి ఏం లాభం?" అంది అనునయంగా.

"వంశీలాంటి వ్యక్తి! ఏం వ్యక్తిత్వం అతడిది! ఒకవేళ అనాలోచితంగానే.., ఆవేశంలోనో... నిస్సహాయత వల్లో... నేనతన్ని వదులుకుంటానని అన్నానే చూడు. దాన్ని అడ్వాంటేజ్‌గా తీసుకుని అతడు అన్నంతపనీ చెయ్యాలా? నన్ను నువ్వొదులుకోవటానికి సిద్ధపడ్డా నిన్ను నేనొదులుకోవటానికి సిద్ధంగా లేనని, ఒక్క మాట... ఒక్కమాటైనా అన్నాడా నాతో! కనీసం పెళ్లి చేసుకుని ఈ దేశాన్నే వదిలిపోతున్నప్పుడైనా "వెళ్లొస్తా అరవిందా!" అని నాతో చెప్పాడా? ఎవరో... ఎప్పుడో కనబడి... వంశీ అమెరికా వెళ్లిపోయాడని చెబితే వెర్రిముఖం వేసుకుని వింటానికేనా నేనతణ్ణి ప్రేమించింది!"

నిజమే అన్పించింది భానురేఖకి. "ఊరుకో ఏంచేద్దాం ఆడదాని ప్రేమకీ మగాడి ప్రేమకీ అక్కడే తేడా ఉంది. వాళ్లన్నీ క్షణంలో మర్చిపోగలరు. మనమేమో జీవితాంతం వాళ్లకోసం ఏడుస్తూ కూర్చుంటాం."

"నేనలా ఏం కూర్చోను" రోషంగా అంది అరవింద.

అరవింద అలా అనటం భానురేఖకి సంతోషం కలిగించింది. "వెరీగుడ్... దట్స్ ద స్పిరిట్"

"ఏం అతడికోసం ఏడుస్తూ కూర్చోవడానికి వెనక నాకెవరూ లేరా? ప్రాణంలా ప్రేమించే అమ్ముంది. ప్రాణాలిచ్చే తమ్ముడున్నాడు. ఆశలన్నీ నా మీదే పెట్టుకుని నన్నే నమ్ముకున్న చెల్లెళ్లున్నారు. వీళ్లందరికంటే అతడేమీ నాకు ఎక్కువ కాదు. ఓ రకంగా వీళ్లే నాకు ఎక్కువ. అందుకేగా...అతన్ని పెళ్లిచేసుకుని వెళ్లిపొమ్మ

న్నాను. ఇక నాకు ఏ ప్రతిబంధకాలూ లేవు. ఇప్పుడు కేవలం నా వాళ్ల కోసమే నేనున్నాను. నాకు చేతనైనంత సాయం వాళ్లకు చేస్తాను. వాళ్ల జీవితాల్ని చక్కదిద్దుతాను. ఇక నా విష యమంటావా? తర్వాతి సంగతి తరువాతే"

"అలా అనుకోకు. నీ గురించి కూడా నువ్వు కొంత ఆలోచించు" అంది భానురేఖ.

"ఆలోచించుకుంటాను. కానీ ఇప్పుడు కాదు. నా బాధ్యతలన్నీ తీర్చుకున్నాక"

"అప్పటికి నువ్వు ముసలిదానివైపోతావ్!" వెక్కిరించింది భానురేఖ.

"ఏం ముసలితనంలో జీవించేది మాత్రం జీవితం కాదా? దానికో అర్థం పరమార్థం లేదంటావా? "

అరవిందకు పైత్యం ప్రకోపిస్తోందేమోనని అనుమానం వచ్చిన భానురేఖ ఆ సంభాష ణని దారి మళ్లిస్తూ అంది "సరేగాని... ఇంతకీ యామినిగారి డైరీని శరశ్చంద్ర గారికి హేండో వర్ చేశావా? "

"ప్చ్.. అదేంటో కుదరటమే లేదు. అన్నట్టు ఆ డైరీని తీసుకొచ్చాను- నిర్భాగ్యుల్ని ప్రేమిం చడం, ప్రేమను అన్ని కోణాల నుంచి దర్శించ డంపై యామిని గారి అభిప్రాయాలు ఎంత గొప్పవో నీకు చూపిద్దామని."

"అంటే డైరీ మొత్తం చదివేశావా? "

అరవింద గిల్టీగా చూసింది "పొరపాటు చేశా భానూ! వంశీ వెళ్లిపోయిన వార్త మన సును కోసేస్తున్నప్పుడు, దాన్నుండి బయటప డాలని, అనాలోచితంగా ఆ డైరీ పేజీలు తిర గేశాను. కానీ చదువుతూ ఉంటే మాత్రం ఇంకా చదవాలనిపించింది. అవి ఓ మనిషి డైరీలో పొందుపరుచుకున్న జ్ఞాపకాల్లా లేవు. జీవితంలో నిక్షిప్తం చేసుకున్న అనుభవాల్లా ఉన్నాయి. పూర్తిగా చదివాక, నేను తప్పువె య్యలేదనే అన్పించింది. అసలా డైరీనే... వంశీ లేకపోయినా బతగ్గలనన్న ధైర్యాన్నీ స్ఫూర్తినీ నాకిచ్చింది. జీవితంలో ప్రేమ అనేది ఓ ముఖ్యమైన ఘట్టమే కావచ్చుగాని దాన్ని పొందలేకపోతే అసలు జీవితమే లేదనుకో వటం వెర్రితనం అన్న నిజాన్ని ఆ డైరీ చదు వుతూ గ్రహించాన్నేను. అఫ్‌కోర్స్... ఆమె పర్సనల్ విషయలూ... శరశ్చంద్రతోటి ఏకాం తపు జ్ఞాపకాలూ లాంటి విషయాలూ కూడా అందులో ఉన్నాయనుకో"

చాలా సేపు కబుర్లు చెప్పుకుంటూ అలాగే నిద్రలోకి ఒరిగిపోయారు.

ఓ అర్థరాత్రి సమయంలో ఎవరో సన్నగా ఏడుస్తున్నట్టుగా అన్పిస్తుంటే ఉలిక్కిపడి లేచింది భానురేఖ.

పక్కన అరవింద మోకాళ్ల మధ్య తల వాల్చుకుని దుఃఖిస్తోంది.

"ఏయ్... ఏంటది? ఇందాకటి దాకా అన్ని కబుర్లు చెప్పి" అరవింద భుజం మీద చెయ్యి వేసి ఓదారుస్తున్నట్లుగా అంది.

"వంశీ కల్లోకొచ్చాడు"

"ఇప్పుడు కళ్లు తెరిచావుగా... వెళ్లిపోయుం టాడు. ఇక పడుకో"

"రేఖా! ఎంత కాదనుకున్నా... అతణ్ణి మర్చి పోలేకపోతున్నా. అతణ్ణి పూర్తిగా మర్చిపో యేలా, ఇంకెప్పటికీ నా జ్ఞాపకాల్లోకి కలల్లోకీ అతడు రాకుండా ఉండేలా నేనేమైనా చెయ్యాలి".

"నిదానంగా ఆలోచిద్దాం. ప్రశాంతంగా నిద్రపో"

అరవింద పడుకుంది.

"అరూ! టోటల్లీ యు గాట్ ఫ్రస్టేటెడ్" అర విందనే చూస్తూ గాఢంగా నిట్టూర్చింది భాను రేఖ.

* * *

సాయంత్రం ఆరు దాటుతోంది.

ఎగ్జిబిషన్‌లో ఓ బుక్‌స్టాల్ దగ్గర నిలబడి ఉన్న రొమా ఆనంద్, ఆనందరావుల్ని... చూపుడు వేలితో పాయింటవుట్ చేస్తూ చెప్పింది భానురేఖ అరవిందతో "అరూ! అటు చూడు... ఆ బుక్‌స్టాల్ దగ్గర నిలబడున్నారే, జేడ్ గ్రీన్ కలర్ చీరకట్టుకుని ఆవిడ యామి నిగారి మదర్. ఆ పక్కనున్నాయన ఆమె ఫాదర్"

ఆరవింద ఆసక్తిగా చూసింది వాళ్లకేసి.

"మా పెద్దన్నయ్య ఇన్‌పేషెంట్‌గా ఉన్న టైమ్‌లోనే అనుకుంటా ఓసారి వాళ్లు శరశ్చంద్రగారి క్లినిక్కి వచ్చారు. అప్పుడు చూశాను."

"బాగా తెలుసా వాళ్లు నీకు? అయినా ఇక్కడికెందుకొచ్చారంటావ్"

"అబ్బే... ఒక్కసారి చూశానంతే. అసలు నేనెవరో కూడా వాళ్లకు తెలీదేమో! నిజమే ఇక్కడి కెందుకువచ్చారో? ఎవరైనా ఉన్నారేమో" అంది భానురేఖ. ఇద్దరూ అప్పటివరకూ స్టాల్స్ అన్నీ తిరిగి మిరపకాయ బజ్జీలు తింటున్నారు.

"వెళ్లి పరిచయం చేసుకుందామా?" అరవింద అడిగింది.

"పద" లేచింది భానురేఖ. బజ్జీలు చుట్టిన ఖాళీ పేపర్ని అవతలికి విసుర్తూ.

రెండడుగులు వేశాక అంది భానురేఖ "వాళ్లు మనల్ని పట్టించుకోకపోతే"

"మీ అమ్మాయి యామిని మాకు బాగా తెలుసని చెబుదాం"

అరవింద, భానురేఖ ఒకేసారి 'నమస్తే' అనటం చూసి రొమా ఆనంద్ వాళ్లెవరో అర్థం కాక నొసలు ముడివేసింది సాలోచనగా.

"మీరు మిసెస్ యామినీ శరశ్చంద్రగారి పేరంట్స్ కదూ! ఆమె బాగా పరిచయం మాకు. మేం మీకు తెలీదుగాని, మీరు మాకు బాగా తెలుసు. ఎప్పుడూ యామినిగారు మీ గురించే చెబుతుండేవారు మాతో"

రొమా ఆనంద్ కళ్లు మెరిశాయి.

యామినికి తెలిసిన వాళ్లు! ఎందుకో ఆ వూహే ఆమెకు ఆనందాన్నిచ్చింది. హైదరాబాద్‌లో సొసైటీ లేడీగా యామిని ఎన్ని మంచి పనులు చేసిందో, ఆ నోటా ఈ నోటా విన్నవన్నీ వర్ణించేసింది భానురేఖ. ఆమె చేసిన గుప్త దానాలకు అంతే లేదని పొగిడింది. తను కూడా చాలా విషయాల్లో ఆమె సహాయం పొందినదాన్నేనని నిజాయితీగా చెప్పింది.

అరగంటలో మంచి స్నేహితులైపోయారు. ఇండియాలో కూతుర్ని పోగొట్టుకుని, ఏడ్చి ఏడ్చి ఎండిపోయిన గుండెలతో అమెరికాకి వెళ్లిపోబోతున్న ఆ దంపతులకు వాళ్ల స్నేహం తొలకరి జల్లులా అన్పించింది.

తన అల్లుడంటే తనకు చాలా ప్రేమనీ, కానీ అతణ్ణి చుట్టేసి ఉన్న అతడి బంధువుల ఉనికిని భరించలేక ఇలా కొన్నాళ్లు విజయనగరంలో తన అక్కగారింట్లో గడపాలని వచ్చాననీ చెప్పింది రొమా ఆనంద్.

మాటల్లో అసంకల్పితంగా తనకు యామినీ డైరీ దొరికిన విషయం అనేసింది అరవింద.

ఆ మాట ప్రాణం పోతున్నవాడికి సంజీవిని తాగించినట్టుగా అన్పించిందా దంపతులకు.

"అది అతనికెందుకమ్మా! రేపో మాపో ఇంకో పిల్లను చేసుకుని సెటిలైపోయి దాన్ని ఏ అల్మైరా మూలనో పడేస్తాడు. దాన్ని నాకు తెచ్చివ్వు. నా బిడ్డ జ్ఞాపకాల్ని, నా గుండెలో మూట గట్టుకుని తీసుకెళ్తాను. ఆ డైరీని తాకినప్పుడల్లా నా బిడ్డను ఆలింగనం చేసుకున్నంత స్ఫూర్తిని పొందుతాను" అంటూ ఏడ్చేసిందామె.

మీ యింటికి వెళదాం పదండి. నాకాడైరీ కావాలంటూ గొడవ చేసింది.

"అడ్రసివ్వండి ఆంటీ... మే తెచ్చిస్తాం రేపు" చెప్పింది భానురేఖ.

ఆమె అడ్రస్ ఇచ్చి "తప్పకుండా తెచ్చివ్వండమ్మా. మరచిపోవద్దు" అంటూ ఒకటికి పది సార్లు చెప్పింది.

అనుకున్నట్టే మరునాడు సాయంత్రం ఆరున్నర ఏడు గంటల మధ్య అరవింద, భానురేఖ రొమా ఆనంద్‌ని కలవడానికి ఆమె ఇచ్చిన అడ్రస్ ప్రకారం వెళ్లారు.

అరవిందనీ, భానురేఖనీ చూసి చాలా సంతోషపడ్డారు వాళ్లు. అరవింద యామిని హేండ్ బ్యాగ్‌తో పాటూ డైరీని ఆమెకు ఇచ్చింది.

ఆమె ఆత్రంగా బ్యాగ్ జిప్ లాగి డైరీని తీసి, గుండెలకు హత్తుకుని దాన్ని కన్నీళ్లతో తడిపేస్తుంటే అరవిందకి అన్పించింది, చివరికి దాన్ని సరైన వ్యక్తికే అందించగలిగానని.

రొమా ఆనంద్ ఆ ఇద్దర్నీ తన అక్కయ్యకు పరిచయం చేసింది.

కాసేపు మాట్లాడాక వాళ్లిద్దరూ లోపలికి వెళ్లారు. ఆనందరావ్ రొమా ఆనంద్‌లా కలుపుగోలు మనిషి కాదు. ఆయన టీవీ చూస్తూ కూర్చుండిపోయాడు. అరవింద, భానురేఖ కూడా టీవీ చూస్తుండిపోయారు.

అదో ఇంగ్లీషు సినిమా. కనీసం చీమక్కూడా హాని చెయ్యలేని ఓ మంచి మనిషి శరీరంలోకి ఓ దుష్ట ఆత్మ దూరుతుంది. దాంతో అతడు తన అస్థిత్వాన్నే కోల్పోతాడు. దోపిడీలూ, హత్యలూ లాంటి ఆగడాలు చెయ్యడం మొదలెడతాడు.

ఆ దుష్ట ఆత్మ ఆవహించిన మనిషి ఓ స్త్రీని గొంతు కొరికి హత్య చేస్తున్న సీను వస్తున్నప్పుడు లోపలికి వెళ్లిన రొమా ఆనంద్, ఆమె అక్కయ్యా వచ్చారు. వారి వెనకే పనిమనిషి ట్రేలో స్వీటు, హాటు ఉన్న ట్రే తెచ్చింది.

రొమా ఆనంద్ అక్కయ్య అరవింద, భానురేఖలకు ఆ ప్లేటులు అందించి టి.వి. వంక చూస్తూ అంది. "ఏం సినిమాలో ఒకటే హింస. ఏం... ఓ మంచి మనిషిలోకి ఏదో చెడ్డ ఆత్మ దూరి బీభత్సం సృష్టిస్తున్నట్టు తియ్యకపోతే ఓ చెడ్డ మనిషి బాడీని మంచి ఆత్మ ఆవహించి అతడిచేత గొప్ప గొప్ప పనులు చేయిస్తున్నట్టూ తియ్యొచ్చుగా. కన్‌స్ట్రక్టివ్‌గా ఉండేది కథ"

అరవిందకా ఆలోచనెందుకో నచ్చింది. ఓ నిముషం పాటు ఆమె చెప్పిన థీమ్‌నే మననం చేసుకుంటూ ఉండిపోయింది.

అరవింద, భానురేఖ ఓ అరగంట కూర్చుని వెళ్లొస్తామంటూ లేచారు.

"లెటజ్ మీటగైన్" అంది రొమా ఆనంద్ అరవిందకేసి వాత్సల్యంగా చూస్తూ. యామిని డైరీని ఆమె తనకివ్వటం... ఏ దేవతో ప్రత్యక్షమై తిరిగి యామినే ఇచ్చినంత ఆనందాన్నిచ్చిందామెకు.

"ఎన్నాళ్లుంటారాంటీ ఇక్కడ? " అంది అరవింద.

"ఐదారు రోజులమ్మా. వెళ్లేప్పుడు మళ్లీ ఓసారి హైదరాబాద్ కెళ్లి అతణ్ణి చూసి వెళతాం. ఇక మళ్లీ ఎప్పటికొస్తామో మా అమ్మాయే లేనప్పుడు ఇక మాకిక్కడేం పని!" ఆమె కళ్లలో నీళ్లు నిండాయి.

ఆ రాత్రి పడుకున్నప్పుడు అరవింద అంది భానురేఖతో. "రొమా ఆనంద్‌గారి అక్కయ్య చెప్పిన థీమ్ చాలా బాగుంది కదూ! ఎవరైనా అలాంటి పాయింట్‌తో సినిమా తీస్తే వెరైటీగా ఉంటుంది"

"నువ్వలా అంటుంటే నాకో వింత ఆలోచన వస్తోంది" చెప్పింది భానురేఖ.

ఏంటన్నట్టు చూసింది అరవింద.

"ఇప్పుడు యామినిగార్నే తీసుకో... షి ఈజ్ రియల్లీ ఎ గ్రేట్ లేడీ. కైండ్ హార్టెడ్. అర్ధాంతరంగా పోయిందిగాని బతికుండుంటే ఇంకెంత మందికి ఆసరాగా ఉండేదో! ఆమె



చెప్పినట్టు యామిని లాంటి మనిషి ఆత్మ... ఇంకో వ్యక్తిలో ప్రవేశించి మంచి పనులు చెయ్యటం మొదలెట్టిందనుకో. ఎంత గొప్పగా ఉంటుందో! ప్చ్.. కానీ జీవితం సినిమా కాదుగా అలాంటి వింతలు జరగటానికి!" నిట్టూర్చింది భానురేఖ.

* * *

ఒక్కరోజు గేప్ ఇచ్చి రెండో రోజు వెళ్లారు రోమా ఆనంద్‌ని కలవదానికి.

ఆ రోజామె చాలా ఆందోళనగా కనిపించింది. అరవింద కారణం అడిగితే, "శరత్ ఆ బంధువులతో చాలా ఇబ్బందులు పడుతున్నాడంట. మొన్నయితే ఇక భరించలేక అందర్నీ వెళ్లగొట్టినంత పని చేశాడట! అయినా వాళ్ళు వెళ్ళటం లేదట. అన్నం నీళ్ళూ మానేసి ఒంటరిగా గదిలో గడుపుతున్నాడనీ అర్జంటుగా వచ్చి ఆయన్ని వాళ్ళ బారినుంచి తప్పించమని జోగయ్య ఫోన్ చేశాడు. అక్కడి విషయాల్ని ఎప్పటికప్పుడు ఫోన్ చేసి చెప్పమని నేనే జోగయ్యకు చెప్పాను. యామిని ఉన్నప్పుడు ఆ ఇంటివైపు కన్నెత్తి చూడ్డాని క్కూడా భయపడే చెత్త మూకంతా ఇప్పుడా ఇంటిమీద పడి ఉంది. శరత్ ముందే సెన్సిటివ్. వీళ్ల గోల తట్టుకోలేక ఏం తల్లడిల్లుతున్నాడో" అంది.

"ఇప్పుడు గనక యామినిగారక్కడ ఉన్నట్టుండి ప్రత్యక్ష మైందనుకోండి. ఎక్కడి వాళ్లక్కడ పారిపోతారు" నిన్నటి సినిమా థీమ్ మెదడులో తిరుగుతుండగా నోటికొచ్చిన మాట అనేసింది భానురేఖ.

రోమా ఆనంద్ ఏదో అనబోతుండగా మోగింది ఫోన్. అది హైదరాబాదు నుంచి జోగయ్య కాల్.

"అమ్మా... బంధువులందరూ ప్రస్తుతానికి వెళ్ళిపోయారు ఒకరిద్దరు తప్ప. అయ్యగారి పరిస్థితిలో మాత్రం ఏ మార్పూ లేదు. కనీసం ఆయన పాలు కూడా తాగడం లేదు. మరీ నీరసించి పోతున్నారు. హాస్పిటల్లో రోగుల దారి రోగులదీ... మన డాక్టర్ బాబు దారి డాక్టర్ బాబుదీ అయిపోయింది. నాకు భయంగా ఉంది. ఒక్కసారి మీర్రాకూడదమ్మా" అంటూ ఏమేమో చెప్పాడు.

అప్పుడొచ్చింది అరవిందకా ఆలోచన మెదడులో ఓ మెరుపు మెరిసినట్టుగా. జోగయ్యతో ఏదో దిగులుగా అంటున్న రోమా ఆనంద్ చేతిలోంచి రిసీవర్ అడిగి తీసుకుని చెప్పింది.



## ఇదోటైపు ఓదార్పు

వ్యాపారంలో నష్టాలు వచ్చి అల్లాడుతున్న ఓ మిత్రుడికి చలంగారి ఓదార్పు లేఖలోనూ ఒలికింది హాస్యమే. ఎలాగంటే-

'బీదతనంమీద ఏవైనా కథలు రాయండి. శ్రీశ్రీ పద్యాలూ చదవండి. ధనవంతులమీద కోపంతో కొంతలో కొంత బాధ తీరిపోతుంది'

"చూడు... నీకు అమ్మగారి ఆత్మ కనబడినట్టూ ఆయన్ని ఆహారం తీసుకోమని చెప్పినట్టు నవ్వు నటించు. ఖచ్చితంగా ఆయన కోలుకుంటారు. ఈ లోపు ఆంటీ అంకుల్ అక్కడికి వస్తార్లే"

రోమా ఆనంద్ అరవింద ఐడియా బాగుందని మెచ్చుకుంది. కానీ, అది వర్కవుట్ అవుతుందా లేదా అని అనుమానపడింది.

"మీకెందుకాంటీ. ఒక్కరోజు ఆగి చూడండి. జోగయ్య ఏం చెబుతాడో విందురుగానీ"

"అంటే మేం ఇప్పుడు అక్కడికి వెళ్ళక్కర లేదంటావా? " అడిగిందామె.

అరవింద ఒక్క క్షణం ఆలోచించి చెప్పింది. "అక్కర్లేదు. రేపు జోగయ్య కాల్ రిసీవ్ చేసుకున్నాక నా అంచనా తప్పయితే అప్పుడు వెళ్ళండి" నమ్మకంగా చెప్పిందామె.

ఆమె అంచనా తప్పలేదు. మరునాడు

జోగయ్య నుంచి కాల్ అందుకున్న రొమా ఆనంద్ దంపతులు నేరుగా బయలుదేరి భానురేఖ ఇంటికే వచ్చి అరవిందను అభినం దించారు.

రెండోరోజు కలిసినప్పుడు రొమా ఆనంద్ అంది. "ప్చ్... ఇదే నిజమై నా కూతురి ఆత్మ గనక అతన్ని నడిపిస్తే ఆ ఇంటికీ మాకూ తీరి పోయిందనుకున్న తీయని బంధం మళ్లీ బిగు సుకుంటుంది. కానీ అలా జరగటం సాధ్యం కాదుగా"

"మీరో పని చేస్తే అలా జరుగుతుందాంటే" చెప్పింది అరవింద.

రొమా ఆనంద్‌తో పాటు ఆనందరావు కూడా చిత్రంగా చూశాడు ఆమెకేసి.

అరవింద ఎలాంటి సందిగ్ధం లేకుండా ముందే ఆలోచించుకున్న దాన్లా చెప్పింది.

"నేను శరశ్చంద్ర గారింటికి వెళతాను. అక్కడ నాలోకి యామిని ఆత్మ ప్రవేశించినట్టు నటిస్తాను. ఆయన్ని నమ్మించటానికి ముందే అన్ని జాగ్రత్తలు తీసుకుంటాను గనక ఆయన నమ్మి తీరతాడు. ఇప్పటికే జోగయ్య ప్లాన్‌లో చిక్కుబడిపోయిన ఆయన మెదడు ఈ వింతను రిజెక్ట్ చెయ్యకపోవచ్చు. నన్ను యామినిగానే ఆయన ఆమోదిస్తారన్న నమ్మకం నాకుంది. దాంతో ఆ ఇంటికి మీకూ తీరిపోతుందనుకున్న ఋణం ఇక తీరదు. అది మీ అమ్మాయి యామిని ఇల్లే అవు తుంది. శరశ్చంద్రని బంధువుల బారినుండి రక్షించినట్టూ అవుతుంది. డాక్టర్‌గా ఆయన బాధ్యతల్ని ఆయన నెరవేర్చగలిగేట్టుగా చెయ్యొచ్చు. అన్నిటికీ మించి మీ అమ్మాయి ఆస్తిపాస్తులు ఎవరెవరికో ధారాదత్తం కాకుండా ఆమె ఇష్టానుసారం సహాయ కార్య క్రమాలకు వినియోగించవచ్చు. ఆమె కన్న కలల్ని నిజం చేయవచ్చు. మిసెస్ యామిని భౌతికంగా లేకపోయినా స్పిరిచ్యువల్‌గా ఆమె ఉనికిని ఆ ఇంట్లో ఆవిష్కరించి ఆమె పేరు ప్రతిష్ఠల్ని..."

అరవింద మాటలకు మధ్యలో అడ్డుప డుతూ అంది భానురేఖ "నీకేమైనా పిచ్చి పట్టిందా?"

"పిచ్చి పడితే నేనింత క్లియర్‌గా మాట్లాడగ లుగుతానా? రాత్రంతా ఆలోచించే నేనీ నిర్ణ యానికి వచ్చాను"

చాలావరకూ ముభావంగా ఉండే ఆనంద రావ్ ఆ మాత్రం కల్పించుకుని అడిగాడు.

"ఎంతకాలం అలా నటిస్తావ్?"

"శరశ్చంద్ర మామూలు మనిషయ్యేంత వరకూ మీ అమ్మాయి యామిని ఆశయాలు నెరవేర్చగలిగేవరకూ" చెప్పిందామె.

"ఆ తర్వాత నీ జీవితం ఏమౌతుందో ఆలో చించుకున్నావా?"

"ఇప్పటి జీవితాన్ని గురించే నాకో ఆలో చనా, అవగాహనా లేవు. అందుకే ఆ తర్వాత జీవితం గురించి నాకు బాధ లేదు"

అప్పుడు చెప్పింది భానురేఖ. ఆమె అంతగా ఫ్రస్టేట్ కావడానికి కారణాన్ని.

భానురేఖని పూర్తిగా చెప్పనిచ్చి మళ్లీ మొద లెట్టింది అరవింద. "నేను ప్రేమించిన వ్యక్తి నాకు దూరమైపోయాడు. జీవితం మీద నాకు ఆశ చచ్చిపోయింది. ఇలా నిస్సారంగా జీవిస్తూ నా కుటుంబానికి నేనే మాత్రం న్యాయం చెయ్యగలనో కూడా నాకు అగమ్యగో చరంగానే ఉంది. ఏ క్షణంలో టెన్షన్ భరించ లేక ఈ గుండె ఆగిపోతుందో! అందుకే పోయే లోపల ఓ మంచిపని చేద్దామని నిర్ణ యించుకున్నాను. అటూ మీ అల్లుడిగారి కుటుంబం, ఇటు నా కుటుంబం రెండూ బాగు పడాలంటే ఇదొక్కటే మార్గం. లేదంటే మీ అమ్మాయి సామ్రాజ్యాన్ని ఏ స్వార్థపరు రాలో ఆక్రమించుకోవచ్చు. అలా కాకపోయినా ఆమె ఆస్తిపాస్తులు దుర్వినియోగం కావచ్చు. అన్నిటికన్నా మిం చింది మీకా యింటితో ఉన్న ఒక మధురానుబంధం అర్థవంతంగా మాసిపోవచ్చు"

అరవింద, భానురేఖ వెళ్లిపోయాక రొమా ఆనంద్, ఆనందరావూ చాలాసేపు తర్జన భర్జ నలు పడ్డాక ఓ నిర్ణయానికొచ్చారు.

ఎలాగూ నిరాశలో, నిర్వేదంలో కొట్టుకుపో తున్న మనిషి ఇలాగైనా మానసికంగా కోలు

కుంటుందేమో! దీనివల్ల ఎవరికీ ఎటువంటి నష్టం లేనప్పుడూ అమలు చేసి చూస్తే తప్పే ముంది అనుకున్నారు.

అరవిందని కలిసి తమ ఆమోదం తెలిపారు. ఆ విధంగా నటించినందుకు ఆమె ఇద్దరి చెల్లెళ్ల పెళ్ళిళ్ళకీ ఆర్థిక సహాయం చేస్తామన్నారు.

భానురేఖ దగ్గర ఈ రహస్యాన్ని తన గుండెల్లోనే దాచుకుంటానని మాట తీసుకున్నాక అరవింద యామిని అమెరికా జీవితం గురించి రొమా ఆనంద్‌ని అడిగి క్షుణ్ణంగా తెలుసుకుని ఆమె మ్యానరిజమ్స్‌ని ప్రాక్టీస్ చేసి తనామెకు ఇచ్చిన డైరీని తిరిగి తీసుకుని హైదరాబాద్ బయలుదేరింది.




చెక్కగేటు పక్కగా ఉన్న మట్టికుండలో గులాబి మొక్క ఎండిపోతే శీను నీళ్లు పోస్తున్నాడు.

అరవింద వరండాలో అరుగుమీద కూర్చుని ఉన్న అరవింద "దానికి నీళ్లు పోయడం వృథా శీనూ చచ్చిపోయినట్టుంది" అంది.

ఆమె అలా అంటున్నప్పుడే గుమ్మంలో బుల్లెట్ ఆగింది.

వంశీ దిగి లోపలికొస్తూ కన్పించాడు.

అరవింద నిర్లిప్తంగా చూసిందతడికేసి.

అతడు రావడం రావడమే అరవిందకేసి సూటిగా చూస్తూ అడిగాడు "ఏం నిర్ణయం చుకున్నావ్ అరవిందా? "

"నా నిర్ణయం నిన్ననే చెప్పాను"

"ఆలోచించుకోమన్నాగా రాత్రంతా"

"ఆలోచించుకునేదేం లేదని నేనూ చెప్పాను"

శీను వచ్చి కుర్చీ జరిపి 'కూర్చోండి' అన్నాడు వంశీతో.

వంశీ ఓసారి కుర్చీకేసి చూశాడుగాని కూర్చునే ప్రయత్నం చెయ్యలేదు.

"నీ నిర్ణయం మారదంటావ్!"

"ఊరికే మారేది నిర్ణయం ఎలా అవుతుంది? "

"సరే నేనొస్తా" అన్నాడతడు కరుగ్గా.

"మంచిది" అంది మామూలుగా.

వంశీ రెండడుగులు ముందుకేసి మళ్లీ వెనక్కొచ్చాడు "ఎల్లుండి వెళ్లిపోతున్నా"

"ఐ విష్ యు ఎ హేపీ జర్నీ"

హఠాత్తుగా అతడి ముఖంలో మబ్బులు కమ్ముకున్నాయ్. ప్యాంట్ జేబులోంచి కర్చీఫ్ తీసి ముఖం తుడుచుకున్నాడు.

"నువ్వు లేకుండా నా జర్నీలో హేపీనెస్ ఎక్కడుంటుంది అరవిందా? జీవితాంతం నాతో కలిసి ప్రయాణిస్తావనుకున్నా. మొదటి మజిలీలోనే నా చేతిని విడిచి వెడతావనుకోలేదు"

అరవిందేం మాట్లాడలేదు.

"ఎందుకరవిందా, ఇంత కక్ష నా మీద నీకు? నేనేం చేశానని! నేను అమెరికా వెళ్లిపోయానని శ్రీకర్ నీకు చెప్పగానే నువ్వతణ్ణి ఒక్క ప్రశ్న వేసుండాల్సింది. వంశీ ఒంటరిగా వెళ్లాడా, జంటగా వెళ్లాడా? అని! అలా అడక్కపోవటం నీ తప్పు. దానికి నన్ను సాధిస్తున్నావ్!"

"తప్పొప్పులు ఎవరివో ఎంచటం లేదు నేనిప్పుడు. ఎలాగో తప్పు జరిగింది. అది నాదే కావచ్చు. బట్ దానివల్ల నాలో విపరీతమైన మార్పు వచ్చింది. ఆ మార్పుకు నేను అడ్జెస్ట్ అయిపోయాను. దాదాపు నా ఉనికినే మరిచిపోయి మరో వ్యక్తిగా బతికాను. ఇప్పుడు మళ్లీ నువ్వు అప్పటి అరవింద కావాలంటున్నావ్. ఎటుపడితే అటు మారే శక్తి ఇక నాకు లేదు. నన్నిలా ఉండనీ"

"నువ్వలా ఉండు. నేను మాత్రం నీ మీది ప్రేమతో సర్వనాశనం అయిపోతాను"

ఆమె నొచ్చుకున్నట్టు చూసింది.

"నువ్వలా కాకూడదని మాత్రం మనస్ఫూర్తిగా కోరుకుంటున్నా వంశీ. నాలా నువ్వు ఓ జీవితాన్ని ఎంచుకో, అలా జీవించటం నేర్చుకో, అదేమంత కష్టం కాదు. అనుభవం మీద చెబుతున్నా"

"మెనీ మెనీ థేంక్స్ ఫర్ యువర్ సజెషన్ గుడ్‌బై"

అతడు వెళ్లిపోయాడు విసురుగా.

అతనటు వెళ్లగానే తులసమ్మ అమాంతం విరుచుకుపడింది. అరవింద మీద "నీగ్గాని పిచ్చి పట్టిందా ఏమిటే, బంగారం లాంటి మనిషి నీ కోసం పడిచస్తున్నానో అంటే నిమ్మకు నీరెత్తినట్టు ఉండిపోతావ్! అసలేమిటే నీ ఉద్దేశం? బరువులూ, బాధ్యతలూ అన్నీ తీరిపోయాక్కూడా ఎందుకే నీకీ పంతం? "

"అక్కా అనవసరంగా మంచి ఛాన్స్ పోగొట్టుకుంటున్నావ్. వంశీ లాంటి వ్యక్తి మళ్లీ మనకు దొరకడు. మాకు దారి చూపించి నీదారెందుకక్కా మూసుకుంటావ్? " శీను బాధగా అన్నాడు.

అరవింద ఆ ఇద్దరికీ సమాధానం చెప్పకుండా లేచి తన గదిలోకి వెళ్లి తలుపులు మూసుకుంది.

"నిజంగానే ఆ యామినీ దయ్యం పట్టలేదు కదా దీనికి!" తులసమ్మ తల కొట్టుకుంది.

ఆ సాయంత్రం గుమ్మం ముందు ఆగిన కారులోంచి రామాఆనంద్ దిగింది.

"స్వార్థమో, నిస్సహాయతో, మరోటో మరి ఆ టైమ్‌లో నన్నాపనికి పురికొల్పింది. నాకు తెలీదు. ఉదయం నుండి సాయంత్రం వరకూ చేసి డ్యూటీ దిగిపోయే పనికాదది. నా ఉషోదయాలూ, సంధ్యలూ, మధ్యాహ్నాలూ, రాత్రులూ అన్నీ దానికే అంకితం చేశాను. నాకంటూ ఒక్కక్షణం కూడా నేను మిగుల్చుకోలేదు. అసలు నన్నంటూ నేను గుర్తు పెట్టుకోలేదు. వర్క్‌తో నన్ను నేను పూర్తిగా ఇన్‌వాల్వ్ చేసుకున్నాను. ఇంకో రకంగా చెప్పాలంటే నేను అరవిందగా చచ్చిపోయి యామినిగా జన్మనెత్తాను. యామినిలా మాట్లాడాను, యామినిలా ఆలోచించాను, యామినిలా పనిచేశాను, యామినీ అని పిలిస్తేనే పలికాను.

ఆ మార్పు నాలో నాకే తెలియని ఒక వింత అనుభూతిని ఆవిష్కరించింది. నన్ను నేను విశ్లేషించుకో గలిగే శక్తిని నాకు ఇచ్చింది.

అంతకుముందు అరవిందగా ఉన్నప్పుడు బతుకంటే ఒక బాధ్యత అనే తెలుసు. చదవాలి... సంపాదించాలి... నా వాళ్లకు అన్నీ అమర్చాలి. ఆపైన నేనూ అనుభవించాలి. దట్సాల్ అంతవరకే నా ఆలోచన పరిమితమయింది.

కానీ యామినిగా జీవించడం మొదలెట్టాక జీవితం విలువెంతో తెలిసింది నాకు. అసలు అవధులే లేని అనంత సాగరం అదని అర్థమైంది.

నేను యామినినై అన్నార్తులకు అన్నం పెట్టగలిగాను. అనాథలను ఆదుకోగలిగాను. నిస్సహాయుల్ని అక్కున చేర్చుకున్నాను. కష్టజీవుల్ని పరామర్శించాను.

ప్రేమా, పెళ్లీ, కుటుంబం, బాధ్యతా మాత్రమే కాని జీవితపు మరో కోణాన్ని దర్శించిన క్షణాలవి.

ముందు నిరాశలో, నిర్వేదంలో నేనామెలా నటించే నిర్ణయం తీసుకున్నానేమో గాని ఆ తర్వాత ఆమెలా నటించడం మానేసి జీవించడం మొదలుపెట్టాను. ఆమె జీవన మార్గంలోని గొప్పదనాన్ని అర్థం చేసుకున్నాను.

అందుకే తిరిగీ అరవిందను కాదలుచుకోలేదు. కేవలం యామినిగానే మిగిలిపోవాలనుకుంటున్నాను. అయితే అది మానసికంగా మాత్రమే. నాలో నేనే బలవంతంగా ప్రతిష్ఠించుకున్న యామిని ఇప్పుడు నా హృదయమంతా తానైపోయింది.

ఇదుగో... ఇలాగే జీవించు అని నన్ను శాసిస్తోంది.

ఇప్పుడు ప్రేమా, పెళ్లీ లాంటివి నన్ను కదిలించలేని విషయాలు.

యామిని రేంజ్‌లో నేను ఒకరికి సాయపడలేకపోవచ్చు కానీ ఆమె స్ఫూర్తితో నా పరి

ధిలో నేను ఈ సొసైటీ శ్రేయోభిలాషిగా మిగిలిపోవాలనుకుంటున్నాను. ఐ విషిట్ ఫ్రమ్ ద బాటమ్ ఆఫ్ మై హార్ట్".

అరవిందను పూర్తిగా చెప్పనిచ్చి అప్పుడు పెదవి కదిపింది రొమా ఆనంద్. "మా యామిని సన్యాసిని కాదే! ఆమె లైఫ్ స్టైల్‌కు పెళ్లనేది ప్రతి బంధకం అవుతుందని తనెప్పుడూ అనుకోలేదు. పైగా ఆమె శరత్‌ని ప్రేమించి పెళ్లి చేసుకుంది"

"నా లైఫ్‌లో ఆ చాప్టర్ మొదలై అర్ధాంతరంగా ముగిసిపోయింది. ఇప్పుడు దాన్ని మళ్లీ మొదలు పెడితే ప్రస్తుతం చెయ్యాలనుకున్నది ఈ జీవితకాలం తరవాత కూడా చెయ్యలేనేమో!"

రొమా ఆనంద్ నిట్టూర్చింది. "నీ జీవితం ఇలా నిస్సారంగా కావడానికి కారణం పరోక్షంగా నేనేనన్న బాధను నాకు మిగులుస్తున్నావు. ఇదెప్పుడూ నన్ను వెంటాడుతూనే ఉంటుందేమో!"

అరవింద మౌనంగా ఊరుకుంది.

"సరే... ఇప్పుడేం చెయ్యదల్చుకున్నావ్?" అడిగింది రొమా ఆనంద్.

"ఓ అనాథ శరణాలయం ఏర్పాటు చేసి కనీసం కొంతమంది అనాథల్నయినా ప్రయోజకుల్ని చెయ్యాలనుకుంటున్నా"

రొమా ఆనంద్ లేచింది. అరవింద చేతిని తన చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకుంది "మే గాడ్ బ్లెస్ యూ చైల్డ్"

* * *

"అమ్మా... అక్కెక్కడ?" పరుగులాంటి నడకతో వచ్చాడు శీను. కనీసం సైకిల్‌కి స్టాండ్ కూడా వెయ్యకుండా గోడకు ఆనించేసి.

ఏమైందన్నట్టు చూసింది అక్కడే ఉన్న అరవింద.

"ఉదయం మన ఇంటి నుంచి వెళ్తున్నప్పుడు వంశీగారికి యాక్సిడెంట్ అయిందట. తలకు బలమైన గాయం తగిలి హాస్పిటల్లో ఉన్నాడని శరశ్చంద్రగారు చెప్పారు. నిన్ను అర్జంటుగా క్లినిక్కి తీసుకురమ్మన్నారు"

అరవింద చివుక్కున లేచి నిలబడింది. దేహమంతా చిగురుటాకులా కంపిస్తుండగా బయటికి ఒక్క పరుగు తీసి కనీసం విషయం మోసుకొచ్చిన శీనూను కూడా వెంటరమ్మని పిలవకుండా వెళ్లిపోయింది.

శరశ్చంద్ర క్లినిక్ ముందు ఆటో దిగి, ఆదరాబాదరాగా కన్సల్టింగ్ రూమ్‌లోకి సుడిగాలిలా వెళ్లింది.

"వంశీ... వంశీ ఎక్కడ?"

"కూర్చో అరవిందా" ఆమె కంగారును గమనిస్తూ కూడా ప్రశాంతంగా చెప్పాడు శరశ్చంద్ర.

ఆమె కూర్చోలేదు. "అతడికెలా ఉంది?"

"అది నీకంత అవసరం అనుకోను"

"డాక్టర్!"

"యస్ మిస్ అరవిందా! అతడి బాగోగులు కనుక్కోడానికి అతణ్ణి ప్రమాదం నుంచి రక్షించుకోడానికీ తల్లిదండ్రులూ, బంధుమిత్రులూ చాలామంది ఉన్నారు. నువ్వింతగా కంగారు పడిపోవటానికి అతనేమీ అనాథ కాడే"

అరవింద నిలబడలేనట్టు కుర్చీలో కూలబడిపోయింది.

"అది కాదు శరత్‌గారూ, అతడు నాకు..."

"ఏమీ కాడు" ఆయన చెప్పాడు.

ఆమె ముఖం మ్లానమైంది.

"ఇప్పుడతడు ఆ గాయంతో చనిపోయినా... నీకు బాధ పడే అధికారం లేదు"

"ఎందుకు లేదు?" ఆమె రోషంగా చూసింది.

"నువ్వు వంశీని ప్రేమించిన అరవిందవు కాదు కాబట్టి. ఆ అరవింద ఎప్పుడో చచ్చిపోయింది. నువ్వు యామినివి. వంశీకి యామిని ఏమీ కాదు. వంశీ చనిపోతే యామిని ఏడవదు. కేవలం సాటి మనిషిగా జాలి పడుతుంది. అంతే"

అరవిందకు దుఃఖంతో తల అదురుతున్నట్టనిపించింది. "డాక్టర్! ప్లీజ్... వంశీకేమైంది? ఎక్కడున్నాడు చెప్పండి. నా గుండెలవిసిపోతున్నాయి. నన్నతణ్ణి చూడనియ్యండి"

"చూడనివ్వకపోతే?"

"ఈ గోడకేసి తల బాదుకుని చస్తాను"

ఆమె నిస్సహాయంగా ఏడ్చేసింది.

"ఎందుకలా? "

"ఎందుకంటే... ఎందుకంటే..."

"ఎందుకంటే నువ్వు అరవిందవే కాని యామినివి కాదు. గనక అరవింద వంశీని మనసారా ప్రేమించింది గనక. యామై రైట్? "

అరవింద తడిసిన కను రెప్పల్ని బరువుగా దించుకుంది.

శరశ్చంద్ర స్వరం మార్ధవంగా ఉంది. "చూడు అరవిందా! నా యామిని ఈ లోకాన్ని ప్రేమించిన దానికన్నా... నేనామెను నూరం తలు ఎక్కువ ప్రేమించాను. ఆమె నా వెంటే ఉన్నదన్న భ్రమను నాకు నా వాళ్లు కలిగిస్తేనే గాని మనిషిని కాలేకపోయాను.

ఆ భ్రమకు నువ్వు ప్రాణం పోశావ్.

తల్లిదండ్రులూ... బంధుమిత్రులూ లేని వాళ్లే కాదు అరవిందా అనాథలంటే, ప్రేమించిన మనిషిని పొందలేని వాళ్ళు కూడా అనాథలే.

యామినివై ఈ అనాథను ఆదుకున్నావ్. నా జీవితాన్ని నిలబెట్టావ్. అరవిందవై వంశీనెందుకు ఆదుకోవు? అందరికీ అవి పంచివ్వడానికి సంసిద్ధమైన నువ్వు... ఒక్క వంశీని మాత్రం ఎందుకు నిరాదరిస్తున్నావ్?

అతణ్ణి అక్కున చేర్చుకుని ఓదార్చలేని కఠినురాలివి. రేపు ఇంకోరి కన్నీళ్లనెలా తుడవగలుగుతావ్?

ఈ వర్షానికి మోసులెత్తని నేల... మరో వర్షానికి మాత్రం ఎందుకు మెత్తబడుతుంది? "

"డాక్టర్, ముందు వంశీ ఎక్కడున్నాడో చెప్పండి... అతణ్ణి నేను అర్జంటుగా చూడాలి"

ఉద్వేగంతో కదిలిపోతూ లేచి నిలబడింది అరవింద.

"రా చూపిస్తా" శరశ్చంద్ర లేచి ముందు దారి తీస్తే వెనకే అరవింద పరిగెత్తినట్టు నడుస్తోంది.

ఆయన రెండో అంతస్తులోని ఓ గది ముందు ఆగి మెల్లగా తలుపు తట్టాడు.

ఒక్క క్షణం తర్వాత నిశ్శబ్దంగా తెరుచుకున్నాయి తలుపులు.

వంశీ తలగ్గానీ... కాళ్ళగ్గానీ... అసలు శరీరంలో ఎక్కడ కూడా బేండేజ్ అనేదే లేకుండా మామూలుగా నిలబడి ఉన్నాడు.

శరశ్చంద్రను దాటుకుని వంశీ ముందు నిలబడి సంభ్రమంగా అడిగింది అరవింద. "వంశీ నీకు యాక్సిడెంట్ కావడం..."

"నిజమే" చెప్పాడు వంశీ. "అయితే గాయమైంది తలక్కాదు... గుండెకు. నువ్వు మామూలు కళ్లతో కాకుండా మనసుతో చూస్తే... అది స్రవిస్తున్న రక్తం నీక్కనబడుతుంది"

"వంశీ" అంటూ అరవింద కుప్ప కూలినట్లు కూలబడి పోయింది.

వంశీ ఆమె రెండు భుజాల మీద చేతులేసి పైకి లేపాడు.

"అరవిందా!" చాలా సేపటి తరువాత పిల్చాడతను.

"ఊఁ..."

"నువ్వు పెట్టబోయే అనాథ శరణాలయంలో మొదటి అనాథను నేనే. నాకు డబ్బూ... దుస్తులూ... తిండీ లాంటివి అక్కర్లేదు. నాక్కావల్సింది..."

"అర్థమైంది. మొన్నటిదాక యామినిలా జీవించినా నిన్ను మాత్రం నీ అరవిందలానే ప్రేమిస్తాను" చెప్పిందామె.

ఇద్దరూ కలిసి హాస్పిటల్ గేటు దాటుతుంటే శరశ్చంద్ర అన్నాడు. "మీ మేరేజ్‌కి డిన్నర్ నేను అరేంజ్ చేస్తాను"

గుమ్మంలో వంశీ బుల్లెట్ ఆగ్గానే బయటకు పరుగెత్తుకొచ్చారు తులసమ్మా, శీనూ.

అరవింద శీనూకేసి కోపంగా చూస్తుంటే అతడు నవ్వు దాచుకుంటూ అన్నాడు. "అక్కా! ఉదయం గులాబీ మొక్కకి నీళ్ళు పోస్తుంటే వేస్ట్‌రా... అది బతకదు అన్నావ్. చూడు... సాయంత్రానికే లేచి నిలబడింది"

అరవింద ఆ మట్టి కుండీలోని గులాబీ మొక్కకేసి కళ్ళు విప్పార్చి చూసింది.

ఎప్పటికీ చచ్చిపోని ప్రేమలా... అజరామరమైన అనురాగంలా... పచ్చగా కనబడిందది ఆమె కళ్లకు. ✦





## తరాల నడుమ సంఘర్షణకు అద్దం

# మూడు తరాలు

అతి కొద్దికాలంలోనే మంచి రచయిత్రిగా పేరుతెచ్చుకున్న **శ్రీలత** కలంనుంచి జాలువారిన నవల **'మూడు తరాలు'**. వృత్తిపరమైన విజయాలే తప్ప ఈతరానికి సృజనాసక్తి లేదని, ముఖ్యంగా సమాజానికి వెలుగుబాట చూపే సాహితీ సృజన అస్సలు చేతకాదని ఆరోపించేవారికి ఈ నవల దీటైన జవాబు. నేటి యువత కలం పదును చవిచూపే **'మూడు తరాలు'** కథ వెనుక కథ రచయిత్రి మాటల్లోనే చదవండి..

'నా రచనల్లో నాకిష్టమైన నవల 'మూడు తరాలు'.

ఉమ్మడి కుటుంబాలు, వ్యష్టి కుటుంబాలుగా మారడానికిగల ఆర్థిక, సామాజిక, వ్యక్తిగత కారణాలే ఈ నవల కథాంశం.

మూడు తరాలలోని అంతరాలను విపులీకరిస్తూ రాయాల్సి వచ్చిన ఈ నేపథ్యానికి ఉమ్మడి కుటుంబంలోనే నేనూ జీవిస్తుండడం వల్ల స్వానుభవాన్ని బాగా వినియోగించుకున్నాను. ఈ వస్తువు తీసుకునేటప్పుడే బాగా డీల్ చెయ్యగలననే నమ్మకం కలిగింది.

వ్యవసాయ కుటుంబాలు చదువులు, వలస కారణంగా పల్లెటూళ్లనుంచినగరాలకు వచ్చి, తమ ఆర్థిక విధానాన్ని వ్యాపారాలుగా విస్తరించుకుని సాగుతున్న క్రమంలో ఆ కుటుంబాలలో, ఉమ్మడి ఆలోచనలున్న వ్యక్తులలో కలిగే మానసిక సంఘర్షణకు ఇందులో పెద్దపీట వేశాను. ఈ సందర్భంగా వారిలో వచ్చేమార్పులు, స్పర్థలు, సంఘర్షణలూ విశదీకరిస్తూ, ఉమ్మడికుటుంబాలు, వ్యష్టి కుటుంబాలుగా చీలేటప్పుడు ఆయా కుటుంబసభ్యుల మానసికవ్యథ చిత్రించాలనే ప్రయత్నం చాలా పట్టుదలతో చేపట్టాను.

**మొదటి తరానికి ప్రతినిధులు**

ఈ నవలలో మొదటితరం ప్రతినిధులుగా రాఘవయ్య, చంద్రమ్మలను తీసుకున్నాను. అది ఇంచుమించుగా మా తాతయ్య, నానమ్మల తరం. ఆనాటి ఆర్థికవిధానం వ్యవసాయం, పశుపోషణ మీద ఆధారపడి ఉంది. అప్పటి సంప్రదాయాలు, అలవాట్లు ఆలోచనలు వాటికి అనుగుణంగా వర్ణించాల్సి వచ్చింది. సంపూర్ణమైన ఉమ్మడి కుటుంబస్థితిని వివరించడానికి ఆ తరం ఎంతో తోడ్పడింది.

ఆర్థికవిధానం ఉమ్మడిదవటం వలన కుటుంబ సభ్యుల మధ్య ఉండే ఉమ్మడి బాధ్యత, అనుబంధం, ఆత్మీయతలను వివరించడానికి, నిష్కళంకమైన ప్రేమను వారి మధ్య ప్రతిఫలింపచేయడానికి ఆ తరం చాలా ఉపయోగపడింది.

ఆర్థికవిధానం వ్యవసాయం నుంచి చిన్నపాటి పరిశ్రమల వైపు మళ్ళటం రెండో

తరంలో కనిపిస్తుంది. ఈతరం ప్రతినిధులుగా నాగేశ్వరరావు జయలక్ష్మిలను తీసుకున్నాను.

అప్పుడప్పుడే విస్తరిస్తున్న వ్యాపార ధోరణులు అంతకుముందున్న వ్యవసాయ ధోరణులు మధ్య నలిగి వ్యక్తులుగా వీరు కనిపిస్తారు. పూర్తిగా మార్పురాని తరం ఇది. ఆర్థిక విధానంలో వచ్చీరాని ఈ మార్పు ఉమ్మడి కుటుంబపు పునాదులను కదిలించడం మొదలుపెట్టి ఉమ్మడి ఆలోచనలకు బీటలు వేయడం కొనసాగుతుంది.

ఉమ్మడి పెత్తనం వ్యక్తిగత పెత్తనం వైపు మళ్ళడం మొదలుపెడుతుంది. వ్యవసాయ కుటుంబంలో ఉండే శారీరక శ్రమ ప్రాధాన్యత తగ్గి తెలివితేటల ప్రాధాన్యం పెరిగి తెలివికలవాడే కుటుంబపు ఆధిపత్యాన్ని కలిగి ఉండే స్థితి ఏర్పడే విధానం అమలులోకి వస్తుంది.



ఇక మూడవ తరం ప్రతినిధులుగా పిల్లలను తీసుకున్నాను. వ్యక్తిగత విజయం పట్ల వ్యక్తిగత ఆధిపత్యం పట్ల బలమైన అభిప్రాయాలు కలవాళ్లు వీళ్లు. సమాజంలో వ్యవసాయ ప్రాధాన్యతకన్నా వ్యాపార వ్యవస్థ ప్రాధాన్యత పెరిగిన దశ ఇది.

వీళ్ళు మొత్తంగా ఉమ్మడిని వ్యతిరేకిస్తారు. ఉమ్మడిగా జీవించినా ఎవరికి వారు స్వీయ విజయాల పట్ల ఆసక్తి కనబరుస్తుంటారు. కలిసి జీవిస్తున్నా స్వయంశక్తిని కనబరుస్తుంటారు. ఇదీ కథ. ఆర్థికమైన మార్పువల్ల ఉమ్మడి మాసిపోయి వ్యష్టి భావనలు ఏర్పడ్డాయనే విశ్లేషణ చేశాను.

ఈ విశ్లేషణకు బి.ఎ.లో చదువుకున్న సోషియాలజీ సబ్జెక్ట్ నాకు బాగా ఉపయోగపడింది. రెఫరెన్స్ కోసం సోషియాలజీ బుక్స్ చాలా వాడుకున్నాను.

ఈ నవల రాసీరాయగానే ప్రముఖ భాషావేత్త, విమర్శకులు చేకూరి రామారావు గారికి అభిప్రాయం నిమిత్తం అందజేశాను.

'ఒక మంచి సామాజిక విశ్లేషణకు చెందిన నవల. నీ ప్రయత్నం ఫలించింది అన్నారు.

**ఎంతో ఆనందం వేసింది.**

ఎందుకంటే నేను అప్పటికి ఓ పది కథలు, 'వెన్నెల స్పర్శ'నవల మాత్రమే రాసి ఉన్నాను. నా రెండవ నవలే అంతటి విమర్శకుని మెప్పుపొందడం ఆనందాన్నిచ్చింది.

నా మొదటి నవల 'వెన్నెల స్పర్శ' స్వాతి నవలికల పోటీలో బహుమతి పొందినప్పటికీ సాహితీరంగంలో అప్పటికి నాకింకా చెయ్యి తిరగలేదనేది నా దృఢాభిప్రాయం. అలాంటి స్థితిలో ఓ మంచి నవల రాయగలిగానన్న తృప్తిని మొట్టమొదటగా చేకూరి రామారావుగారి మాటలతో పొందాను.

నాకు మొదటినుంచీ వాసిరెడ్డి సీతాదేవిగారు చాలా ఇష్టమైన గౌరవమైన రచయిత్రి. ఆమె రాసిన పుస్తకాలన్నీ ఒకటికి రెండుసార్లు చదివాను. ఎంతో అభిమానించాను అభిమానిస్తున్నాను కూడా.

ఈ నవలను వాసిరెడ్డి సీతాదేవిగార్కి అంకితం ఇవ్వాలనే సంకల్పం కలగగానే నేరుగా వెళ్లి ఆమెను కలిశాను.

'ఉమ్మడి కుటుంబాల మీద ఇంత మంచి నవల తెలుగులో ఇంతవరకూ రాలేదు' అన్నారు.

వారు అంకితం తీసుకోవడదానికి ఒప్పుకోవడమే నాకు చాలా సంతృప్తినీ, సంతోషాన్ని ఇచ్చింది. వారి ప్రశంస ఎంతో బలాన్ని కూడా ఇచ్చింది. తర్వాతి నా రచనలపై ఆ ప్రోత్సాహపు శక్తి పనిచేసింది కూడా!

అసలు మూడు తరాలు నవల రాస్తున్నప్పుడు నేను ఎంతో ఎంజాయ్ చేశాను. ఒక

సంఘటన తాలూకు ప్రభావం నాపై కొన్నిరోజులు ఉండేది. అది ఆనందమో కాస్త బాధాకరమో అయినప్పటికీ ఆ భావన నాలో కదులుతూనే ఉండేది.

ప్రతి నవలా రచయిత్రి/ రచయితకూ శిష్ట భాషపై పట్టు ఉంటుంది. ఆ పట్టులేని రచనలు పేలవంగా ఉంటాయి. మూడు తరాలులో మొదటితరం ప్రతినిధుల భాష రాయడానికి డాక్టర్ సంజీవ్‌దేవ్‌గారితో ఉన్న కలం స్నేహం నాకు ఎంతగానో ఉపకరించింది. ఆయనకు రాసే ఉత్తర ప్రత్యుత్తరాలతో మంచిభాష అభ్యాసం అయింది. ఆ భాషే నేనీ నవలకు వాడుకున్నాను.

ఏ నవలైనా మంచిపేరు పొందితే ఆ రచయిత/రచయిత్రి మాత్రమే పైకి కనిపిస్తారు. కానీ ఆ నవల పేరుతెచ్చుకోవడానికి వెనుక పునాదులవంటి కొన్ని శక్తులు ఉంటాయని చెప్పడానికే ఇదంతా చెప్పాను.

**పెదనాన్నను దృష్టిలో పెట్టుకునే..**

ఒక నవల రాసేటప్పుడు కొన్ని పాత్రలకు సంఘంలో ఎవరో ఒకర్ని దృష్టిలో పెట్టుకోవడం జరుగుతుంది. ఈ నవలలో మా పెదనాన్నగార్నిమనసులో పెట్టుకుని నాగేశ్వరరావు పాత్రకు రూపకల్పన చేశాను. అందుకేనేమో ఆ పాత్రంటే నాకెంతో ఇష్టం. నా రచనల్లో నేను సృష్టించిన అన్ని పాత్రల్లోనూ నాగేశ్వరరావు పాత్ర నన్ను చాలా మురిపిస్తుంది.

నా నవలను నేనే మళ్ళీ మళ్ళీ చదువుకునేంత ఇష్టాన్ని ఏర్పరచిందీ పాత్ర. నా నవలలన్నింట్లోకి ఇష్టమైన నవలగా దీన్ని భావించడానికి కారణం బహుశా ఇదేనేమో.

నాకు సంతృప్తినిచ్చిన మరోవిషయం ఉత్తరాలు. ఒక పెద్దమనిషి ఈ నవల చదివి ఉత్తరం రాయడమే కాక నన్ను కలవడానికి స్వయంగా మా ఇంటికి వచ్చారు. ఆయన వయసు సుమారుగా ఏడుపదులు ఉండొచ్చు.

'ఇంటిపెద్దకు ఉండాల్సిన లక్షణం కుటుంబ సభ్యులందరితో కలిసిమెలిసి మెలగడం అని మీ నవల ద్వారా తెలుసుకున్నాను. నాలో మార్పు తీసుకువచ్చింది ఈ నవల' అంటూ చెప్పి ఆనందపడ్డారు.

ఏ రచయిత్రకైనా తన తొలిదశలో ఏదో చెప్పాలన్న తపన... తనకు తెలిసింది నలుగురికీ తెలియజేయాలన్న ఆరాటం, ఎక్కువగా ఉంటాయనుకుంటాను. నామటుకు నాకు ఈ నవల నా మొదటిదశ రచన. ఆ దశలో నాక్కూడా ప్రతి పాత్రద్వారా ఏదో ఒకటి చెప్పాలనే తపన ఉండేదేమో. ప్రతిపాత్రనూ తనదైన ఒక ప్రత్యేకతను చూపించే విధంగా మలచాలనే ఆరాటమూ కనిపిస్తుంటాయి. అలా అని సహజత్వాన్ని దెబ్బతినకుండా చేసిన ప్రయత్నమూ కనిపిస్తూనే ఉంటుంది.

మొత్తానికి ఈ నవల నాకు ఆనందానిచ్చి రచనానుభవాన్ని పెంచి, మంచిపేరు తెచ్చిపెట్టి తృప్తి ఇచ్చిందని చెప్పవచ్చు'.

*సేకరణ: చంద్రప్రతాప్*

**చతుర సమీక్ష** | **ఆగస్టు 'చతుర' నవల అరవింద**

**సమీక్షకుని పేరు:** ____________________

**చిరునామా:** ____________________

____________________

____________________

నాటి చతుర




నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# ఆదర్శం

కప్పగంతుల మల్లికార్జున రావు

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. 1979వ సంవత్సరం ఆగస్టు నెల **చతుర**లో ప్రచురించిన కె. మల్లికార్జునరావు నవల **'ఆదర్శం'** పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

విద్య, అందం, ఆత్మవిశ్వాసం, శాంతం, సహనం, ధార్మిక చింతన, నిరాడంబరత, త్యాగగుణం వంటి మంచి గుణాలన్నీ ఆమె స్వంతం. అందుకు తగినట్లే భావి జీవితాన్ని గురించి ఆదర్శప్రాయంగా ఆలోచించి ఆచరించాలని దృఢ నిశ్చయం చేసుకుంటుంది. తనకు తానుగా వచ్చిన అదృష్టాన్ని నిర్లిప్తంగా వదులుకున్న ఆ అమాయకురాలు జీవితంలో ఎదురైన ఆటుపోట్లనెలా ఎదుర్కొందనేదే ఈ నవలలోని ప్రధానాంశం. "నిరాశ్రయేన న శోభంతే పండితాః వనితాః లతాః" అన్న సూక్తిని కొట్టిపారేసే ఆధునికులు సైతం జీవిత భాగస్వామిలో మానవత్వం, మంచితనం లేకుంటే భవిష్యత్తు నరక ప్రాయమేనని అంగీకరిస్తారు. ఆమెలో ఎన్ని సుగుణాలున్నా, ఆదర్శ భావాలున్నా పెళ్ళాడిన భర్త నీచుడైన కారణంగా ఆమె మంచితనం బూడిదలో పోసిన పన్నీరై భవిత కన్నీటి మయమవుతుంది. నాగరికత ఎంత పెరిగినా కొందరు స్త్రీల జీవితాలు అడుగడుగునా సమస్యల మయమేనని మరోసారి చాటుతుందీ నవల.

**ఇతివృత్తం:** ఈ నవలలోని నాయిక రుద్రమదేవి - తండ్రి స్వాతంత్ర్య సమరయోధుడు. తల్లి, చెల్లి, తమ్ముళ్ళుంటారు. స్వాతంత్ర్యం వచ్చాక ఆయన్నెవరూ తలచుకోలేదు. జీవనోపాధి, ఆర్జన లేదు. ఓ పత్రికాఫీసులో ప్రూఫ్ రీడరుగా చేరి బతుకీడుస్తుంటాడు.

ఈ వాతావరణంలో పెరిగిన రుద్రమకు సరిపుచ్చుకునే మనస్తత్వం అలవడుతుంది. అవసరమైతే తల వంచుతుంది. దొరికిన దానితో తృప్తిపడుతుంది. చదివించే స్తోమత తన తండ్రికి లేదని తెలిసినా కాలేజీకి వెళ్తానంటుంది. తండ్రి సైతం ప్రోత్సహించి పదవ క్లాసు ముగియగానే కాలేజీలో చేర్పిస్తాడు. అమ్మాయిని పెద్ద చదువులు చదివిస్తే అంతకంటే ఎక్కువ చదువుకున్న వరుడిని వెదకాల్సి ఉంటుందని రుద్రమ తల్లి హెచ్చరిస్తుంది. రుద్రమ శ్రద్ధగా చదువుకుని కాలేజీలో ఫస్టు మార్కులు సంపాదించుకుంటుంది. కాలేజీలో క్లాసుమేటు శారద రవీంద్రను పెళ్ళి చేసుకుంటుంది. కానీ మొదట్లో రవీంద్ర రుద్రమ అందం చూసి ఆమెను ప్రేమించి ప్రేమ లేఖలు రాస్తాడు. వాటినామె పట్టించుకోక పోవటంతో గత్యంతరం లేక శారదను పెళ్ళి చేసుకుంటాడు. అతని స్నేహితుడు

విష్ణువర్ధన్ రుద్రమను పెళ్ళాడతానని అడుగుతాడు. అతడినీ రుద్రమ తిరస్కరిస్తుంది.

డిగ్రీ ముగిశాక ఎమ్మేలో చేరుతుంది. యూనివర్సిటీలో మొదటి పాఠం చెప్పిన రామమోహన్ పాండిత్య ప్రతిభ, భావవ్యక్తీకరణ, ప్రజ్ఞ ఆమెను ముగ్ధురాలిని చేస్తాయి. తోటి విద్యార్థి మార్కండేయులు వ్యక్తిత్వం, పాండిత్యం ఆమెను ఆకర్షిస్తాయి. అతడు కూడా రుద్రమతో మర్యాదగా, స్నేహపూర్వకంగా మాట్లాడుతుంటాడు. ఒక దశలో అతడిని పెళ్ళాడితే బాగుండునన్న ఆలోచనా వస్తుంది. కానీ అతడు అర్ధాంతరంగా చదువాపేసి యూనివర్సిటీ నుండి నిష్క్రమిస్తాడు.

రుద్రమ చెల్లెలు ఝాన్సీకి చదువుపైన మనసు నిలవదు. ఇంటర్ పరీక్షలు ముగియగానే తను పరీక్ష బాగా రాయలేదనీ, పాస్ కావటం అసాధ్యమనీ, తనకు పెళ్ళి చేయమని, తల్లిదండ్రులకు చెప్పమనీ అక్క రుద్రమను కోరుతుంది.



యూనివర్సిటిలో క్లాస్‌మేట్ సంధ్యారాణి బాగా డబ్బున్నవారమ్మాయి. కార్లో వస్తుంది. అడుగడుగునా తను శ్రీమంతురాలిననీ, రుద్రమ బీదమ్మాయనీ ఎద్దేవా చేస్తుంటుంది. యూనివర్శిటిలో చదివే రోజుల్లోనే హాస్టలు ఖర్చులు తట్టుకోలేక ఓ చిన్నగది అద్దెకు చూసుకుని చేరిపోతుంది రుద్రమ. వండుకుని తింటూ చదువు కొనసాగిస్తుంటుంది. క్లాస్‌మేట్ సుధాకర్‌మూర్తి సినిమాల్లో వేషాలు సంపాదిస్తాడు. అతడు రుద్రమను పెళ్ళాడతానన్నా రుద్రమ తిరస్కరిస్తుంది. ఇంటావిడ కాశికాంబ రుద్రమతో స్నేహపూర్వకంగా ప్రవర్తిస్తుంటుంది. చదువు ముగిశాక రుద్రమకు పొరుగూళ్ళోని కాలేజిలో ఉద్యోగమొస్తుంది. ఆ రోజుల్లోనే కథలు రాస్తూ మంచి పేరు సంపాదించుకుంటుంది. ఈలోగా ఝాన్సీ తనకు నచ్చిన కుర్రాడితో ఎటో వెళ్ళిపోతుంది. కాలేజిలో ప్రిన్సిపాల్ కఠినమైన నియమాలను పాటిస్తాడు. ఇతరుల చేత పాటింపచేస్తాడు. అది రుద్రమకు నచ్చుతుంది. కిరణ్ అనే విద్యార్థి కావాలనే రుద్రమకు డాష్ ఇచ్చి అల్లరి చేస్తుంటాడు. ఇది చూసిన ప్రిన్సిపాల్ అతడిని కోప్పడతాడు. కుర్రాళ్ళను కూడ గట్టుకుని తిరగబడతాడు కిరణ్. ప్రిన్సిపాల్ రుద్రమకు ఆమె ఊరికే బదిలీ చేయిస్తాడు. వాల్యుయేషన్ కోసం మళ్ళీ హైదరాబాద్‌కు వచ్చినప్పుడు రామమోహన్ గారింటికి వెళ్తుంది. తను పెళ్ళాడానని, తన నిస్సార జీవితాన్ని ఇలా ఓ మలుపు తిరిగేలా చేసింది రుద్రమ రాసిన కథేనని చెబుతాడు రామమోహన్. రామమోహన్, అతని భార్య రుక్మిణి ఇద్దరూ రుద్రమను ఎంతో ఆదరించి గౌరవిస్తారు. "త్వరలో పెళ్ళి చేసుకోవాలి సుమా! ఇక్కడ మేం సంబంధాలు చూస్తాంలే" అంటుంది రుక్మిణి.

తను ఇక పెళ్ళి చేసుకోవాలని ఆ క్షణంలోనే నిర్ణయించుకుంటుంది. రుద్రమ ఊరికి రాగానే మర్నాడు పేపర్లో 'వధువు కావలెను' అనే ఒక అడ్వర్టయిజ్‌మెంట్ చూస్తుంది. తండ్రికి ఆ పేపర్ చూపించి "నాన్నా! నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను" అంటుంది. తండ్రి సంతోషించి "శుభం తల్లీ అలాగే కానిద్దాం" అంటాడు ప్రేమగా.

పళ్ళూడిపోయిన గాయకుడి పాట కచేరీలాగా ఎన్నో అపస్వరాలలో రుద్రమ పెళ్ళవుతుంది. దమ్మిడీ కట్నం తీసుకోలేదన్న పేరేగానీ రుద్రమ అత్త, ఆడపడుచు ఆరడి పెట్టి వచ్చినంత గుంజుకుంటారు. పెళ్ళికొడుకు నల్ల గా, నిరుత్సాహంగా, నిద్రపోతున్న వాడిలా, నల్లమందు తిన్నవాడిలా ఉంటాడు. పేరు చక్రవర్తి. మొదటి నుండీ రుద్రమను అవమానించటమే పనిలా పెట్టుకున్నాడు. పేరుకు అడ్వకేటేయినా కోర్టుకెళ్ళడు. కేసులు చూడ డు. ఇంట్లో ఎక్కడా కోర్టు ఫైళ్ళనేవి లేవు. తాగటం, పేకాట, గుర్రప్పందాలు, పరస్త్రీలతో సంబంధాలు, బ్రాకెట్టు వంటి అవలక్షణాలన్నీ

ఉంటాయి. "అన్నీ అవలక్షణాలే ఉన్న మగాడిని ఏ ఆడపిల్ల పెళ్ళి చేసుకుంటుందమ్మా! పైగా ఉద్యోగం చేసే పెళ్ళాం కావాలట. ఎవరూ చేసుకోకపోయేసరికి పేపరు ప్రకటనతో నాటకం ఆడారు. పాపం! దూరం కదా! తెలియక ఉచ్చులో నీవు ఇరుక్కున్నావు. చదువు, ఉద్యోగం ఉన్న బంగారంలాంటి పిల్లవు. నీకీ ఖర్మ పట్టింది" అని ఆ వీధిలో ఒకావిడ రుద్రమపై జాలి పడుతుంది.

అంతలో రుద్రమ గర్భవతవుతుంది. పుట్టింట్లో పురుడు పోసుకొంటుంది. మగబిడ్డను చూసి మురిసిపోతుంది. కొడుకు గొప్పవాడు కావాలని కలలు కంటుంది. అత్తింటివారు వాడికి వెంకటాచల రాజకుమార్ అని పేరు పెడతారు. పెరుగుతున్నకొద్దీ వాడు ఆకతాయిలా తయారవుతాడు. వాడిని తండ్రి గారాబం చేసి తనకు అనుకూలంగా పెంచుతుంటాడు. ఓ రోజు వాడి స్కూలు నుండి రుద్రమకు కబురొస్తే వెళ్తుంది. "మీ వాడు దొంగతనాలు చేస్తున్నాడు. విలన్ ఫోజులు పెట్టి అందర్నీ తంతున్నాడు. ఆడపిల్లల్ని ముద్దాడుతున్నాడు. మరో స్కూల్లో చేర్చుకోండి. టి.సి. ఇస్తాం" అంటుంది హెడ్‌మిస్ట్రెస్. రుద్రమ బాధగా బయటికొస్తుంది. సిగరెట్టు కాలుస్తూ కిళ్ళీ బడ్డీ దగ్గర తన కొడుకు కన్పించేసరికి మరింత బాధ పడుతుంది. చక్రవర్తి తల్లి, బామ్మలు సైతం చలాన్ని గారాబం చేసి తల్లి మాటను వాడు వినకుండా పెంచుతారు. రుద్రమకు పది, పదిహేను రోజులు జ్వరం వచ్చినా ఎవరూ పలకరించరు. రుద్రమకు తన కొడుకు స్థితి చూసి కడుపు తరుక్కుపోతుంది. ఈ వాతావరణానికి దూరంగా తీసుకెళ్ళి వాడి బుర్రలోని కాలుష్యాన్ని కడిగే యాలనుకుంటూ. ఆ మాటే చక్రవర్తితో అంటుంది. "వెళ్ళిపో, కావాలంటే! విడాకులిస్తా" అంటాడతడు. రుద్రమలో నిరాశ నిస్పృహలు పెరగ్గా మరో ఊరికి బదిలీ చేయించుకుంటుంది. కొడుకు తల్లి వెంట వెళ్ళనంటాడు. రుద్రమ వెళ్ళిపోయి కొత్త ఊరిలోని కాలేజీలో చేరుతుంది. ఆమె వద్దకు పైడమ్మ అనే ఓ అనాథ స్త్రీ తన కొడుకుతో కలిసి వచ్చి ఆశ్రయం కోరుతుంది. రుద్రమ జాలిపడి ఆమెను తన పనిమనిషిగా పెట్టుకుంటుంది. ఆమె కొడుకును హాస్టల్లో చేర్చి చదివిస్తుంది. ప్రొఫెసర్ రామమోహన్ భార్య రుక్మిణి మరణించగా తమ కూతురు కమలను తెచ్చి రుద్రమకిస్తాడు రామమోహన్. తన కూతురిలా పెంచుకుంటుంది. పనిమనిషి కొడుకు పెరిగి లాయరవుతాడు. వెంకటాచల రాజకుమార్ తల్లిని వెదుక్కుంటూ వచ్చి ఆమె వద్ద ఉంటానంటాడు. కానీ దొంగతనాలు మానడు. కమలవైపు వక్రంగా చూస్తుంటాడు. రుద్రమ ఓ రోజు కాలేజీ నుండి వచ్చేసరికి పైడమ్మ రక్తపు మడుగులో పడి ఉంటుంది. లోపల కమల గదిలో కేకలు, అరుపులు వినిపించి అటు వెళ్ళి తలుపు తెరుస్తుంది. కమల శీలాన్ని అపహరించ యత్నిస్తున్న తన కొడుకు కన్పిస్తాడు. తోటి ఆడదాని శీలం కాపాడేటందుకు కొడుకు అనైనా చూడకుండా అతడిని పొడిచేస్తుంది రుద్రమ.

కేసు కోర్టుకు వెళ్తుంది. వాద ప్రతివాదనలు జరుగుతుంటాయి. రుద్రమ తన కథనూ, సమస్యను, బాధను, వేదనను వ్యక్తం చేస్తుంది. తన కొడుకులోని దానవుడినీ, అతడి పాపపు ఆలోచనలను అంతర్గతంగా ఉన్న తన భర్త భ్రష్టరూపాన్ని చంపానని చెబుతుంది. తనలా మరో స్త్రీ విధి వంచిత కారాదన్న కోరికతో, తనలా మరో స్త్రీ నరకాన్ని అనుభవించరాదన్న తపనతో చంపానంటుంది. స్త్రీని మనిషిగా గుర్తించమనీ, ఆమె ఆత్మాభిమానాన్ని హత్య చేయకండనీ అందర్నీ కోరుతుంది. తనను ఉరి తీసినా సరే కానీ మంచితనాన్ని, ఉన్నత విలువల్ని, నైతిక ధర్మాన్ని మాత్రం ఉరి తీయ వద్దనీ. ఇదే తన చివరి కోరిక అంటూ కోర్టు బోనులో ఆమె అకస్మాత్తుగా కూలబడిపోవటంతో నవల ముగుస్తుంది.

స్త్రీ మనస్తత్వాన్ని, భావనలను, ఉన్నత ధర్మాల్ని, మగవాడి స్వార్థపూరిత మనస్తత్వాన్ని, అత్తింటివారి ఆగడాలను సహజంగా వర్ణించి కళ్ళకు కట్టించారు రచయిత. వాస్తవ జీవితాలకు ఎంతో దగ్గరగా ఉన్న నవల ఇది.



# ఎల్లలెరుగని, కల్లలెరుగనిదే ప్రేమ!




ప్రేమ గురించి రాయడమనేసరికి చెయ్యి వణికిపోతుంది. ఒక్క చెయ్యేనా దేహమూ...తో పాటు మనసు. నువ్వు... అతను... ఆమె... మనందరం సమస్త భూమండలం కంపించాల్సిందే... అదే ప్రేమశక్తి... ఎంత రాసినా, విడమర్చి చెప్పలేనిది ఆవిష్కరించలేనిది... ప్రేమ... దాన్ని అనుభూతించాలి, అంతే!

తొలి ప్రేమకు రంగు, రూపు కులమతాల భేదాలు అవసరం లేదు. కనపడవు కూడా! అదొక అద్భుతలోకం. రంగులన్నీ ప్రేమ తోనే మెరిసిపోతాయి! ప్రేమ కిరణాలు సోకి భూమి అద్దంలా మెరుస్తుంది. అచేత నమయ్యే ఆ వెలుగులో రెండు హృద యాలు... లోకమంతా అబద్ధం... అశా శ్వతం. ఒక్క రెండు హృదయాలు మాత్ర మే అప్పటికి నిలబడే నిజం! ఆ రంగుల లోకంలో నల్లటి నలుపూ వెన్నెలై పూస్తుం ది! హృదయం సున్నితమైన పూలరెక్కలా, దూది మబ్బుదొంతరలా ఎగసెగసిపడు తుంది. ఎంతటి నిర్బంధాన్నైనా ఎదుర్కోవ డానికి సిద్ధపడుతుంది.

ప్రేమలేని జీవితం నిరర్థకమనిపిస్తుంది. ఆ ఆలోచననే మనసు నిషేధిస్తుంది! ఇద్దరి హృదయాలు ఒక్కసారే స్పందిస్తే, ఇక వేరే అమరలోకాలవసరం లేదు. ఇంటి ముందర బురద మడుగే తామర కొలను! గడ్డిపూలు కూడా దేవలోకపు పారిజాతాలు! ప్రేమలో ఉన్నవాళ్ళు అర్ధరాత్రి నుంచే గులాబి మొగ్గ ఎలా విరుస్తుందో రేకురేకునూ స్పృశించి ఆ కొత్త జీవికి తమ ప్రేమను పరిచయం చేస్తారు. అరటి మొగ్గ విచ్చుకునే శబ్దం వింటూ మంచులో ప్రేమని రహస్యంగా తలుచుకుంటారు. ప్రేమించే వాళ్ళు ప్రతి దా న్నీ ప్రేమిస్తారు. ప్రేమించే హృదయం ప్రతి దాన్నీ తాకుతుంది. కంచె రేగు పూవు తామరపూవు అవుతుంది. మోదుగు పూలతో మాట్లాడుతుంది. రెల్లుగడ్డి పూలతో వృత్తాలు గీస్తుంది. పల్లేరు గాయలను ప్రే మగా నిమురుతుంది. వెంపలి పూల రంగుల్ని మరింతగా చేసి సీతాకోకచిలుక లకు కొంత అప్పిస్తుంది. దారిన పొయ్యే దానయ్యను కూడా పలకరిస్తుంది. రెండు జడలు... ఒక్కజడ...జడలో పూలు... నీట్‌గా డ్రస్‌లు... దాచుకున్న నెమళ్ళ ఈ కలు... పదేపదే అవసరం లేకున్నా దుమికే నవ్వుల జలపాతాలు... ఆకాశం పందిరి కింద తామిద్దరే... మిగతా ప్రపంచం, దాని తాలూకు బురద అవసరం లేదు. అస్తమా ను ఉదయాస్తమయాలను దాటి ఒకళ్ళనొ కళ్ళు చూడాలనుకునే ప్రేమ... ఒకరినొకరు ఏం చేసుకోవాలో తెలియని నిష్కల్మషమైన ప్రేమ... దేహ, దాహాల గురించింకా తెలీని ప్రేమ అది!

కాని ప్రపంచం అంటే ఈ మనుషులతో కూడిన సమాజాలే! అదీ కులాలు, మతాల రంగేసుకుని కృత్రిమంగా బతికే తెలివిగల చిన్న చిన్న జంతువుల సమూహం. జంతు వులనే ఎందుకన్నానంటే ఏ విషయమైనా ఏమోకాని ప్రేమ విషయానికొచ్చేసరికి మనుషులమనే సంగతి మర్చిపోతారు. ప్రేమించేటప్పుడు మనసులు కులం, మతం పట్టించుకోవని వీరికి తెలీదా?

ప్రేమ నిప్పు. చెదలంటవు. ప్రేమ నీరు.

జీవనాధారం. ప్రేమ గాలి పీల్చే ప్రతి శ్వాస నిశ్వాస ప్రేమ కొరకే! కానీ కొంత సమాజం... విలువలు... పరువు మర్యాదలు... పెద్దవాళ్ళ బెదిరింపులూ-వెరసి మధ్యరకం టీనేజ్ దాటిన వయస్సు మనస్సులు లొంగిపోతాయి. వీళ్ళు సమాజంలో భాగం కావడం ప్రారంభమయ్యాక పరువు ఆస్తి కులమతాల లాంటి కృత్రిమ తొడుగులు తొడుక్కోవడం ఆరంభిస్తారు. ఈ క్రమంలోనే తమ పిల్లలూ పెరుగుతారు. క్రమశిక్షణతో తమ సంతానాన్ని సాకుతారు...

ఇక ముప్పైలు దాటాక ప్రేమ అవసరార్థం కెరీర్ పెంచుకోవడం కోసం, ఒకరకమైన సపోర్ట్ కోసం ప్రేమతో దాగుడుమూతలాడతారు. అవసరం వస్తే చచ్చిపోతామని అంటారు.. కాని అదీ అబద్ధమేనని అంతరాత్మలకి తెలుస్తూనే ఉంటుంది.

ఇక వృద్ధాప్యపు ప్రేమ విషయానికొస్తే- కాళ్ళు వత్తించుకోడాలు... హాస్పిటల్‌లో తోడుండడాలు... ఒకరి చనిపోతే ఒంటరి దుఃఖాలు... వృద్ధాశ్రమంలో బలవంతపు చేర్పించడాలు... ప్రేమ దారి తప్పిపోతుంది. మానవీయత లోపిస్తుంది... సొంత మనుషుల్నీ డబ్బుల్ని త్రాసులో వేసి తూకం వేస్తుంది. అప్పుడు ఈ సమాజం, ప్రిస్టేజీ గుర్తుకురాదు. ఎందుకంటే అలాంటి జంతుతత్వం... అందరిలోనూ ఉంటుంది మరి!

ఇక మళ్ళీ స్వచ్ఛమైన ప్రేమ విషయానికొస్తే- మిగులపండిన అల్లనేరేడు పండు రంగులో కొడుకు పుట్టాడని ఆ ఊరు ఊరంతా సంబరంగా పండగ జరుపుకున్న ఏడుతరాల చరిత్ర! మొదటిసారి తొడిగిన మొగ్గను అపురూపంగా చూసుకునే గునుగుమొక్క తెల్ల హృదయం! మదర్‌థెరిస్సా రోగులకు చేసిన అమూల్యమైన సేవ. రక్తదానం, అన్నదానం, విద్యాదానం, ఏ కులమో మతమో తెలీకుండానే చనిపోబోయే తమ భర్తల, కొడుకుల శరీరావయవాలను దానం చేస్తున్న మానవీయ ప్రేమ... అద్భుతమైన ప్రేమ ముందు కృత్రిమంగా సృష్టించుకున్న గాలి గోడలు బలాదూర్! ఓహ్ ప్రేమ గొప్పది... మనం అల్పులం!

ప్రేమంటే రెండ్రోజులు ఎంజాయ్ చేసి మూడోనాడు బైబైలు చెప్పుకోవడమేనా? శరీరాల్తో ఆడుకుని ఆ తర్వాత మొహాలు చాటెయ్యడమా? మోసం ఏ నాటికైనా ప్రేమవుతుందా? ప్రేమ పేరుతో మోసగిస్తున్న జంతువులు, మళ్ళా అదే మోహంతో ఆత్మవంచనతో ఎలా బతగ్గలుగుతున్నారు? ప్రేమించకపోతే అంతం చేయాలనుకునే వారు, అంతుచూడాలనుకునేవారు ప్రేమికులెట్లా అవుతారు? అది ద్వేషం కదా! ప్రేమకు పూర్తి విరుద్ధమైన ద్వేషంతో



బతుకుతూ, ప్రేమకోసం చంపుతున్నామని చెప్పడం అబద్ధం! అలాంటి వాళ్ళకి ప్రేమ గురించిన చిన్న అనుభూతి కూడా తెలియనట్లు లెక్క! వాళ్లు ప్రేమించిన అమ్మాయిల్నే కాదు, ఎవరినైనా కసి నిండిన కళ్ళతో ఇలాగే చూస్తారేమో.

ఇలాంటి అమానవీయ కోణాలు, కులాలు, మతాలు, పేద, ధనికులు అంటూ తోటి మనుషులకు దూరమవడాలు- వీటన్నింటినీ ఎదురీది మనుషులుగా నిలబడి నిండు హృదయంతో, అవగాహనతో, చైతన్యంతో, మానవీయతతో, వసుధైక దృక్పథంతో ఎదుటి మనసుని హత్తుకుని తను వెలిగి, ఎదుటి హృదయాల్ని వెలిగించగలిగిన వారే నిజమైన ప్రేమికులు.

– షాజహానా

# కలికాలం

విశ్వమోహిని

చతుర కథ





దివాకర్ పిచ్చివాడిలా జుత్తు పీక్కున్నాడు, ఆనాటి దినపత్రిక మొదటి పేజీని చూడగానే. తెల్లారి న్యూస్ పేపర్ తెరిచినా, టీవీలో ఏ న్యూస్ ఛానెల్ ఆన్ చేసినా అన్నీ దుర్వార్తలే. హత్యలూ, మానభంగాలూ, దాడులూ, ఎన్‌కౌంటర్లూ, దోపిళ్లూ, దొంగతనాలే. నేరాల వార్తలతో అసహ్యంగా తయారై చదువరులకు జుగుప్సను కలిగిస్తాయి. నిత్యమూ ఇదే వరుస. ఏ ఒక్కరోజైనా సంతోషకరమైన వార్తలు, మనసుకు ఉల్లాసం కలిగించే విశేషాలూ కనిపిస్తా యేమో, వినిపిస్తా యేమోనన్న అతని ఆశ ఆడియాసే అవుతోంది. ఒయాసిస్‌గా మిగిలిపోతోంది. అలాగని న్యూస్‌పేపర్‌తో పళ్లు తోముకునే, టీవీతో బ్రేక్‌ఫాస్ట్ చేసే కల్చర్‌ని వదులుకోలేడు.

అందుకు జీవితంపైన రోత పుట్టించే ఆ వార్తలకు స్వస్తి పలికించే నిమిత్తం తన ఇష్టదైవమైన శివుడి గూర్చి తపస్సు చేయాలని నిశ్చయించుకున్నాడు.

'కఠోర' తపస్సు అనంతరం శివుడు ప్రత్యక్షమై, "వత్సా! ఈ నూతన వత్సరంలో ఏమి నీ కోరిక? '' అనడిగాడు చిద్విలాసంగా.

"విష్ యూ హ్యాపీ న్యూ ఇయర్!" అన్చెప్పి శివుడి కాళ్లకు మొక్కాడు దివాకర్. ఎందుకైనా మంచిదన్నట్టు రెండడుగులు వెనక్కి వేశాడు శివుడు.

దివాకర్ దీనాతిదీనంగా తన గోడు విన్నవించుకున్నాడు. 'దుర్వార్తలు చెవిన పడకుండా దుండగులు కళ్ల పడకుండా... వరమివ్వమని' కోరుకున్నాడు.

భక్తుడి కోరిక ఆలకించిన భగవంతుడు పక్కలో బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు. అతనికంటే దైన్యంగా వందనం పెట్టి, "బాబ్బాబు, అలాంటి గొంతెమ్మ కోర్కె మాత్రం కోరకు. ఈ కలికాలంలో భగవంతుడికి సాధ్యం కానిది, భక్తులకు వరంగా ఇవ్వలేనిదీ అదొక్కటే. అదే శాంతియుత ప్రపంచం! బ్రహ్మ చేసిన బొమ్మలు కాలంతో

పాటు తెలివి మీరిపోయాయి. ఆ బ్రహ్మతోనే పోటీ పడి నిరోధ్ అన్న ఆయుధంతో ఆయన సృష్టికే అడ్డు తగులుతున్నాయి. క్లోనింగ్ పేరిట ప్రతిసృష్టి చేస్తున్నాయి. ధర్మం స్థానంలో ధనం సృష్టించి, దాని కోసం చివరికి పశువుల నోటికాడి గడ్డీ, గాదం కూడా తినేస్తున్నాయి. ఆ ప్రక్రియలో ఎన్నో శాంతిరహిత కార్యక్రమాలకు పూనుకుంటున్నాయి. దాని పర్యవసానము, ప్రత్యక్షరూపమే నీవు నిత్యమూ వార్తలలో చూస్తున్నదీ, చదువుతున్నదీను. కనుక భూలోకంలోని నేటి (దు)స్థితిని మార్చేశక్తి నాకే కాదు, త్రిమూర్తులలో ఎవరికీ లేదు" అంటూ తేల్చి చెప్పేశాడు శివుడు.

దివాకర్ నిరుత్సాహపడిపోయి, "టీవీ సీరియల్స్ శాక్రిఫైస్ చేసి, 'చిరు' సినిమా ప్రలోభానిక్కూడా లొంగకుండా నేను చేసిన తపస్సు తుస్సుమని పోయినట్టేనా, స్వామీ?" అనడిగాడు.

శివుడు మిస్చీవస్‌గా నవ్వి, "దుర్మార్గాలనూ, దౌష్ట్యాలనూ అరికట్టడం సాధ్యం కాదన్నానే కాని, నీ కోర్కె తీర్చననలేదుగా?" అన్నాడు.

ఆ పలుకులతో దివాకర్ ముఖం కమలంలా విచ్చుకుంది.

"ఇకపైన నీకు దుండగులు కానరాకుండా, దుర్వార్తలు వినరాకుండా ఇదే నా వరం. ఈ క్షణం నుంచీ నువ్వు గుడ్డి, చెవిటి వాడివయిపోదువు గాక!" అంటూ వరమిచ్చేసి, ఇంకో క్షణం అక్కడుంటే విపత్తు అనుకున్నాడో ఏమో తక్షణమే అదృశ్యమయిపోయాడు శివుడు.

వరఫలం నశాళానికి ఎక్కడంతో దివాకర్ అదిరిపడ్డాడు. తక్షణమే చెవుడు, గుడ్డీ క్రమ్మేసేయడంతో "మోసం, దగా...! అన్యాయం, అక్రమం...! శివా! శివా శివా!!" అంటూ అరిచాడు.

"ఏంటండీ? శివశివా అంటూ నిద్దట్లో ఆ పొలికేకలేమిటీ? పట్టపగలే పీడకలలా?" అంటూ భార్య తట్టి లేపడంతో ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు దివాకర్. గుండెలపైనున్న న్యూస్ పేపర్ జారి కిందపడింది.

వేసవి కాలపు ఆదివారం, మిట్ట మధ్యాహ్నం భోంచేసి న్యూస్‌పేపర్ చదువుతూ నడుంవాల్చాడు తాను. తెలియకుండానే నిద్ర పట్టేసినట్టుంది. నిద్రలో తన ఆలోచనలకు సారూప్యంగా ఆ కల!

కల గుర్తుకు రావడంతో కంగారుగా కళ్ళు నులుముకుని చూశాడు. బాగానే కనిపిస్తున్నాయి. భార్య పలుకులు చెవిలో పడుతున్నాయి కనుక, చెవులూ చక్కగా వినిపిస్తున్నాయి. 'హమ్మయ్య' అని తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు.

'నిజమే, కలికాలంలో మనిషి భగవంతుణ్ణి



మించి ఎదిగిపోయాడు!', అనుకున్నాడు గాఢంగా నిట్టూరుస్తూ. ✦




జూన్ 2006 'చతుర' నవల

# రాతిలో తేమ

పై సమీక్షలు



## ఒయాసిస్సు

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

జూన్ 'చతుర'లో గీత (స్వర్ణ ప్రభాత లక్ష్మి)గారి నవల 'రాతిలో తేమ' చదువుతుంటే రకరకాల పూలున్న తోటలో తిరుగుతూ పరిమళాల్ని ఆఘ్రాణిస్తూ పూలు కోసుకుంటున్నట్లుగా అనుభూతించాను. లలితమ్మ పాత్ర ఎంతో ఉదాత్తంగా, ఆదర్శప్రాయంగా ఉంది. ఆమె వ్యక్తిత్వం ఉజ్వల జ్యోతి వంటిది. ఒక దీపం మరో వత్తిని వెలిగించగలిగినట్లు, ఆమె తన చుట్టూ వున్న చీకటి జీవితాలలో వెలుగులు నింపగలిగింది. ముళ్ళ కంప లాంటి సుందరమ్మ నుండి గులాబీలు పూయించింది. గయ్యాళితనపు శాపం తొలగించి తనలోని ఆత్మ సౌందర్యాన్ని ఆమెలో నింపింది. అనుభవ సారం, దాన్ని మించిన మానవత్వపు మహోన్నత శక్తితో తన చుట్టూ జీవితాలను చక్కదిద్దగలిగింది లలితమ్మ. జీవిత గమనంలోని సజీవ చిత్రాలకు అక్షర రూపం ఇచ్చినట్లు ప్రతి పాత్రా సంచరించాయి. భర్త అత్యాచారం చేసినప్పుడు "స్పేర్ పార్ట్ వేసుకునే అవకాశం శరీరానికి కూడా వుంటే ఎంతో బాగుంటుంది" అని మాధవితో అన్పించడం చాలా బాగుంది. హృదయ విదారకమైన ఆమె జీవితం చిగురించి పూలు పూసేలా చేసింది లలితమ్మ. ఆమె మాటలూ, సలహాలూ ఇతరుల జీవితాల్లో వెలిగించుకోవాల్సిన దీపాలు. కష్టసుఖాలలో అండగా నిలిచే మిత్రులు లభించడం వరం. ఓ అదృష్టం. జీవితం పొడవునా ఆమెకి చేతనైన ఉపకారాలు చేసింది. జీవితాన్ని ఉన్నత విలువలతో మలచుకొంది. అందరూ మదర్ థెరిసా అంతటివారు కాలేకపోవచ్చుగానీ ప్రయత్నిస్తే లలితమ్మలా కాగలరు. ఎక్కడ చూసినా మావోయిజం, నక్సలిజం, ఫాక్షనిజం చెలరేగిపోయి ప్రజలు భయభ్రాంతులు అవుతున్న ఈ రోజుల్లో శాంతి కాముకతతో, చల్లని దేవతలా ఆదుకునే లలితమ్మ కథ గీతోపదేశంలా వుంది. ఒయాసిస్సులా వుంది. రచయిత్రికి ధన్యవాదాలు, అభినందనలు. మరి రాతిలో తేమని చూడగలిగిన వారు హృదయంలోని ఆర్ద్రతకి వశమవ్వరా?

**- యం.వి. లత, సికింద్రాబాద్.**

## ఆలోచనామృతం (రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

"వేసవి కాలంలో తెల్లవారుఝామున చల్లగా పలకరించే పిల్లతెమ్మెరలాగా హాయిని కలిగించింది" అన్న నవలలోని వాక్యాలు 'రాతిలో తేమ' నవలకు సరిగ్గా సరిపోతాయి. అంతగా ఆహ్లాదాన్ని, చల్లదనాన్ని కలిగించింది ఈ నవల. చదవడం మొదలు పెట్టిన తరువాత ఎక్కడా ఆగకుండా చదివించిన కథా కథన నైపుణ్యం అద్భుతం.

విద్యా వినయసంపదలతో మూర్తీభవించిన లలితమ్మగారు ఎన్నో కఠిన సమస్యలను సునాయాసంగా పరిష్కరించిన విధానం చదువుతుంటే పాత్రలతో మమేకమైన అనుభూతి కలిగింది. వృత్తి నిర్వహణలో అంకిత భావంతో పని చేస్తే ఎంత ఆత్మ సంతృప్తి కలుగుతుందో లలితమ్మగారి జీవితాన్ని

చూస్తేనే తెలుస్తుంది. పదవీ విరమణానంతరం వచ్చిన డబ్బుతో వృద్ధాశ్రమాన్ని స్థాపించి నిరాశ్రయులయిన ఎందరో అభాగ్యులకు చేయూతనందించిన అమృతమూర్తి. ఆమె స్వార్థం రాజ్యమేలుతున్న నేటి కాలంలో లలితమ్మగారు చూపిన ఉదారత ఎందరికో మార్గదర్శకం కావాలన్నది రచయిత్రి ఆశయం. అందరికి మనస్తాపాలు కలిగిస్తున్న సుందరమ్మగారిని అర్థం చేసికొని ఆవిడ దారిలోనే వెళ్ళి మంచి మనసున్న వ్యక్తిగా తీర్చిదిద్దిన లలితమ్మగార్కి నిజంగా హేట్సాఫ్. స్వార్థపరాయణురాలైన సుందరమ్మ గారి నోట "మా వనజ" అన్న మాట చాలు-ఆవిడ ఎంతో మారిపోయారన్నదానికి సాక్ష్యంగా.

జీవితంలో ఎన్నో బడిదుడుకులు ఎదురయినా నిబ్బరంగా జీవితాన్ని గడుపుతున్న ధీశాలి మాధవి. లలితమ్మగారి మార్గదర్శకత్వంతో మోడుబారిన తన జీవితానికి వసంతాన్ని తెచ్చుకొన్న అదృష్టవంతురాలు. లలితమ్మగారి దయ, ప్రోత్సాహం లేకపోతే ఇంత మంచి జీవితాన్ని పొందేదాన్ని కాను అని మాధవి అనుకోవటం లలితమ్మగారి ఆలోచనా పటిమకు తార్కాణం.

సాహిత్యం ఆలోచనామృతం. ఈ నవల చదువుతున్నంతసేపు ఆలోచనల అమృతంతో మనసు నింపిన మంచి నవల 'రాతిలో తేమ'.

– ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు

## దాగి ఉన్న మానవత (మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

రాతిలో చలమ దాగుంటుంది. రాతిని తొలిస్తే ఆ లోపలి పొరల్లోని నీళ్ళు బహిర్గతమౌతాయి. సుందరమ్మలాంటి సంకుచిత మనస్కులు మన చుట్టూ వుండొచ్చు కానీ వాళ్లలో మానవత, ఆర్ద్రత దాగివుంటాయి. ఆ మానవత్వాన్ని వెలికి తీసే ప్రయత్నం చేయాలి. 'చతుర' నవల 'రాతిలో తేమ' ఈ విషయాన్ని చర్చించింది. రచయిత్రి గీత-లలితమ్మ, సుందరమ్మ, మాధవి మొదలైన పాత్రలతో కథను అద్భుతంగా నడిపించారు. విద్యావంతురాలైన లలితమ్మ తన ఉన్నతినే చూసుకోకుండా, సమాజంలో సుందరమ్మలాంటి వారిని మార్చడం, పదవీ విరమణ తర్వాత ఆశ్రమం స్థాపించి దిక్కు లేని పెద్ద వాళ్ళకు సహాయం చేయడం ఎంతో బాగుంది. జీవితంలో దెబ్బతిన్న మాధవికి ధైర్యం చెప్పి, ద్వితీయ వివాహానికి ప్రోత్సహించి ఆమె జీవితం సక్రమంగా సాగిపోయేలా చేసింది లలితమ్మ. ప్రతి మనిషికీ ఏదో ఒక వ్యాపకం ఉండాలి. అది ఇతరులకి అంటే పదిమందికీ ఓదార్పు, ఆలంబన అవడం బావుండదూ? "దేవుడు నాలుగు గోడల మధ్య బందీకాదు. మన పనిలో, మన చుట్టూ ఉన్న వారిలోనే ఉన్నాడు", "మనకేం కావాలో తెలియని స్థితికన్నా దౌర్భాగ్యం మరేం ఉంటుందిఁ" "కాలక్షేపానికి, మానసిక ఉల్లాసానికి మంచి సాహిత్యంతో పరిచయం"వంటి ఆణిముత్యాల్లాంటి వాక్యాలతో ఈ నవల ఆద్యంతమూ అత్యంత రసవత్తరంగా సాగింది. మనసును కదిలించి, ఆలోచింపచేసే నవల. గీతగారికీ, 'చతుర'కూ అభినందనలు!

- బి. స్వర్ణాంబ, తిరుపతి

## మనో విశ్లేషణాత్మక నవల (నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

గీతగారి నవల 'రాతిలో తేమ' సాధారణంగా కనిపిస్తూనే అసాధారణంగా సాగుతూ ఆద్యంతమూ పట్టు విడవకుండా చదివించే ఓ అద్భుత నవల!... మానవ మనస్తత్వంలో అవ్యక్తంగా దాగి ఉండే ఓ అంశాన్ని స్పృశిస్తూ సాగిన మనోవిశ్లేషణాత్మక నవల ఈ 'రాతిలో తేమ'.

ఏ మనిషీ కూడ పుట్టుకతోనే కరడు గట్టిన కఠినశిలగా ఆవిర్భవించడు!... అతనిలోనూ అంతర్లీనంగా మానవత- దయ- జాలి- ఆర్ద్రత వంటి లక్షణాలు దాగి ఉంటాయి. కానైతే

వాటిని పరిస్థితులలో అనుభవాలలో అణగదొక్కి అతన్నో కఠిన శిలగా మార్చేస్తాయి!... అతనిలో అంతర్లీనంగా దాగి ఉన్న ఈ లక్షణాలను గుర్తించి వెలికి తీయగలిగే వ్యక్తి తారసపడినప్పుడు అతను కూడ ఓ మానవతా మూర్తిగా సమాజంచేత గౌరవింపబడే వ్యక్తిగా మారడం తథ్యం! అదే సత్యాన్ని చాటి చెపుతుందీ నవల!

ఈ సత్యనిరూపణకి రచయిత్రి ఎంచుకున్న పాత్రలు- సుందరమ్మ, లలితమ్మ!... మాణిక్యమ్మ మాటల్లోనే చెప్పాలంటే- ఈ సుందరమ్మ "చిన్నప్పుడు బాగానే ఉండేది" ఆమెకి జీవితంలో ఎదురయిన అనుభవాలు- అతి పిన్న వయసులో పెళ్ళి, ఆ పెళ్ళి కాస్తా పెటాకులుగా పర్యవశించడం-తండ్రి చదువు సంధ్యలు చెప్పించక ఇంటి చాకిరికే పరిమితం చెయ్యటం ఇవన్నీ ఆమెనో శాడిస్టులా తయారుచేస్తాయి!... ఏ వ్యక్తికయినా (రచయిత్రి మాటల్లోనే) జీవితం పొడుగునా చేదు అనుభవాలు ఎదురవుతూ ఉంటే రేపు అన్నది ఆశావహంగా లేదన్న సత్యం వెన్నుతట్టి ఉంటే ఆ వ్యక్తి సుందరమ్మలా, శాడిస్టు గయ్యాళిలా, పెడసరంగా తయారుకావడం సహజం! అదే సుందరమ్మ విషయంలోనూ జరిగి, కన్న కొడుకులా పెంచిన ప్రకాష్ పట్ల, వనజ పట్ల, సమాజం పట్ల అమానుషంగా ప్రవర్తించేలా చేసింది. ఈనాటి సమాజానికి లలితమ్మ లాంటి వ్యక్తులు ఎంతో అవసరం! కుటుంబ సమస్యలు, కలహాలతో మనశ్శాంతిని కోల్పోతున్న ఈనాటి వృద్ధులు, రిటైర్డు ఉద్యోగులకు ఆమె పథం శిరోధార్యం! దశ, దిశ తోచక అలమటించే మాధవి లాంటి వ్యక్తులకు, సమాజం చేత ద్వేషించబడి, నిర్లక్ష్యం చెయ్యబడుతున్న ఎందరో సుందరమ్మ లాంటి వ్యక్తులకు లలితమ్మ లాంటి వ్యక్తుల ఆసరా, ఆలంబన అత్యావశ్యకం! సాదాసీదాగా చిత్రిస్తూనే- నవలకి కేంద్ర బిందువుగా లలితమ్మని తీర్చిదిద్దిన రచయిత్రి ప్రతిభ బహుధా ప్రశంసనీయం.

–పి. లక్ష్మి, హైదరాబాద్.

## వెలుగు చూసిన మంచితనం (ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

ఈ నెల 'చతుర' నవల 'రాతిలో తేమ' చక్కటి కథాంశం, మరింత చక్కటి కథనం కలిగి మనస్సును ఆకట్టుకుంది అంటే అతిశయోక్తి కాదు. నవలలో మనకు పరిచయం అయిన పాత్రలు నిజజీవితంలో ఎప్పుడో ఒకప్పుడు తారస పడివుంటాయి. ఉదాహరణకు సుందరమ్మ లాంటివారు సహజంగా అలాంటి వారిలో కూడా మంచీ మానవత్వమనేవి ఉంటాయి. కానీ వారి జీవితంలో తటస్థపడ్డ చేదు అనుభవాలు ఆ ఉన్న కాస్త మంచిని మబ్బు కప్పి వున్నట్లుండటం వల్ల పరమ గయ్యాళిగా ప్రవర్తిస్తుంటారు. సరైన సమయంలో ఏ చిన్న పిల్లతెమ్మరైనా స్పృశించడం జరిగితే చిరుజల్లులా ఆ మంచితనం అమృతం కురిపిస్తుంది, అమృతమూర్తులను చేస్తుంది. జీవిత సత్యాలను సహజత్వంగా మలచి పాఠకులకు ఒక సందేశాత్మక నవలను అందచేసిన రచయిత్రికి, మంచి రచనను పాఠకులకు అందచేసిన 'చతుర'కు అభినందనలు.

- యస్. హరనాథ్‌బాబు, హైదరాబాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net

## అరుదైన మొక్క

వెండి వెలుగులో మెరిసిపోయే ఈ మొక్క పేరు 'సిల్వర్ స్వోర్డ్'. హవాయి. మాయి అనే రెండు దీవుల్లో మాత్రమే పెరుగుతుంది. అగ్నిపర్వత పీఠం దీని జన్మస్థానం. కిందభాగం పొడవాటి వెండి రంగు ఆకులతో పొదవలె ఉంటుంది. దాని నుంచి కాండం మాదిరిగా పెరిగే స్పైక్ దాదాపు మనిషంత పొడవు ఉంటుంది. 10 నుంచి 15 సంవత్సరాలు పెరిగే ఈ మొక్క జీవన చరమదశలో మాత్రమే ఐదువందల వరకు అందమైన పూలు పూస్తుంది. పూలు విత్తనాలతో కూడిన నల్లని ఫలాలుగా పరిణామం చెందగానే మొక్క చనిపోయి ఎండలో ధగధగా మెరిసే అవశేషం మాత్రం మిగులుతుంది.



